# కాంతాపహరణము

(మనోహరమైన నాటకము)

శ్రీయుత

పుల్లేటికుర్తి కృష్ణమాచారిగారిచే

విరచితము.



Printed by:- COCANADA PRINTING WORKS,
COCANADA.

Published by:- Bh. N. SERMA,
*Proprietor*, Vegu-Jukka Series,
Pudipeddi vari Street,
BERHAMPORE.
*(Ganjam)*

1st Edition
*1000 COPIES.*
1928



చందాదారులకు
ఒక రూ 1-0-0.
ఖర్చులు ప్రత్యేకము.

ఇతరులకు రూ 1-8-0.
(ఖర్చులు ప్రత్యేకం)

☞ *For Copies apply to the publisher.*

☞ మతి చెప్పకేమి:—

చందాదారులకు లాభము రూ 2-4-0 (సంవత్సరమునకు)

చందాదారులారా!

పోస్టేజి మనియార్డరుఖర్చులు మేమే భరించి వి. పి. ద్వారా గ్రంథముఁ బంపినయెడల మాకు కిట్టుబడికాదు. మీరే భరింపవలసి వచ్చిన, నిష్కారణము దండుగ యగుచున్నదని మీరే కాదు మేము కూడ, దుఃఖపడవలసినదే. అందుచే ఉభయులకు నష్టములేకుండ ఒకయుపాయము చెప్పుచున్నారము వినుండు. ముందు అడ్వాన్సుగా, 1 రూ. మాత్రము, మేము ఇటిమేషను పంపినవెంటనే, మాకుఁ బంపినఁజాలును. సంవత్సరము చందా ఒక్కమారుగ పంపినను పంపవచ్చును. నిర్బంధము లేదు. మీ అడ్వాన్సు అందినవెంటనే గ్రంథము అన్‌రిజష్టరు పార్సెలుద్వారా, (అందుకయిన పోస్టేజి మేమేభరించి) పంపుదుము ఇది గ్రహింపక చందాదారులు నష్టముపొందిన ప్రయోజనము లేదు. పోషకులుగాని రాజపోషకులుగాని లేకపోయినను చందాదారుల యభిమానప్రోత్సాహముల బలమునవిల్చి పనిచేయుచున్న మాగ్రంథమాలకుఁ దోడ్పడి యుద్ధరింపవలెను. చాలమంది చందాదారు లీవిధముగ అడ్వాన్సు పంపుచున్నారు. అన్ రిజష్టరు పార్సెలుద్వారా పంపిన గ్రంథము తప్పక అందితీరును.

ఇఁకమీఁదట ప్రతిగ్రంథము చక్కని గ్లేజు కాగితముపై ముద్రింపఁబడును. చిత్తుకాగితము ఉపయోగింపఁబడదు. అందముగు రేపరుబైండు చేయఁబడును.

ప్రతిగ్రంథము చందాదారులకు 1 రూ॥ ఖర్చులు చందాదారులే భరించుకొనవలెను. అడ్వాన్సుగా బంపినవారికి ఖర్చులుండవు.

ప్రతివిషయములో క్రిందివిరునామా గమనింపవలెను:—

భాగవతుల నృసింహశర్మ,

ప్రొప్రైటర్ —"వేగుఁజుక్క" గ్రంథమాల

పూడిపెద్దివారివీధి

బరంపురం — గంజాంజిల్లా.

వేగుంజుక్కు గ్రంథమాల - బరంపురం (గంజాం.)

# శ్రీ తులసీ రామాయణము.

## భగవాన్ తులసీదాసుగారి రామాయణము.

**Mahatmaji Writes in young India dated April 27, 1921.**

"The Ramayana used to be regularly read in our family. A Brahmin Called Ladha Maharaj used to read it. He was striken with leprosy, and he was Confident that a regular reading of the Ramayana would cure him of leprosy, and indeed he was cured of it."...........

ఈ రామాయణమును గూర్చి శ్రీ గాంధిమహాత్ముండు "యంగ్ ఇండియా" అను పత్రికలో నిట్లు వ్రాసెను:—

"మాయింట బ్రతిదినము నీరామాయణమును లాధా మహారాజను బ్రాహ్మణుండు చదువుచుండెను. అతండు కుష్ఠరోగి. ఈరామాయణపఠనమువలన దనరోగము నివర్తించునని విశ్వసించి పఠించుచుండెను. నిజముగ, అతండారోగమునుండి విముక్తిగాంచెను."......

The Christian Literature Society వారీగ్రంథప్రాశస్త్యమును, "Divine in carnation as taught by Ramayana of Tulasi Dass" అను గ్రంథముఖమున వెల్లడించినారు. దీనిప్రాశస్త్యమిట్టిదని మేమింతకంటె నధికముగ వ్రాయజాలము. ఈగ్రంథమును పద్యకావ్యముగ నాంధ్రీకరించుచున్నారము. గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు. సార్థకబిరుదాంకితులగు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి పీఠికతో, మహాకవి తులసీదాసుగారి పటముతో, ఆంధ్రీకరించిన గ్రంథకర్త ఛాయాపటముతో, శ్రీరామపట్టాభిషేక చిత్రపటముతో, మిక్కిలి సొగసుగ ముద్రింప

బడి బాలకాండము + అయోధ్యాకాండము (రెండుభాగములుఁ) గలిపి యొకసంపుటముగా నిండుకేలికో బైండు చేయఁబడుచున్నది. దరిదాపు 3000 పద్యములు. విలువ రూ 3-0-0 మా ఆంధ్రసోదరులు దయయుంచి రూ 1-0 0 అడ్వాన్సుతో సహా ఆర్డరు బుక్ చేసికొనవలెను. కొలదిప్రతులుమాత్రమే కలవు.

☞ బాలకాండము ప్రథమముద్రణము 1000 ప్రతులు సరిపోయినవి ద్వితీయముద్రణము కొలఁదిప్రతులుమాత్రమే ముద్రింపించి, అయోధ్యాకాండము రెండుభాగములతోఁ గల్పి కొన్ని ప్రతులమాత్రమే నిండుకాలికో బైండు చేయించుచున్నారము. వలయువారు వేగముగా అడ్వాన్సు పంపుకొనవలెను.

## విజ్ఞాపనము.

మేము ప్రచురించిన పాదుకాపట్టాభిషేక మనుగ్రంథములో, శ్రీతులసీరామాయణ ప్రకటనపత్రికయందు బాల + అయోధ్యాకాండముల సంపుటము (కేలికో బైండు) విలువ రూ 2-8-0 అని అచ్చుపొరపాటుపడినది. 3 రూ॥ అని యెఱుంగవలెను.

అడ్వాన్సుగా 1 రూ॥ తోసహా ఆర్డరిచ్చినవారికే నిండుకేలికో బైండుగల సంపుటము లభించును.

విడిప్రతులు:— బాలకాండము 1 రూ॥ అయోధ్యాకాండము రెండుభాగములు రూ 2/. ఖర్చులు ప్రత్యేకము.

గమనింపుడు:— కొలది ప్రతులుమాత్రమేగలవు.

చిరునామాలు సంపూర్ణముగ వ్రాయవలెను.

ఇట్లు,

భాగవతుల నృసింహశర్మ,
ప్రొప్రైటర్ వేఙ్కటకృష్ణగ్రంథమాల,
పూడిపెద్దివారివీధి, బరంపురం, గంజాంజిల్లా.

# Author's Note.



Compelled by some of my friends, to write a small book of this nature, I now come to comply with their request. We have had a talk now and then in our discussions about the present by-gone systems of marriages, especially in Brahmans who, regardless of the happiness of their young children give in marriage to old pleople in return to lumpsome of money—in spite of modern civilization which is in full swing throughout the Globe.

They as well as we know perfectly well the evil, resulting there-by. Accidents as are described in this little book are not so uncommon.

Subjects of this nature should be put forward—as my friends suggest in words that lead to go through—with interest, rather than putting in pure classical language, which is very common and so passes off unseen. This little book my friends report as both advantageous and refreshing to a busy brain. But I shall think myself highly compensiated, if only such people as are concerned, come to think that they can derive any advantage from it.

As to the story that pervades it is not entirely a false one, excepting with some exaggarations. It is my capital misfortune, that I could not get this book published up till now though this was written in 1925 when I was a medical student, at Vizag. As the plot is novelitic. I had to add to the original drama a prologue and an Epilogue which connects the story. I crave the indulgence of the reading public for introducing the same.

I have herein quoted some of the verses from Tara Sesankam, Nirankusopakyanam and Hemasundaropakyanam (Sarasa Srungaram).

Once in a topic regarding old poets and their description of Srungaram, an old man belonging to an Agraharam in Vizag District gave out some verses which he said belongs to " Hemasundaropakhyanam. " Subsequent to this I have seen a criticism written by Mr. Srirangam Someswara Sastri in the Andhra Patrika about the very same book and I was very anxious to go through it once. Eventually this desire was fulfilled, as I could have it read before this publication, in Vegujukka Grandhamala at Berhampore.

The book is most be fitting to its name, as the major portion of it contains srungaram—the prominent episode embodying telugu literature. The book imparts good morals and on the whole a best work to be published, at an early period.

**Author.**



# PERSONAL OF THE PLAY.

## MALES.

| | | | |
|---|---|---|---|
| 1. | Venkatesam | ... | Hero. |
| 2. | Ramasastry | ... | Heroine's father. |
| 3. | Appalanarasimham Pantulu | | Heroine's husband. Manager of Forwarding Agency. |
| 4. | Venugopalam | ... | Heroine's brother. |
| 5. | Kamaiah | ... | Coffee hotal keeper. (Vizag) |
| 6. | Rangaiah | ... | Hotal keeper (Madras). |
| 7. | Ramarao | ... | Friends of Venkatesam. |
| 8. | Krishnarao | . | Friends of Venkatesam. |
| 9. | Narayanamurty | ... | Friends of Venkatesam. |
| 10. | Subbavadhanlu | ... | An orthodox Brahmin relative of Ramarao. |
| 11. | Rikshavala. | | |
| 12. | Broker. | | |
| 13. | Butchaiah Chetty | ... | Debtor of Venkatesam appearing at Madras. |
| 14. | Head-clerk of Forwarding office, Madras. | | |
| 15. | Munuswami, Gunnaiah etc., etc., persons messing to Rangaiah's hotel. | | |
| 16. | Telegraph and Postal peons. | | |
| 17. | Venkanna Chettiar | ... | Lover of Rajamani. |
| 18. | Peon of Appalanarasimham Pantulu. | | |
| 19. | Kanthappa | ... | A coffee hotel keeper at Madras. |
| 20. | Some Sanyasis. | | |
| 21. | A Kapu and his son (appearing in Epilogue). | | |

## FEMALES.

| | | | |
|---|---|---|---|
| 1. | Kanaka Lakshmi | ... | Heroine. |
| 2. | Lakshmamma | ... | Heroine's mother. |
| 3. | Manikyam | ... | Mother of Kamala a D. G. at Vizag. |
| 4. | Rajamani | ... | A Dancing girl of Madras. |
| 5. | Goppi | ... | Servant maid of do. |

6. Mother of Rajamani.
7. Wife of Kapu appearing in the Epilogue.



## SCENES IN THE PLAY.

*Prologue* ... Scene at the house of Ramasastri Jagannadhapuram Agraharam.

*Act I* Scene one—Vizag beach.
Scene two—Ramarao's house, Vizag.

*Act II* Scene one—Central Station, Madras.
Scene two—Rangaiah's hotel, do.
Scene three—A Street, do (a moving scene)

*Act III* Scene one—Mint Street, do.
Scene two—D. G's house, do

*Act IV* Scene one—Thumbu Chetty Street, do.
Scene two—Rangaiah's hotel, do.
Scene three—Appalanarasimham pantulu's house, do.

*Act V* Scene one—D G's house, do.
Scene two—Appalanarasimham's house, do.

*Act* VI Scene one— do. do.
Scene two—D. G's house, do.

*Act VII* Scene one—Appalanarasimham's house, Madras.
Scene two—Rangaiah's hotel, do.
Scene three—Appalanarasimham's house, do.

*Epilogue*—Bezwada choultry.

N B.—*Permission should be taken from the Author through the Publisher before staging this drama in full or in parts.*

**Bh. N. SERMA,**
***Publisher,***
**VEGU-JUKKA SERIES,**
**Berhampore,**
*Ganjam District.*



# TIME ANALYSIS OF THE PLAY.



| | | |
|---|---|---|
| 1 | Prologue ... | 2 hours. |
| 2 | Interval between Prologue and Scene one of Act I | 10 years. |
| 3 | Scene one of Act I ... | 3 hours. |
| 4 | Interval between Scene one & Scene two of Act I | 1 day. |
| 5 | Scene two of Act I ... | 2 hours. |
| 6 | Interval between Scene two of Act I and Scene one of Act II | 2 days (joining to Madras). |
| 7 | Scene one Act II ... | 1 hour. |
| 8 | Interval between Scenes one and two of Act II | No interval. |
| 9 | Scene two of Act II ... | 1 hour. |
| 10 | Interval between scenes two & three of Act II | 5 weeks. |
| 11 | Scene three of Act II ... | 3 hrs. (moving scene) |
| 12 | Interval between scene three of Act II and scene one of Act III | 1 week. |
| 13 | Scene one of Act III ... | 1 hour. |
| 14 | Interval between scenes one & two of Act III | No interval. |
| 15 | Scene two of Act III ... | 3 hours. |
| 16 | Interval between scene two of Act III & scene one of Act IV | 2 weeks. |
| 17 | Scene one of Act IV ... | 1 hour. |
| 18 | Interval between scenes one & two of Act IV | No interval. |

| | | |
|---|---|---|
| 19 | Scene two of Act IV | 1 hour. |
| 20 | Interval between scenes two and three of Act IV | 1 day. |
| 21 | Scene three of Act IV ... | 2 hours. |
| 22 | Interval between scene three of Act IV and scene one of Act V | 1 day. |
| 23 | Scene one of Act V ... | 2 hours. |
| 24 | Interval between scenes one & two of Act V | 3 days. |
| 25 | Scene two of Act V ... | 1 hour. |
| 26 | Interval between scene two of Act V & scene one of Act VI | No interval. |
| 27 | Scene one of Act VI ... | 3 hours. |
| 28 | Interval between scenes one & two of Act VI | Continuation |
| 29 | Scene two of Act VI ... | 1 hour. |
| 30 | Interval between scene two of Act VI & scene one of Act VII | 1 hour. |
| 31 | Scene one of Act VII ... | ½ hour. |
| 32 | Interval between scenes one & two of Act VII | No interval. |
| 33 | Scene two of Act VII ... | 1 hour. |
| 34 | Interval between scene two & three of Act VII | 1 day |
| 35 | Scene three of Act VII ... | 1 hour. |
| 36 | Interval between scene three of Act VII and Epilogue | 2 days |
| 37 | Epilogue ... | 4 hours. |

| | Years | Months | Days | Hours |
|---|---|---|---|---|
| Progress of the play | 10 | 2 | 12 | 10½ |



# DUTIFULLY DEDICATED

TO

***My deceased Parents***

**Pullatikurty Seshaiahachari**

AND

**Sathiamma.**





## మాతృపితృ ఋణవిముక్తి.



గీ. తర్పణాదుల నగ్రసోదరుఁడు ఘనుఁడు
తల్లిదండ్రుల ఋణముక్తిఁ ధన్యుఁ డయ్యె
నేనుఁ బితౄణముం దీర్పఁ దీని నంకి
తముగ నిచ్చితి మాతల్లిదండ్రులకును.

గ్రంథకర్త.

# కాంతాపహరణము.



## పూర్వరంగము.

స్థలము :—జగన్నాధపురం అగ్రహారం—రామశాస్త్రులు యిల్లు.

[రామశాస్త్రులు లక్ష్మమ్మ మాట్లాడుచుందురు.]

లక్ష్మ—మేనల్లుడు మేనల్లుడని అట్టె అనకండి. నిక్షేపంలాంటి సంబంధాలు వస్తూవుంటే వూరూ పేరూ లేని, మీరు నేనూ చూడని మేనల్లుడు యెవడో ఆకాశంమీద వున్నాడంటూ కేంవిషి? యిదేం చాదస్తం అమ్మా యీమనిషికీ? దాని ఖర్మాని కొద్దీనీ.

రామ—నీవు చూడకపోతే సరా. నేను చూడలేదేంవిటి? నాకు తెలియదూ?

లక్ష్మ—అయితే మీయిష్టం—దానిఖర్మ యేలాగువుందో ఆలాగు అవనీ. యీప్రశంశలో నాకేంవీ జోక్యములేదు. నన్ను పిలవకండి. వెధవ ఆలో—

రామ—పోనీ వాడు కాకపోతే మరొకడు—నీ యిష్టం యేదోనో చెప్పవేం?—యేదో రానిమాట—నోట్లో సాణుగుతే యేం తెలుస్తుంది.

లక్ష్మ—(వూరకుండును.)

రామ—అయితే రాంపంతులుకు యిచ్చేదాం అంటావా?

లక్ష్మ—నేనేంవీ అనను. మీరే ఆలోచించండి బాగాను—పదియెకరాల పల్లం వుంది. పాతికవేలుకు పైగానే ఆస్తి—పదిహేను—

రామ—వక్క సొమ్ముకోసంవే చూసుకుంటే యేలాగు అవుతుంది. కాస్త ప్రియంకూడా చూడాలనా లేదా? రాంపంతులుకు బొత్తిగా యెన్నభై యేళ్ళపడి. యెంతసొమ్మువున్నా కాస్త లౌక్యం చూచుకోవద్దూ? 'లోకం కాకులు' అన్నారు. సరే బాగుందని నీవన్నట్లు రాంపంతులకే కట్టపెడుతాం అనుకుందాం, పుస్తెధారణ అయిన రెండో యేటనో మూడో యేటనో ఆకాస్త ప్రాణం పైకిపోతేనూ, యేంవంటారు లోకం-'యిదిగో యీ వెధవలిద్దరు కలసి సొమ్ముకాసించి, ముసలిగొడ్డుకిచ్చేశారూ, నిక్షేపంలాంటి పిల్లను' అని అంటారు.

లక్ష్మి—(కోపముతో) యెందుకంచారూ? ఆ అనేవాళ్లని నాయెదురుగా అనమని చెప్పండి. తగినట్టు చెప్తాను. మీకు నోరు లేదు. కాబట్టి యేమైనా అంచారే. ఆలాగనే వెధవలు యీలా కాలం మళ్ళినవాళ్ళకి కాక వయస్సులో వున్నవాళ్ళని యెంచి యిస్తూన్నారేంవిషి?

రామ—ఆలా అనకు. ఆలా అనకుంటే మరి లోకంవేలేదు. 'తప్పెన్నువారు తమతప్పు లెరుగరు' అన్నట్లు ఆ అన్నవాళ్ళకి వాళ్లతప్పులు కానొస్తావీ? యెంతసేపూ యిరుగు పొరుగుల తప్పు లెన్నూయుంటారుగాని—

(పైనుండి ఔలిగ్రాపుబంట్రోతు తలుపుతట్టును.)

ఎవరూ?

(లోపలనుండి)—పంతులుగారూ—దండాలండో—నేనండి రాం వయ్యాను—ఔలిగొరాము వచ్చింది—మీాపేర.

రామ—ఆ-ఔలిగ్రాఫా—యెక్కడనుంచి—(ఆతురతతో లేచి వెళ్ళి తలుపుతీయును.) యేదీ యెక్కడనుంచిరా, రాంవుడూ? ఔలిగ్రాపు.

రామయ్య—నాకు తెల్దుబాబు. యిదిగోనండి యిక్కడ (పుస్తకం చూపి) మీసంతకం యెట్టండి—

లక్ష్మి—వద్దు వద్దు—సంతకం పెట్టకండి. అన్నా-ఓరే రాంపుడూ మమ్మల్ని యే తెలియనట్టు సంతకం గింతకం పెట్టమంటూ వచ్చా—వెదవ బాటోత్రుపని అయిందని వేళాకోళంవా? ఘా సంతకంలేదు గింతకంలేదూ.

రామయ్య—అమ్మోయి—అదికాదండి మీకు యీ టెలిగ్రాము చేత నిచ్చినట్టు అయ్యోరుగారి అక్షరోలతో నిశాని వుండా లండి. అమ్మగారు కోపంవుంచుకోకండి.

రామ—పరువాలేదే నే సంతకం పెడుతేను. యేదిరా యెక్కడ సంతకం.

రాంపుడు—యిదిగోనండి బాబు యిక్కడాక దగ్గర శానలెండి. (అని చూపించును. పంతులు సంతకం పెట్టును.)

లక్ష్మి—యెక్కడనుంచి టెలిగ్రాఫు—మావాళ్ళు కులాసాగా వున్నారుకదా! (అని గుండెలపైని చేతులతో) అన్నా యేంవిటి చెప్మా గ్రహచారం. (అని గట్టిగా) ఓసే కనకం—కనకం—

కనకం—(ఎనిమిదేండ్లపిల్ల ప్రవేశించి) యెందుకే అమ్మా పిల్చేవు.

లక్ష్మి—ఓసేం పరిగెత్తుకపోయి బాబాయిగారి యిట్లో బాతాఖానీ చేస్తూవుంటాడు అన్నయ్య—వేగం పిలుచుకొని రావే—టెలిగ్రాఫు వచ్చిందని చెప్పవే—చప్పున పో.

కనకం—యేంవని చె—

లక్ష్మి—యెంవని వద్దూ. చప్పున నాన్న రమ్మంటూవున్నారని పిలవవే.

కనకం—(పరిగెత్తిపోవును.)

(రాంశాస్త్రిల్లు వణుకుతూ కవరువిప్పి కాగితము నిటునటు త్రిప్పుచుండును.)

లక్ష్మి—ఓ నండీ—మీ కేంవీ అనుమానం లేదుకదా. నిన్నటివుత్తరంలోని మాఅమ్మ కులాసాగావుందని స్వంష్టంగా వ్రాసివుంది కదూ.

రామ—మీ అమ్మ మాటకేం గాని (ఆలోచిస్తూ) మాతమ్ముడికి వంట్లో సుస్తీగావుందని తెలసిందే—నాకేం మనస్తిమితంగా లేదు. యేదీ యీ వెధవను యింకా వచ్చేడు కాడేం—చదవడానికి—వెధవ వ్రాత యింగ్లీషు నుంది. తెనుగనైనా వ్రాయరు.

లక్ష్మి—రెండువారాలై వక్కలాగు, దుస్వప్నాలు వస్తూనే వున్నాయి. అందునుంచి మనసులో అనుమానంగానే యుంది—యిదిగో అబ్బాయి వచ్చేడు.

[ప్రవేశం—వేణు, కనకంతో]

లక్ష్మి—వేణూ—యీ టెలిగ్రాపు యేదోనో చదవరా.

వేణు—(తండ్రివద్దనుంచి, ఆతురితతో టెలిగ్రాము తీసుకొని కవరు చించి చదువును)

"సెటిల్ మారేజ్ మండె నెక్స్టు ఆఫర్ 1200

"(Settle Marriage Monday Next Offer 1200.)

అప్పలనరసింహంపంతులు."

Appalanarasimham Pantulu."

లక్ష్మి—అంటే—

వేణు—(వూరుకొని పెడమొఖం పెట్టును.)

లక్ష్మి—అబ్బీ—వూరుకున్నావేంవిరా ? మాఅమ్మ కులాసాగా వుంది కదా—చెప్పవేమిరా ? (యేడుపు మొహం పెట్టును.)

వేణు—(చిరాకుతో) యెందుకే అలాతొందర చేస్తావున్నావు? చదువుతూ వున్నాను వుంటావా.

రామ—రెండు ముక్కలు చదవడానికి యింతసేపు యేడవాలటోయ్.

వేణు—చదువుతే మాత్రం అర్ధం చేసుకోవాలా లేదా ?

లక్ష్మి—సరే. పోనీ యేం అసుభవార్త కాదు కదా.

వేణు—ఆం—యిప్పటికేంవీ అసుభం లేదులే—విందూ-'పన్నెండు వందలు యిస్తానూ ఆఖరుపాట పెళ్లివచ్చే సోమవారం నిశ్చయించండి' అనివుంది.

లక్ష్మి—యెవరు వ్రాస్తా—రాం పంతులా ?

వేణు—కాదు అప్పలనరశింహం పంతులు. (అనుచూ లోపటికి పోవును)

రామ—యేంవిటి మనవాడు ధుసధుసలాడుతూ యున్నాడు. వీడికి యీసంబంధం యిష్టం లేదు కావోసు.

లక్ష్మి—యీసంబంధం అసంబంధం యేంవిటి? అసలు యింతవేగరం, కనకాన్ని పెళ్ళిచేయడం కూడదంటాడు.

రామ—మరెప్పుడూ? పదేళ్లు దాటేకా పెళ్ళిచెయ్య మంటాడు.

లక్ష్మి—అదీ కాదట పెద్దపిల్ల అయేక. పెళ్ళిచేసూలట. ఇప్పుడు కొంతమంది అలాగే చేస్తాయున్నారట. వెధవపెళ్ళిళ్ళు చేయ్యాలని మీటింగులు కూడా చేస్తున్నారట.

రామ—(కోపంగుతో) దొంగవెధవలు—వీళ్ళ మొహాలు యేడ్చినట్టే యున్నావి. యీపాడు యింగ్లీషు బడుళ్ళలో చదవవేస్తే యీసంగతులు గాక మరేం నేర్పును. వీళ్లకు యింగ్లీషు చదువు చెప్పించడం వచ్చింది ముప్పు.

[ప్రి॥ వేణుగోపాలం]

వేణు—అమ్మా అన్నం పెట్టవే—పోవాలి యీవేళ బుచ్చిగారింట చదువుకోవాలి.

రామ—యేడ్చేవులే—వెధవచదువు చదివేం. చదవేస్తే వున్న మతి పోయిందట—యెంతసేపు చదివినా వెదవపెళ్ళిళ్ళు సగతు లేనా! మరేం చదువుందా? చదువూ వద్దూ చంక నాకడం వద్దూ చక్కా వ్యవసాయం చేసుకో బళ్ళోకి వెళ్లకు మానై. (అనుచూ వెళ్ళిపోవును.)

లక్ష్మి—సరే—చదువుకీ దీనికి సంబంధం యేంవిషీ? మాష్టాడు తే కొట్టవచ్చినట్లు మాష్టాడుతారు ముందూ వెనుకా చూచుకో రు. ఓరే వేణూ—అయితేనూ నీఅభిప్రాయం యెంవిషి? చెల్లెమ్మ సంబంధం విషయం?

వేణు—నాకేంవి అభిప్రాయం లేదూ. నన్నేం అడగవద్దూ. యేదో మీరిద్దరూ యేకీభవించి దాన్ని యేనూతిలోనో గోతులోనో తోసెయ్యండి—

లక్ష్మి—వెదవ అప్రిచ్ఛపు మాష్టుఆడకు పెళ్ళోయ్ పెళ్ళోయ్ అని మెం యేడుస్తూవుంటేను నుయ్యో గొయ్యో యని నీవేడుస్తా వేం? బాగుంది ఖర్మ! మీనాన్న అన్నట్లు నీకు బళ్ళోకి పం పించడం వచ్చింది ముప్పు—

వేణు—బసులేం చేసేవి బసులూ—లోకం జ్ఞానం శాస్త్రంకేసరి. మీకే తెలుస్తుంది. అంత చిన్నపిల్లను సొమ్ము కాసించి ఆము సలాయనకి అంట గట్టడం—యెంత ధర్మంగా వుందీ. ఏచంటి పిల్లడైనా—పిలచి అడగండి యేం చెప్తాడో చూదాం. పోనీ గావి అమ్మా నీకు యెన్నోయేట పెళ్ళిఅయిందే?

లక్ష్మ—సరే నామాటకేం వచ్చింది. అప్పష్లాగా యిప్పుడు పెళ్ళిళ్ళ?— నిజంగా నాపెళ్ళి యెప్పు డయిందో నాకే బాగా జ్ఞాపకం లేదూ. రెండోయేట పిల్లనవ—మాఅమ్మ తనవళ్ళో కూర్చో పెట్టుకొని, నేను అల్లరపెట్టి యేడుస్తూ వుంటే—చేతికి మావి డి పండిచ్చి—నేను తించూవుంచ్చె—మెల్లగా పుస్తెకట్టించి లేచిందవ—మాఅమ్మ—ఆకాలం ఆపెళ్ళిళ్లు వరుస అంతా మారిపోయింది. యిప్పుడు యిదొఖ మాదిరి కిరస్తానం మాదిరీ అయిపోయింది.

వేణు—ఆం. నిజమే—అంత చిన్నప్పుడే పెళ్ళిళ్ళు చెయ్యబట్టే మనలో నూటికి తొంభైమంది వెధవలున్నారు. యిప్పట్లాగైతే వెధవలు యింతమంది వుండకనే పోవుదురు.

లక్ష్మ—నీవు చెప్పింది మరీ బాగుంది. వెదవలు అవడం మనలో వున్నట్లు మాష్లాడుతూ వున్నావు. దైవయత్నానకు మనం యేం చెయ్యనూ. అందరికీ యింత పసుపు కుంకంతో వుందు వనే అభిలాషవుంఛుంది. యెవరెంత తెచ్చుకున్నదీ అనుభవిం చవద్దూ ?

వేణు—ఔను పారిబ్ధం ఖర్మం అని చిన్నపిల్లల్ని ముసూళ్లకి అంట గడుతే వాళ్లు వెధవ లవక పున్నిస్త్రీరితనంగా యెన్నాళ్లు వుంటారు.

లక్ష్మ—సరే తీస్తు—పిట్ట చిన్నదీ అరుపు పెద్దదిన్నీ—పద వంట యింటికి—వచ్చి అన్నం పెడుతాను. (వేణు సష్కారించిన తరువాత గిట్టిగా) ఔనండీ యీకాలిగాళ్ళకు యేదైనా జబా బు యివ్వడంవో—యెంవో—యేదీ ఆలోచించేరు కారేం. పూరకుంటే యేం తేలినట్టు వాళ్ళు అనుకుంచ్చారయా ?

రాము—(ప్రవేశించి) యేం, అనుకుండేదేంవిటి ? పన్నెండు వందలు యిస్తానన్నాడుగా, సోమవారం ముహూర్తం కూడా నిశ్చయించేను. దీనికి యిహ జవాబు యెందుకూ ? సొమ్మెందుకు. మనం సిద్ధంగా వుంటే సరి వాళ్ళేవస్తారు.

లక్ష్మి—అలాగని వూరుకుంటే కాదు. వుత్తరంవ్రాసి పడెయ్యండి.

రాము—యేవని ? యేదీ పోనుంకాయ—(అనుచూ లోనికి వెళ్ళి పోవును.)

లక్ష్మి—యేమని వ్రాస్తారూ ? యీలా సిద్ధంగా వున్నాం—పెళ్ళినాటికి మీరు వెళ్ళిపోరాండని.

(అంతలో పోష్టుబంట్రోతు వుత్తరం తెచ్చి యిచ్చి వెళ్ళిపోవును)

లక్ష్మి—(పుచ్చుకొని) యేంవండోయ్ యేం జేస్తూయున్నారు. వహా మారీలాగురండి. వుత్తరం వచ్చింది మీపేర.

రాము—(ఆతురతతో వచ్చి) యేదీ వుత్తరం.

లక్ష్మి—(అందిచ్చును)

రాము—(సులోచనములు తగిలించుకొని చదువుచూ చిన్న చిరునవ్వ నవ్వును)

లక్ష్మి—ఎంవిటి—నవ్వుకుంచూచు యున్నారు. గట్టిగా చదవండి నేనూ వింటాను.

రాము—(చదువును)

బ్రిహ్మశ్రీ వేదమూర్తులైన రామశాస్త్రులు మామగారి పాదపద్మముల సన్నిధికి. రాంపంతులు అనేకనమస్కారములు. ఉభయకుశలోపరి. తరువాత, యిదివరలో నేను అనేకసార్లు తమతో కలసి సంబంధం విషయమై మాట్లాడి యుంటిని. తమరు జాబువ్రాయమని విచారించుచున్నాడను—వకసారి వచ్చుటకు దేహస్థితి యేమీ బాగులేదు. క్షయబాధ కొం

చెము తగ్గినను, శరీరము విశేష నీరసముగా యున్నది. దైవానుగ్రహం. నేనిదివరలో మనవి చేసుకొన్నట్లు పదిహేను వందలకు లోపువాడను గాను. కొద్దిదినములలో ముహూర్తములున్నవి. యిష్టమైన యెడల తమరు వెంటనే టెలిగ్రాపు యివ్వవలెను. యెదురుచూస్తూ యున్నాను.

యిట్లు విధేయుడు,

రాంపంతులు.

కలం తాజా—కర్చులు నేను ముజరా యిచ్చుకుందును."

లక్ష్మి—యిదేంవిషీ—ఈలాగు వ్రాసేడూ—యేం ఆలోచిస్తారు?

రామ—ఆలోచ నేంవిటి? మనిషికి యిన్ని ఆలోచన లేంవిటి. మొదట మనం అనుకున్న ప్రకారం చెయ్యాలి.

లక్ష్మి—అయితే యితనికి యేంవని వ్రాస్తారు.

రామ—సంబంధం నిశ్చయం అయిపోయిం దని వ్రాస్తాను. మనం యేం చెయ్యగలం ? పిల్లదాని అదృష్టం.

లక్ష్మి—మంచి సంబంధం అండీ. యేం వినయంగా వ్రాసేడూ. మొదటనుండీ నాకాతనిమీాదనే వుంది. పోని మన చిన్నమ్మాయిని కావాలేమో వ్రాయండి. ఆలాగైతే రెండుపెళ్ళిళ్ళు చక్కా వక్క పందెర్లోనే చేసుకోవచ్చును—కర్చులో ఖర్చు.

రామ—(చిరునవ్వు నవ్వుతూ) బాగానేవుంది. అతను వప్పుకుంటాడో లేదో.

లక్ష్మి—మీారు వ్రాస్తురూ. మహారాజులాగు వప్పుకుంచ్చాడు. యితడు కనకానికి, చిన్నికీ యేట్నర్థంవే కదూ హెచ్చు తగ్గూ. వేళ్లైపోతూంది, చప్పున వెళ్ళివ్రాసి పడైయిండి.

రామ—(మెల్లగా) సరే వ్రాస్తాను. దైవానుగ్రహం 'ఋణానుబంధ రూపేణా పశుపత్నిసుతాలయా' అన్నాడు. అదే అతని భార్య ఐపుడితే తప్పుతుందాం యేంవిటి? (అని వెళ్ళిపోవును)

లక్ష్మి—చూడండి—రాంపంతులు క్షయ అనివ్రాసేడు. మీరు వ్రాసే వుత్తరంలో—కాస్త అల్లపురసం ప్రతిరోజూ వుదయం పరగడుపు పుచ్చుకోమని వ్రాయండి—క్షయ గియ కట్టెస్తుంది. యీమాట మర్చిపోకండి.



# కాంతాపహరణము.

## ప్రథమాంకము.



### ప్రథమరంగము.

స్థలము:—విశాఖపట్టణము—బీదివద్ద.

వెంకటేశం—(రాగవరసతో పాడుకుంటూ ప్రవేశించి).

సీ. తథ్యము వచింతుఁ బక్షపాతమునఁ గాదు
నిఖిలజగములయం దిది నిక్కువంబు
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు—

అంతవరకూ పద్యం రమ్యంగా బాగానేవుంది కాని ఆఖరు—

వారలే కష్టములకెల్ల కారణములు.

యీచరణంలోమాత్రం భర్తృహరి పప్పులో కాలువేసేడని యిదివరలో అనుకునేవాణ్ణి. గాని రంగనాయకులగారి విడోడాటరు (Widow daughter) శారదగురించి నేను పడుతున్న శ్రమలబట్టి అదికూడ ఫ్యాక్టు (fact) అని యెస్టాబ్లిషు (establish) చేయవలసి వస్తుంది. సరే దీనిమాట కేంగాని మన సంగతేంవిటి? కథఅడ్డంగా తిరిగింది. యీవూర్లో నా రస్పెక్టు (respect) మర్లేదు. శీఘ్రబుద్ధిః ఫలాయనం అన్నాడు. కొన్నాళ్లు యెక్కడకైనా చెక్కేర్ కొట్టడం వే బుద్ధికిలక్షణం. వూర్లో వకదమ్మిడీ అప్పుపుట్టదు. వందలువందలు కురిపిస్తేనేగాని వుద్యోగం దొరకడంలేదు. వేలంపాట పాడి వుద్యోగం గణించుకోవశంవేగాని ఎడ్యుకేషన్ క్వాలిఫికేషన్ (Education

qualification) లూ ఎక్స్పీరియన్సు (experience) లూ ఎలిక్వెన్సు (elequence) లూ గుడ్డిగవ్వకైనా మారకుండా వున్నావి.

మొన్న శీతమ్మత్త నాను మరామ్మత్తు చేయించుమని యిస్తే-అమ్మేసి, తాలూకాబోర్డు ప్రెసిడెంటుచేతులో రెండువందలు పోస్తే, ఆర్డరు పడేసి, రంగం పోటీ తగిలి మరోమాయూభై హెచ్చు యిచ్చేసరికి దొంగరాస్కెల్ ఆర్డరు అమాంతంగా కేన్సిలు (cancel) చేసేశాడు- సఖం రాత్రప్పుడు సానింటికి సింగిల్‌గా (Single) గా వెళ్తూవుంటాడు. స్కౌండ్రెల్ (Scoundrel). యీవేళ దార్లో కనిపెట్టి దేహశుద్ధిచేసి వదలిపెట్టాలి. వేలకొలది మదుపు పెట్టి వోట్లు కొనుక్కొని యేలాగో చైరుమన్, బోర్డ్సు ప్రెసిడెంట్సు (Chairman, Boards Presidents) అవడం- లంచాలవల్ల లక్షలకొలది గడించి-నాలుగు వూర్లలోనూ నాలుగు బంగళాలు కట్టించడం- అదొక గొప్ప? యీలాంటి అప్రెచ్చపు వెధవలు వకడు కానివుంటే నలుగుర్ని అనవలసివస్తుంది. యీసబ్జెక్టు (subject) లో డీప్ (deep) గా ఆలోచిస్తే వాళ్ళదేం తప్పులేదు. మన వెదవల్ని అనుకోవాలి. రూపాయికి అర్ధకి సాద్ది మానం అమ్ముకొన్నట్టు- వోటు అమ్ముకోవడం-అప్రెయోజకపు వెదవల్ని కౌన్సిల్సు (Councils) లో నిలబెట్టడం.

'నాను యింకా మరమ్మతుకావడంలేదా' అని ఆవిడ చంపుకతినేస్తుంది. చక్కా రెండువందలరూపాయలతోనూ, రెండుమూడు అప్పులుతీరేవి.

శ్లో॥ 'దుర్భిక్షే చాన్నదాతారం సుభిక్షేచ హిరణ్యదం।
చతురోహం, నమస్యామి రణే ధీర మృణే శుచిమ్॥

అని యేమహానుభావుడు వ్రాసేడోకాని నిజంగా అప్పులు లేనివాణ్ణి వక్కకృష్ణపరమాత్మేకాదు, వెంకటేశంగారుకూడ సిన్సియరు (sincere) గా నమస్కరిస్తారు.

మేన్స్ రెస్పెక్టు మోస్టలి డిపెన్డ్సు ఆన్ హీజ్ డెట్సు (Mans respect mostly depends on his debts) అని బైరన్ (Byron) మహాకవి వ్రాసినేనా అన్నాడు. (అటుచూచి) అదెవరు. కాపీ హోటేల కాంవయ్య కాబోసు వస్తూవున్నాడు. యీ వెదవడికి యే లాగు తెలిసింది చెప్మా నేనిక్కడున్నానని. పొక్కు లుచిక్కిన వెదవ యెవడైనా చెప్పివుంటాడు. రానీ వీడికోటస్సు కొట్టి నోరు కడుదాం- మేరేజి (marriage) కి పిల్లని వెదకుతున్నాడని విన్నాను. యేం వయ్యాంగ్ పంతులు- యీలా యెండలోనే బయల్దేరావు. ప్లైరా ?

కాంవయ్య — ప్లైరా ? మంచిప్లైరేను —

వెంక — మరేం అర్జంటు (urgent) పనిమీాదనా ?

కాం — మరేం పనుంది ?— పని పూరంతా అరువు లివ్వడం వాళ్ళ వెంట కుక్కలాగు తిరిగి సొమ్ము రాబట్టుకోవడం యిదేపని- మూడుపూటలూను.

వెం — అయ్యో యెంతమాట ఆడేవయ్యా నీకేం కుక్క లాగు తిరగ డానికి ! మహారాజులాగు వున్నావు. నీవ్యవహారం యేంవిటి? నీరాబడి యేంవిటి ? నీదర్జా యేంవిటి ? యేదీ నీవుచేసినట్టు సేమ్యాపాయసం యెవరుచేస్తారో చూస్తాం రమ్మను- బస్తిమే సవాల్ కొడతాను.

కాం — యెంతచేస్తే నేం ? నాఖర్మం యీలావుంది. మొదట గడ్డితిని అందరికి అప్పులిచ్చేసేను. యిప్పుడు కాళ్లుముడుచుకొని వి చారిస్తూవున్నాను. యేదీ ముందుపడ్డైయ్యండి మీాలెక్క. కురదావుస్తె మరికాదు. అంతా అణాపైసలుతో—

వెం — పంతులూ- నీమొహంచూడడానికి షేమ్ (shame) అనగా సిగ్గువేస్తుంది. యీవేళ సొమ్ము అందుతుంది. పువ్వులోపెట్టి పాతికరూపాయలైనా అందాక పంతులు చేతులో పెట్టవలె

ను. అని అనుకొని యెంతో సంతోషంగా వుండేసరికి గాడిద కొడుకు వహడూ యివ్వవలసినవాడు యిచ్చేడు కాడు. ఐ యామ్ యక్స్ట్రీమిలి సారీ (I am extremely sorry) నాకు చాలవిచారంవేస్తూంది. రేపు తప్పక అణాపైసలుతో అంతా యిచ్చివేస్తాను. మరేంపీ అనుకోకు.

కాం—మరి రేపూలేదు మాపూలేదు. యెంతకాలంఅండి యీ రేపులు. యీవేళ యిస్తేనేగాని వల్లకాదు.

వెం—నన్నెక్కడైనా తాకట్టువుంచి నీసొమ్ము నువ్వుతీసుకోవయ్యా. (అని నవ్వును.)

కాం—ఆపని మీరేచేసుకోండి. యిక ఆగేదిలేదు. రేపో యెల్లుండో వూరికివెళ్తారని కూడా తెలసింది. సొమ్ము పైసలాచేస్తేనే గాని వల్లకాదు.

వెంక—ఓహో అదా నీ భయం. నేను వూరికివెళ్తానని యేగాడిద కొడుకు చెప్పేడు. పేరుచెప్పుదూ పిలకూడదీస్తాను. యెవడా కుండాకోరునూళ్లు చెప్పేవాడు. (గట్టిగా) పేరుచెప్పు నాతడాఖా చూపిస్తాను. తొత్తుకొడుకుని తంకిమీద కొట్టే నంటే టెన్ యార్డ్సు (ten yards) వెళ్ళిపడాల. డేమ్ ది స్కౌండ్రెలు (Dam the scoundrel)………

కాం—(మెల్లగా) నేరకపోయి అన్నాను. పడతిట్టేస్తూవున్నాడు. కలబడుకద మీదకి. (పైకి) యెందుకండీ అంతకోపం. యెవడో యెందుకుచెప్తాడూ. చెబుతేమాత్రం నేను నమ్ముతానా యేంవిటి?

వెంక—యెవడూ చెప్పకపోతే యెందు కాలాఅనడం.

కాం—అబ్బే తమాస్యానకి అన్నానండీ.

వెంక — హాస్యానకా - డోంట్ కట్ జోక్సు విత్ మి - (Dont Cut jokes with me) యీలాంటి విషయాల్లో మాత్రిం హాస్యాలు ఆడకండి. నాకు కోపంవస్తుంది.

కాం — నేనన్నదాల్లో తప్పేంవుంది. పూరికి వెళ్ళకూడదా రాకూడదా. మనుష్యులన్నప్పుడు పూర్లకు వెళ్ళరా రారా.

వెం — ఆలా అను. వప్పుకుంటాను. చూచేవ్ - కాంవయ్యపంతులూ. నేను లైస్ (lies) అనగా అనృతం ఆడేమనిషినికాను. దీన్లో ఫేక్టు (fact) అనగా ప్యూర్ (pure) నిజం యేమిటంటే - నేను పూరికి వెళ్ళడం అనేది తటస్థించింది కాని, యిప్పుడు మళ్ళా తప్పోయింది. మొన్న మా మేనమామ వుత్తరంవ్రాసేరు. వాళ్ళింట్లో వక పిల్లవుంది. ఆపిల్లకు వక సంబంధం రైటుఅయింది. ఏడువందలు మొదట యిస్తావని - తరువాత సగం యిప్పుడిస్తాను, మిగిలింది తరువాతయిస్తా అని ఘుడీయ, యింతసొమ్ము యివ్వలేమని - యీలా అల్లర పెడుతూవున్నారు. మావాళ్ళు ఝుడిసి ఆసంబంధం తప్పించుకున్నారు. నిన్ననే నాకు వుత్తరం వచ్చింది.

కాం — సంబంధం మరేదైనా కుదిరిందా?

వెంక — అబ్బే యేదీ యింకా. యీవూళ్లో యేదైనా సంబంధంవుంటే చూడవలసిందీ పిల్లకు యీడుముదిరింది వేగరం పెళ్ళి చేయకుంటే వీలులేదని వ్రాసేరు. యింకా నేను సంబంధం చూడాలి - ముహూర్తం నిశ్చయించాలి - యివన్నీ అవుతే పూరికి వెళ్ళడంగాని రేపో యెల్లుండో యెలా వెళ్ళిపోతాను.

కాం — పిల్ల మీకేంవి అవుతుందండి.

వెంక — నాకేంవీ కాదూ. మా మేనమామగారియింట్లో చాన్నాళ్లైవుం

డిపోయింది. తల్లిదండ్రులు లేరు పాపం. చక్కనిచుక్క. రంభని మించేస్తుంది, బ్యూటీ (beauty) లో.

కాంత—మీారెందుకు పెళ్ళిచేసుకోకూడదూ?

వెం.క—సరి. రామాయణం అంతావిని "రాంవుడికి సీత యేంవౌతుందని అడిగేడట వకమహానుభావుడు, నీలాంటివాడేను. నాసంగతి యిదివరలో నీకు తెలియదూ? అసలు నేను పెళ్ళాడను. ఆంజనేయులవారిలాగు అస్ఖలిత బ్రహ్మచారిగ వుండిపోతాను. పెళ్ళి చేసుకోవలెనంటే యీాపూర్లో టి. డి. సి. (T. D. C.) గారి చిన్నమ్మాయిని యిస్తానన్నారుకారూ? యిదివర్లోను వద్దనేశాను.

కాంతయ్య—అయితే మనసంగతి కొంచెం వ్రాస్తారా.

వెంక—"మన" అని గూఢంగా అంటూన్నావు. యెవరికోసంవో చెప్పు. క్షణంలో సెటిల్ (settle) చేయించేస్తాను.

కాం—యెవరికోసంవో కాదు. నాకోసంవేనూ.

వెంక—యిదివరకు వహనాడైనా నాతో యీాసంగతి చెప్పేవుకావేం. నీవేవక అన్‌ఫార్ట్యునేట్ యిన్‌ఫెంటు (unfortunate infant) ని మ్యారేజి (marriage) చేసుకుంటానంటే యింకా అపీలు యేంవుందీ. రాజులాంటి సంబంధం. అయితే పంతులూ- యిదివరకు యెన్నికళత్రాలు నష్టపోయేవీ?

కాంత—అబ్బే యెన్నోకాదు- రెండేనండి.

వెం—నీకు యేజ్- (age) అనగా వయస్సు యేమాత్రం వుంటుంది?

కాంత—నలభైకి మించదండి. కానైతే నల్లవెంట్రుకలు తెల్లపడ్డవని-తుంటరి వెధవలు అరనైలు, డెబ్బైలు అంటారండి.

వెంక—అబ్బే. కొంచెం పండిపోతే ముసలవాళ్ళటయ్యా- నాక్లాసుమేటు వహాడు- యింకా పదహారోయేడు- చిన్నప్పటినుండి

అర్థమాలిన సెంటుసు (Scents) రాసుకునేవాడు. అంచేత కొప్పంతా పండిపోయింది. చూచేవా పంతులూ- సెంటుసు (Scents) రాసుకుంటే కొప్పుపండుతుంది. అంచేత వోల్డు యేజ్ (old age) కి రియల్ టెస్టు (real test) అనగా నిజమైన పొల్తి కొప్పుపండడంకాదు. విటాలిటీ (Vitality) వుందా లేదా అని చూచుకోవాలి.

కాం—అంటే?

వెంక—విటాలిటీ (Vitality) అంటే- వీర్యపుష్టి. కష్టపడి పనిచెయ్యగలడా?- ధాటీగా నడువగలడా? సమయంవస్తే కాస్తపరిగెత్తగలడా?—ఇవన్నీ చూచుకోవాలను.

కాంన—నాపనిపాట్లుసంగతి హి-హి-హి-మీకు తెలియదా యేం విటి? వేరేచెప్పడానికి.

వెంక—బాగుంది. అంతా టెన్ డేస్ (ten days) నుంచేకదూ మీ హోటేలుకు రావడం మానేశాను. అదివరకు మీసంగతి నాకు కొత్తయేంవిటి. అడగడంవే తరువాయి, ప్లేటుమీద ప్లేటు ప్లేటుమీదప్లేటు రెండుచేతులతోనూ అర్జునుడల్లాగు భాణవర్షం కురిపించేవాడివి—

కాంవ—మరోకమనవి. చిన్నప్పుడు నక్కలా వుండేవాణ్ణి-డి. చిన్నపిల్లలతో కలసి దొంగాట ఆడేవంటే నన్నెవరూ పట్టకొనలేక పోయేవారు. ఆలాగు పరిగెత్తేవాడను. యిప్పుడైనా కొంచెం పరుగెత్తగల్ను లెండి— చూస్తారా ?

వెంక—అబ్బే ! అవసరంలేదయ్యా. నీవాలకంచూస్తేనే తెలుస్తుంది

గా—పరుగెత్తగలవని.

కాంవ—అదికాదు—చూడండి అందాకా పరుగెత్తుతాను. (అని కొంతదూరం పరుగెత్తును).

వెంక—గ్రాండ్—గ్రాండ్ (grand—grand) చాల బాగుంది. యక్సలెంటు ( Excellent) గా పరుగెత్తుతారే !

కాంవ—అలవాటు తప్పిపోయి ఆయాశం లావుగావుందండి. (అని ఆయాశంపడిపోవుచుండును).

వెంక—ఇట్ మేటర్సు లిటిల్ ( it matters littlc) దానికేంవీ పరువాలేదు కాని—కాస్త విశ్రమం తీర్చుకో.

కాంవ—జాతకం పంపించుమంటారేమో—మావాళ్ళు నాజాతకం వ్రాయించలేదండీ.

వెంక—మరేంవీ పరువాలేదు. ఆపాటి తప్పడుజాతకంవే తయారు చేయించలేంవటయ్యా ఖర్మా. అప్పన్నశాస్త్రికి అరకప్పు కాఫీ యిచ్చేవంటే అయిదు నిమిషాలలో అల్లేస్తాడు.

కాంవ—బాగాచెప్పేరు. అలాగేచేస్తుంగాని—మరొకటి—వాళ్ళు యేంకోరితే అదే యిస్తుం.

వెంక—అది వాళ్ళ యిష్టంకాదు. మీాయిష్టమేనూ. యేదో మంచిసంబంధం కుదిర్చేను. నాకు పేరూ ప్రతిష్ఠ వుంటుంది. నాపేరు చెప్పకోని వేగిరం పిల్ల విడో (widow) అయిపోయి—

కాంవ—అంటే ?

వెంక—పిల్లలతల్లి అయి హాయిగా బ్రతుకుతుంది. పంతులూ—నాకు అర్జంటు ( urgent) పనుంది పోవాలి. నీసొమ్ము రేపు తప్పకుండా యిచ్చివేస్తాను.

కాంవ—రేపు కాకపోతే యెల్లుండి వౌతుంది. దానిమాటకేంలెండి. గాని యీావిషయంలో మాత్రం మీరు కొంచెం శ్రద్ధతీసుకోవాలను. నాకు పనుంది. పోతాను, మళ్ళా దర్శనం చేస్తాను. శెలవు (అని పోవును).

వెంక—అన్నా—శని వదలింది. వెదవాయి వెఱ్ఱికూతలు కూస్తాడే మో అనుకున్నాను. యీపూట గండం గడచింది. యిహా యీరాత్రి మెయిల్లో కొట్టేయ్యాల. పాపం, శారద నాతో లేచివస్తానని ప్రయాణం అవుతూవుంది. కాస్తో కూస్తో సొమ్మంది తీసుకపోదాం అంటే, దాని ఫాదర్ (father) వక అగ్గిరాంవుడు. యేం చేసిపోతాడేంవో అని భయం వేస్తుంది. అయినా నా యింటిమేటు ఫ్రెండు రామారావు (Intimate friend Ramarao) తో యీసంగతి ఆలోచిద్దాం. వాడు యీవిషయాల్లో ఆరితేరినబుఱ్ఱ. ఐ. పి సి. (I. P. C.) కూడ అనర్గళంగా స్టడి (study) చేసేడు. ఇటీస్ హై టైమ్ ఫర్ మి (It is high time for me) (అని వెళ్ళబోయి ముందుకుచూచి చప్పున ఆగి) శెట్టికావోసు పోతూవున్నాడు. హౌ ఫార్ట్యూనేట్ (How fortunate!) యెదురైపోతే— యిహా యెన్ని చెప్పినా వదలకపోను. బుఱ్ఱవంచుక పోతూన్నాడు. (అని పోవ బోవ వెనుకనుండి)

"యేంవయ్యా పంతులూ"

వెం—(వెనుకతిరిగిచూచి) ఎనదర్ వైల్డు బీస్టు(another wild beast) కమలం తల్లి! యీపిశాచి యెక్కడ్నుంచి దిగబడ్డాది, చెప్మా? యిహా మాడేం—

[ప్రవేశం మాణిక్యం]

వెంక—ఓహో మాణిక్యం—అంతా కులాసాగా వున్నారా?

మాణి—చాలును లెండి — కులాసాలుమాటకేంగాని— యేదీ సొమ్ము. యెన్నాళ్లైంది. మనిషన్నప్పుడు వక్కమాటమీద వుండాల. యింతకన్న యేంవని అడగాల. నామట్టుకు నాకే సిగ్గువేస్తుంది.

వెం—బాగుంది అంత సిగ్గైనజాతిలో పుట్టేవ్రకదా ఆపాటి సిగ్గుండదా! దానికి నేనేంచెయ్యను?

మాణి—మాది సిగ్గైనకులంవో సిగ్గులేనికులంవో ఆప్రాసుతో అవ్వసరం మీకేంవుంది. మాసామ్ము మాకు వదెయ్యాలకాని మాటలతో యేంవుసి?

వెం—అయ్యో మాటలే వుండిపోతావి లోకంలో వెదవసొమ్ము యెవరికి శాశ్వితం. "కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ జెందరే వారేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే ?" అన్నాడు మహానుభావ్రుడు. చూచేవ్రామాణిక్యం- నేను మీ యింటికి వస్తూవున్నప్పుడు మీకమలం- నీవ్రూ- నన్ను యెంత గౌరవంగా చూచేవారు. యిప్పుడు చూడు నీవ్రు యెంతకోపంగా మాట్లాడుతున్నావో? యిది అంతా నీబుద్ధిలోపంకాదు. డేస్ (Days) అనగా కాలమహాత్యము.

మాణి—మునుపంటే- మునుపుమాత్రము మేము యీ స్థితిలో వున్నాము యేంవిటి? మహోన్నతంగా వుండేవారము. పట్టిందల్లా బంగారం అవుతుండేది. యిప్పుడు మావ్యవహారం చిదికి- కుటుంబాలు మాడిపోతున్నావి.

వెంక—అదేంవిటి? మీవ్యవహారం చిదకడంయేంవిటి? మీరు మాడడంయేంవిటి? క్వైట్ ఎస్టానిషింగు(Quite Astonishing) నిత్యకళ్యాణం పచ్చతోరణంతో తులతూగుతున్న మీకు మాడడం ఖర్మ యేంవిటీ ?

మాణి—అవును గిల్టువస్తువులతో గంగిరెద్దులాగు తయారై పడిదలకు తెచ్చిన పట్టుచీరలుగట్టి పేసుపౌడరింత మొకాన పావి

పేమనుగా తలదువ్వి పకపకనవ్వుతూ పైకి కనిపిస్తూవుంటే పై సావున్నట్టా? పైకే ఆపకపకలు తెలసిందా.

వెంక—ఛై నేను నమ్మను. లోకము అటుదిటుతిరిగినా వేశ్యలకు వైశ్యులకీ యెంతమాత్రము నష్టంవుండను. అందులో మీది మాసాపైన వ్యవహారము.

మాణి—అలాకాదు బాబూ- మీతోడూ. మీవళ్ళు ముట్టిచెప్తాను—

వెంక—అవును.. యిప్పుడేంవి కాటకంవా? కరువా? మీకు యిబ్బందిగా వుండనుకోడానికి-

మాణి—ఆలాగైతె ఫరువా లేకపోను బాబు. మాంబేరం తగ్గిపోవడానికి కరువు కాటకం కాదు. చూసేరా నాచిన్నతనంలోను- పెద్దకరువు వచ్చింది. రూపాయికి మూడడ్డలు బియ్యం యిచ్చేవారు. ఆలాంటప్పుడుకూడా మాయింటికి శీతాకాలపు కుక్కల్లాగు సరసులందరువచ్చి యిల్లుకప్పేస్తు వుండేవారు యింట్లో దప్పిక తాగకపోయినా మొలవిమాత్రం రూపాయిలు దోపుకొనివచ్చి కట్నంచదివించేసి పోయేవారు.

వెం—అయితే మాణిక్యం- అప్పుడు రేటు (Rate) యేమాత్రం వుండేది?

మాణి—ఆలకించండి బాబూ- హాస్యాలమాటలకేం- యిప్పుడు మేం వున్నమేడ అప్పట్లో కట్టించిందేకదూ. యిదేంవిటి యిప్పుడు 'సాన'ంటే చప్పున వూసేస్తున్నారు.

వెంక—యేంవీ అంతకోపము మీమీద; మీరేంచేసేరని ?

మాణి—మేం యేంవిచేస్తాముబాబూ- మేము యేమీచెయ్యలేదూ. దేవుడే సేసేడు. చూచేరాబాబు, రోజులు అంతకంతకు మారిపోతూవున్నవి. పూర్వం సంసార్లు అసలు పైకి వచ్చేవారు

కారు- కదా పరాయిపురుషిణ్ణి కన్నెత్తి చూచేవారుకారు. యేదో మొగవాడు గణించి తేవడం ఆమది యింటిలో వుండడం గృహకృత్యాలు చూచుకోవడం- యీసంగతుల్లోనే వుండేవారు. రానురాను యీయింగ్లీషు బరుళ్ళలో చదవడం వల్ల యిప్పు డేంఖర్మము వచ్చిపడిందో చూచేరా- ఆడదానికి డబ్బు గణించాలని బుద్ధిపుట్టినది. ఆబుద్ధి వాళ్ళకి పుట్టించడం దేవుడు- మాకొంపతీయడానికే- చూడండి మీతో అనవల్సివస్తుంది-కొన్నిసంసార్లు కొంపలలో గరాయికీలు లావైపోయి- మారాబడి తగ్గిపోయినది.

"......................................................మా
పడపుంబడంతు లేడ్చుటకు । బాపనసానులు లేచి రింక మా
కడుపులు నిండవచ్చునె జ । గన్నుతకీర్తిఘృణీ భిషజ్మణీ!"

వెంక— ఆం — తప్పు ఆలాంటి మాట్లాడకు- యెవరైనా విన్నారంటే ప్రమాదం సంభవిస్తాది- కట్టుచ్చుకుంటారు.

మాణి— యెందుకు ప్రమాదం- యెవరానచ్చినవాళ్ళు రానీ. పరువుతీసి పైనిపెడతా. నేనన్నది అభద్ధం ఔతే కదూ?

"సీ. కోమటిజగ్గయ్య । కొంపముంచెనుపట్లు
జోగిం గావించె ని । యోగిభామ
మగనాండ్రి కియ్యది । తగునె భర్తం బాసి
స్వైరిణియయ్యె వ్యా । పారినారి
రానివానిదె తప్పు । రతులను మెప్పింపం
జాలినజాణ వై । ష్ణవవధూటి
వాలుంజూపులం జూచి । వలపించుం గుసుమాస్త్రి
ఘోటిం బోలిన వెల । నాటిజోటి

గీ. అతులబలులను పదిమంది ! నైన నోర్చు
సాటి లేనట్టి కాసల!నాటిబోటి
విటులగర్వం బణాచు దా!!విపులపడుచు
సాను లమితక్షుధావ్యధా!గ్లాను లైరి."

మీకుమాత్రం తెలియదేంవిటి ? యింతెందుకూ మీరు పూటాయింటికి రావడం మానెయ్యడం శారదనుంచే కదూ.

వెంక — యెంతమాట. ఆలా తెలసీ తెలియని మాటలాడకు. పాపం సంభవిస్తాది. శారద యెంతమంచియిల్లాలు. భర్త పోయినప్పుడు కంప్లీటు త్రి డేస్ (Complete three days) అనగా వరసగా మూడురోజులు వరకూ కంటికీ నేలకూ వకటేధార ఆలా యేడ్చింది.

మాణి — బాగా చెప్పేరు. అదికూడా మానీమన్నారేంవిటి ? నాదగ్గరమాత్రం యీలాంటి రహస్యాలు పనికిరావు. యిది ముసల్ది దీనికి యేంవిటి తెలుస్తుందని మీరనుకుంటారు కాబోలు. యెవరికైనా పెద్దవాళ్ళని అడిగి తెలుసుకోండి నాసంగతి.

వెంక — బాగుంది నీ సంగతి నాకు తెలియకపోతేకదూ యెవరైనా అడిగి తెలుసుకోడానికి. యెంతయోగ్యురాలవు. యెంత మర్యాదస్తురాలవూ. (తనలో) వేశ్యమాత వెట్టికుక్క అన్నారు. (పైకి) నేను చూస్తూవున్నానుగానూ. మూడేళ్ళు మనిషిని చూచేనంటే అంతలో క్యారక్టరు (character) ని స్టడి (study) చేసేస్తాను. జ్యోతిశాస్త్రం అంతా భట్టీవేశి నోణ్ణి ఆపాటి గ్రహించలేనూ ? సరే నీదగ్గర మరెందుకు దాపరికం. నామనస్సులో వున్నదంతా చెప్పేస్తాను విను. యీసంగతులు యిదివరకే నాకు తెలసేవి. నీలాగే చాలమంది నాతో చెప్పేరు. యీవూరు ఆవూరు యేంవిటి. చాల

పూర్లలో మీజాతివాళ్ళు యేడుస్తూవున్నారు. దీనిగురించి కొంతమంది పిటీషన్సు (Petitions) అనగా అర్జీలు పెట్టుకొన్నారు.

మాణి—యెక్కడకు బాబూ- అర్జీలూ ?

వెంక—నేషనల్ కాంగ్రెసు (National congress)కి—యీమాట యిదివరకు నీవు ఆలకించే వుంటావు. వాళ్లు పెద్దపెద్ద మీటింగులు చేసి 'పాపం- యీజాతివారు చాలయిబ్బందులు పడిపోతూ వున్నారూ-వారియొక్క పూర్వౌన్నత్యం, పూర్వపు రాబడీ- పూర్వపుహలుకుబడీ- పునర్వ్యాప్తి చేయించాలని' వీరకంకణాం కట్టుకొన్నారు. యీపూర్లోకూడా రేపటిసోమవారం బీచిని పెద్దమీటింగు అవుతుంది. నన్ను లెక్చరు (lecture) యిమ్మని అందరూ బ్రతిమాలుతూ వున్నారు.

మాణి—నిజంగా ? నాతోడూ ?

వెంక—వట్టొ- యెప్పుడైనా నేను నీతో అబద్ధంచెప్పానా ? యీనాటికి కొంచెం పైసా యిబ్బందిచేత రేపూ మాపని మాట తప్పవలసి వచ్చిందిగాని.

మాణి—సరే సొమ్ముమాటకేం గాని- మీరుమాత్రం చెప్పడంలో కొంచెం గట్టిగాచెప్పి- పుణ్యం కట్టుకొండి. మహారాజుల్లాంటి భర్తల్ని పెట్టుకొని యీపాడువెదవలు పైవాళ్ళకోసం యెందుకు దేవులాడుతారో ?

వెంక—ఆలా అనకు. వెరైటీ యీస్ బ్యూటి (Variety is beauty) అని వక జర్మనుకవి పుస్తకం వ్రాసేడు.

మాణి—జర్మను అంటే మొన్న యుద్ధం అయిందీ ఆరాజ్యం వేనా ?

వెం—అవును.

మాణి—యేంవని వ్రాసేడు ?

వెంక—యేంవనీ లేదూ. పూర్వం వాళ్ళదేశంలోకూడా, మన దేశం లోలాగు సానివాళ్ల పని మాబాగావుండేది. నెలకు మినిష్టర్ల జీతాల్లాగు వేలకువేలు వస్తూవుండేవి. క్రిమస్య సంసార్లలో ఇన్ఫెంటు మ్యారేజస్ (Infant marriages)అనగా చిన్నప్పుడే పెళ్ళిళ్ళు చెయ్యడం- వాళ్ళు యింకా వయస్సులో వున్నప్పుడే వెధవలైపోవడం- కొన్నాళ్ళకి వీళ్ళకి వాళ్ళకి లావ్ లెటర్సు (Love letters) వ్రాసి తెప్పించుకోవడం- వీళ్లని చూచి వాళ్లు- వాళ్లనిచూచి మరోహరు, యిట్లా అంతా డిబేచరీ, (debatchery) కంటేజియస్ డిసీజ్ అనగా అంటురోగం లాగు లావై పోయింది. అప్పుడు మీజాతివాళ్లంతా కాంగ్రెసు (Congress )మీటింగుచేసి ఆ కలిదగ్గరకువెళ్ళి 'యీలా మా యిన్కమ్ (Income) అనగా రాబడి తగ్గిపోయినదీ. మీరు మహానుభావులూ- మమ్మల్ని రక్షించి యీ యిన్ఫెంటు మ్యారేజస్, (infant marriages) అనగా చిన్నతనంలో పెళ్ళిళ్ళు చేయడం, తగ్గించడం,- ఎక్స్పిడీ యేషన్ ఆఫ్ విడో మ్యారేజస్- (expediation of widow marriages) వెధవ పెళ్ళిళ్లు చేయుట యొక్క అభ్యున్నతి- మగవాళ్ళకు పాతిక ముప్పై యేళ్ళవరకూ పెళ్ళిళ్లు చేయకుండా వుండడం యీలాంటి రిపారమ్సు (reforms) అనగా కట్టుదిట్టాలు చేయించండి మహాప్రభో' అని కాళ్లు పట్టు కున్నారు. అతడప్పుడు, బాగా ఆలోచించి 'గుణుపురంజంగా'ల్లాగు మీటింగులుచేస్తే లాభంలేదని అందరికీ తెలసేటట్టు మాటలతో వ్రాసి పుస్తకం అచ్చువేయించి, గవర్నమెంటువారికి వక పుస్తకం కాంగ్రెసువారికి వకపుస్తకం- యీలా అందరికీ పంచిపెట్టేను. కొన్నాళ్ళకు గవర్నమెంటువారు, తఖరాపుచ్చు

కానీ కాంగ్రెసువాళ్ళు చెప్పినట్లు వప్పుకొని లెజస్లేటివ్ మీటింగు (Legislative meeting) లో రూల్సు (rules) పేసు చేసేరు.

మాణి—యేంవని రూల్సు చేసేరు?

వెంక—మరేంవని? వాళ్లు చెప్పినట్లు చెయ్యమని.

మాణి—అయితే మీరు మీటింగు చేస్తారా మర్చిపోతారా?

వెంక—మర్చిపోవడంవే, నేను అసాజ్జుణ్ని—యేదైనా పనిపట్టకే పోవాల. పట్టేనంటే చేసి వదలిపెట్టేనన్నమాటే. అందులోకీ యిటువంటి సంగతుల్లో అంటే క్లబ్బూ. అంతలో చేస్తాను. లోకంలో పేరే వుండిపోతుంది. చూచే ఆ కలిని మనం తలచుకుంటున్నాంవా లేదా? (ప్రక్కకుచూచి) అదిగో మెడికల్స్టూడెంట్సు (Medical students) కావోసు వస్తూవున్నారు. దీన్తో మాట్లాడడం చూచేరంటే తడకలు కట్టేస్తారు. యీ ముండని మెల్లగా తగలెయ్యాలి—(పైకి) మాణిక్యం, అదిగో కుట్రవాళ్ళుకావోసు వస్తూవున్నారు. నీతో యేకాంతంగా మాట్లాడడం చూచేరంటే రేపు మీటింగులో యేంవిచెప్పినా 'యీ వెధవ, మాణిక్యం దగ్గరం లంచంపుచ్చుకొని యీలాచెబుతూవున్నాడూ—యిదంతా అట్టర్ లై (Utter lie) అనగా సర్వఅభద్ధం' అని అంటారు.

మాణి—నిజంవే-నేను శెలవు పుచ్చుకుంటాను బాబు. దీపాల పెట్టేవేళకు వకమారు దయచెయ్యండి. మా కమలంకూడా చెప్పింది. మర్చిపోకండి.

వెంక—గెట్ ఎవె ఓల్డు హాగ్ (Get away old hag ) సరే— తప్పక వస్తానులే—

మాణి—(నిష్క్రమించును.)

వెంక—మహాప్రభో—ఇంతటితో ఈపూటకథ వెళ్ళింది... దీనిసిగాత రగా—ఈలంజతల్లిని ఏంచేసినా పాపంలేదు—"విటులపాలిటి యమదూత వేశ్యమాత" అని అన్నవాఁడు బహు అనుభవశాలి—ఈమాంశంలో రుద్రయ్యకూడా మాంచాగా ఏడ్చేడు...

"సీ. పిసుగుచందంబునఁ । బడిమోఁదు తెరువాటు
కాసికైన నాకింత । కరుణపుట్టు
బహుధనాపేక్షచే । బాధించు నృపతికై
నను జనించు నాకింత । కనికరంబు
చేరి కన్నడభూమి । చెఱపట్టు పాశ్చాత్య
నృపతికైన నాకింత । కృపదలిర్చు
నతిపాతకుల నొంచు । యమకింకరుల కైనఁ
గందళించు నాకింత । కారుణికత

గీ. అసమసాయక సమరక । ల్మాంతరాయ
కరణ పారీణ వాక్ప్రక్రియా । గౌరవమున
నఖిల విటకోటి ధనమెల్ల । నపహరించు
లంజతల్లికి దయ లేదు । లక్షమైన."

ఇహ రామంలాడ్జికి పోదాం-యిక్కడవుంటే యెవరో వహరు వస్తునే వుంటారు—లెట్ మి రన్ ఎవె ఎట్ వన్సు (Let me run away at once).

(నిష్క్రమించును.)



# ద్వితీయరంగము.



స్థలం—రామం యిల్లు.

[రామారావు, క్రిష్ణారావు, నారాయణమూర్తి పేకాట ఆడుచూ, సిగరెట్లు త్రాగుచుందురు].

రామా—ఓరే క్రిష్ణా నిన్నటి ఆంధ్రపత్రికలో విడో మారేజి (widow marriage) అను శీర్షక క్రింద ఆర్టికల్ చూచేవురా. మనవాళకు యెంతబాగా వ్రాసేడో నో ?

నారా—పోనీ తెస్తు—వ్రాతలకేం అనేకం వ్రాయవచ్చూ—యేదీ అంత అనర్గళంగా వ్రాసేడు కదా వాడే విడోని మారేజి చేసుకొని ప్రాక్టికల్ (practical) గా లోకానకు దారిచూపించకూడదూ—చాలా యఫెక్టివు (effective) గా వుంటుంది. కబుర్లకేం—వేయికబుర్లు నేనూ చెబుతానబ్బీ !—చూచే రామం—యేదో శాస్త్రం చెబుతారు 'పడుపడుమన్న నాసవతే గాని పడే నాసవతి లేదని'—అదిగో ఆలాగువుంది. యీలా న్యూస్ పేపర్సు (news papers) లో ఆర్టికిల్సు (articles) వెయ్యడం, స్టేజిమీద లెక్చర్సు (lectures) యివ్వడం—యింట్లో) నూతనంగా విడో (widow) అయినవాళ్ళెవరైనా వుంటే సైలెంటు (silent) గా బుఱ్ఱనున్నగా గొరిగించి చక్కా వంటయింటిచార్జి అప్పచెప్పడంన్నూ—యీలా వుంటావి మన వ్యవహారాలు. క్రిటైజ్ (critise) చేసేవా అంటే దుఃఖపడి చస్తారు.

రాము—అయితే యీక్రిటిసిసమ్ అంతా మనవెంకడిమీదేనా—

నారా—షై—ఆలా పెరసానిఫికేషను (personification) చెయ్యన బ్బీ—నేను. వాడెక్కడ చండశాసనుడు—వాణ్ని పబ్లిక్ (public) గా క్రిటిసైజు (criticise) చెయ్యడంవే!

క్రిష్ణా—సరేకాని రామం—యెగ్జామినేషన్సు (Examinations యింకా 15 డేస్ ( 15 days ) వున్నాయి కదా! యీలా హాస్కు (husk) కొడితే యేలాగబ్బీ? యీసంవత్సరం కాని ఫేల్ (fail) అయేవంటే మీఅమ్మ తప్పకుండా యింటినుంచి గెంటుతుంది.

నారా—యిప్పుడి గెంటితే వకపని చెయ్యరా అబ్బీ—

రామ—యేవిటి? 'భవతి భిక్షాం దేహి' అని బయల్దేరమంటావా?

నారా—షై బ్రదర్ (Brother) నీకాలా చెబుతాను—చక్కా కందుకూరి వీరేశలింగం పంతులుగారి విధవాశరణ్యాలయము కు వెళ్ళి యెవర్నైనా రిచ్ యంగ్ విడో (Rich young widow) ని సెలక్టు (select) చేసి మారేజి (marriage) చేసుకొని చక్కా ఫారిన్ కంట్రీసు (Foreign countries) పారిపో—

క్రిష్ణా—ఓ యస్ గాను. వారే రామం ఆలా చేస్తానన్నా. దాన్లో తప్పేంవుంది? నేనైతే అలాగే చేస్తాను.

రామం—విడో మేరేజి (widow marriage) చేసుకుంటే మాత్రం-ఫారిన్ కంట్రీసు (foreign countries) కి పారిపోవాలని వుం దట్రా! దర్జాగా యీవూరిలోనే వుంటాను.

[ప్రవేశం సుబ్బావధాన్లు]

సుబ్బా—ఓరే రామం—యేవిటోయ్ బాతాఖానీ మీఅమ్మ వుందిరా యింట్లోను.

రామం—లేదు యిప్పుడే—సుసర్ల వారియింటికి వెళ్ళింది.

నారా—అవధాన్లుగారూ — యింకేంవుంది మీమేనల్లుడు విధవా వివాహం చేసుకుంటాడట చూచేరా--

అవధా—యెవడు మారామం వేనా ?

నారా—అవీడేను.

అవ.—అవునా? వెధవా—మీఅమ్మగాని ఆలకించిందంటే— ఆవివాహం యిప్పుడే చేసి వదలిపెడుతాది. ఓరీ కక్కుర్తీ యిదేం ఖర్మంరా వెధవని పెళ్ళాడడం—

రామం—వూరుకోండి మావగారూ—యీ వెధవని వేళాకోళాలకేం ?

క్రిష్ణా—లేదండీ అవధాన్లుగారు యిప్పుడు యీ వెధవా వివాహాలు దేశం అంతటానూ బాగా వ్యాపిస్తూయున్నావి. పత్రికల్లో కూడా వేస్తూవున్నారు—చూడండి కావలిస్తేను (అని పత్రిక అందిచ్చును).

నారా—అవధాన్లుగారు నలుగురు. అయ్యో—అడ్డాట వేదాంవా. యీ మొత్తడం అంటె తలనొప్పి నాకు.

అవ—ముసలి వాళ్ళు. మాంకు పేకాటసర్దాలు యేంవిటారి.

క్రిష్ణా—యిదిగో పత్రిక—చదవండి అవధాన్లుగారు.

అవ—యేడ్చేరు వెధవలు —వెధవవాత్రలు. వెధవల్ని పెళ్ళాడే బదులు యేటిలోపడి చావకూడదూ.

[ప్రి॥ వెంకటేశం]

రామం—యిదిగో వున్నాగదె కూడా యీ నేశంది—వీడూ దిగబడ్డాడు యిఖ మరి చదువు కాదు.

క్రిష్ణా—ఓరే వెంకటేశం వెల్కం (welcome).

వెంక—యేం అబ్బీ నాలిక తోటుప్పుకుతోంవుంది. (అటుయిటుచూచి) యేవిటోయ్ సీరియస్‌గా కూర్చొని యేదో డిబేటుచేస్తూవు

న్నారు. (అవధాన్లుచూచి) ఓహో అవధాన్లుమాఁవగార్లాగ వున్నారూ — నమస్కారం.

అవ—చిరాయుమస్తు—యేం వెంకటేశం, యెక్కడా కనపడలేదు— చాలా రోజులై.

వెం—వేరే పనివిషయమై తిరుగుతున్నానండి. కాని మాఁవగారూ యెవర్ని ' చావరాదా ' అంటున్నారు.

అవ—అబ్బే ! యెవర్ని కాదు యిదేదో వి—విడ—విదవా వివాహాలు చాలమంది చేసుకొంటూవున్నారంటు—అటువంటి అశాస్త్రీయ వివాహాలు చేసుకున్న బనులు చావరాదా అంటూ అన్నాను. అంతలో నీవు వచ్చేవు.

రామం—ఎటాక్ హిం వెంకా—Attack him Venka—బోంచేసేవురా? యింత వేగరంవే పెట్టేస్తుంది మా హోటల సూరమ్మ-

వెం—లేదుకాని. (అవధాన్లుతో) మాఁవగారూ అయితేనూ విధవావివాహాలు అశాస్త్రీయంవే అంటారా- బాల్యవివాహాలు శాస్త్రీయం అని వప్పుకుంటారా?

అవ—మనం వప్పుకుండేదేంవిటి? పెద్దపెద్దవాళ్ళు యీసంగతి తరచి తరచి వదలిపెట్టేరు. శాస్త్రల్లో స్పష్టంగా విప్పి చెప్పేరు—

వెం—యేఁవని?

అవ—వెదవల్ని పెళ్లాడరాదనీ—పిల్లల్ని యెనిమిదవయేట రాకముందే పెళ్లి చెయ్యమని — చూడూ పెళ్ళిళ్లలోకూడ "అష్టవర్షేభవేత్ కన్యా—"

వెం—ఆఁ-'దశవర్షంతు వైధవం' అనికూడ ఆపక్కనే వుందిలెండి—దానిమాటకేంగాని—చూచేరా మాఁవగారూ శాస్త్రాలు శాస్త్రాలు అని మనవాళ్లువూరికినే యేడుస్తూవుంటారు. శాస్త్రాలంటే వేరే దేవతులువల్లి మనకోసం పెట్టినవికావు. సంఘసంస్క

ర్తలు వాళ్ళవాళ్ళ సంఘములకు అనుకూలంగా కొన్ని కొన్ని నియమములుచేసి ఆలానడచేరు- వాటినే శాస్త్రాలన్నారు. ఈ నియమములు కాలపరిస్థితులబట్టి అనుసరించిన వాటచేతను కాలము మారుతూవుంటే నియమములుకూడ మారాలను. ఫర్ యగ్జాంపిల్ (For Example) యీ యిన్ ఫెంటు అండ్ విడో మేరేజస్ (Infant and widow marriages) సంగతి వినండి- పూర్వం మనదేశము తురకరాజులక్రింద వుండేది— వాళ్ళు యేలారాజ్యంచేసేరో దేశచరిత్రలు చదువుతే మీకు బాగా బోధపడుతుంది — కాని చెబుతే నమ్మరు. పెనంలో పేలాలు వేయించినట్లు ప్రజల్ని వేయించేసేవారు. గోవుల్ని నరికేసేవారు. దేవుండ్ల గుళ్ళను విరగగొట్టేవారు. ప్రజల్ని అష్టకష్టాలూ పెట్టేవారు—ఆడవాళ్ళని చెరపట్టేవారు — అడ్డుకున్నవార్ని గొడ్డును నరికినట్లు నరికేవారు —

అవ—శివ శివా!

వెం—చూచేరా మావఁగారూ యీమాట వాళ్ళముందు అనగల్చే వారూ? శివశివా అంటే చెప్పుపట్టుకొని చెడ్డాలు వూండకొట్టేవారు. అంతక్షేమంగా వుండేది రాజ్యం. నిముషం మన్దికాద న్నట్టుండేది. అయితే 'గుడ్డిలో మెల్ల'న్నట్టు తురకలైనా వాళ్ళలో వక్కనీతివుండేది.

అవ—అదేఁవిటి ఆనీతి—

వెం—యెంతసేపూ యవ్వనంలోవున్న కన్యల్నే వెదకి వెతకి తీసుకపోయ్యేవారు కాని, పుస్తె మెడలో చూస్తె మరి వాళ్ళప్రాసుకు వచ్చేవారు కారు.

అవ—యేడ్చినట్టేవుంది. వెదవనీతి.

వెం—అది వెదవ సీతో పున్ని స్తిరి సీతో అదే రక్షించింది ఆరోజుల్లో. యెలాగంటారా మనపూర్వులందరూ గొప్పమీటింగు చేసి, యీలా 15, 16 యేళ్ళువరకూ పిల్లల్ని పెళ్ళిచేయకుండా వుండడంవల్ల యీ తురకవెదవలనుండి చాలకుటుంబాలకు ప్రమాదాలు సంభవిస్తూవున్నాయి. కాబట్టి యీవేళనుంచి బాల్యవివాహాలు అనగా యేడెనిమిదేళ్ళకే పెళ్ళిళ్లు చేసివేస్తే బాగావుంటుందీ—వీళ్ళపోరు మరివుండదని అమాయకపు అప్పయ్యశాస్త్రిగారు రిజల్యూషను (Resolution) ప్రతిపాదిస్తే అవసరాల అగ్నిహోత్రావధాన్లుగారు బలపర్చేరు. అక్కడవున్న మనపెద్దలందరూ ఆమోదించినందువల్ల యునానిమస్ (Unanimous) గా రిజల్యూషను (Resolution) పేసు అయిపోయింది. అక్కడే సంస్కృతాన్ని శ్లోకాలు నాలుగు అల్లేసి తాటాకులపుస్తకాల్లో తండాగా యెక్కించేశారు. చూచేరా అవధాన్లుగారు యిందాక మీరన్న 'అష్టవర్షేభవేత్ కన్యా' అందులో మూడవశ్లోకం—యిప్పుడు తెలిసిందా?

అవ—బాగా తేల్చేవే కథ.

(రామం, క్రిష్ణా, నారా, నవ్వుచుందురు.)

వెం—టట్! అలాకొట్టి పారెయ్యకండి, యిది కథకాదు. దిస్ యిస్ వాట్ హాస్ యాక్చుయల్లీ హాపెన్డు (This is what has actually happened.) అనగా సరిగా జరిగినది. యూరోపియన్ హిస్టరి, రోమన్ హిస్టరి, గ్రీషియన్ హిస్టరి, (European history, Roman history, Greecian history) లో కూడ యీలాగే స్పష్టంగా వ్రాసుంది.

రామం—(నవ్వును) మామగారు మీరుకావలిస్తే ఆపుస్తకాలు చదవండి, నిజమో కాదో తెలుస్తుంది.

అవ—అబ్బీ నీవు చదివేవటోయి?

రామం—ఓ మూడుసార్లు తిరగేశాను.

వెం—యిటువినండి మాంవగారు—యిప్పుడు ఆరాజ్యం అగ్గిలో కలసి పోయి చక్కా రామ రాజ్యంలాంటి బ్రిటిష్ రాజ్యం వచ్చింది. అంచేత మనం చక్కా మళ్ళా మీటింగులు చేసి, యీ బాల్య వివాహాలు రూపుమాపి యెప్పట్లాగు బాల్యానంతరవివాహాలు, విధవావివాహాలు, చేసుకుందాం అని రిజల్యూషను పాస్ (Resolution pass) చేస్తే నేనే నాలుగుళ్ళో కాలు అల్లిపారేస్తాను.

అవ—యిదివరలో మనపూర్వులు యీలా యుక్తవయస్సులో వున్న వాళ్ళనే వివాహాలుచేసేవారని యేంనిదర్శనము?

వెం—మళ్లా మొదలుకేవచ్చేరూ మాంవగారూ? అయితే మీకు తెలియదన్నమాట. మీరు యెప్పుడైనా రామాయణం భారతం భాగవతం చదివేరా?

రామం—అవధాన్లు మాంవగారు అవి చదువకుండునా?

అవ—ఓ చదివేనే!

వెం—దాన్లో ఆవివాహఘట్టాల్లో యెవరికైనా బాల్య వివాహాలు, అయినట్టుందా, లేక స్వయంవరాలు అయినట్టుందా?

అవ—సరే—వాళ్ళురాజులు కాబట్టి వాళ్ళకాలా అవిపోయింది—

వెం—నో. నో-(no, no) ఆలాసెలయివియ్యకండి. 'యథారాజా తథాప్రజాః' అన్నాడు. రాజుయేలాచేస్తే ప్రజలు ఆలాచేసేవారు. ప్రజలు యేలాచేస్తే రాజు ఆలాచేసేవాడు. అందుచేతనే ఆకాలంలో, ప్రజల్ని చూస్తే రాజుకి ఆమోదంగావుండేది—రాజుల్ని చూస్తే ప్రజలుకు ఆహ్లాదంగా వుండేది. ఇంతయెందుకు యీశ్వర సృష్టిలో ప్రతివారికి సమానాధికారంవుంది. వకర్ని యే

డవమని వకర్ని నవ్వమని చెప్పలేదు. అది అనవసరంగా మనం వే కలుగజేసుకొంటున్నాం — యేడిపించినవార్ని నవ్విస్తే పుణ్యం — నవ్వుతావున్న వార్ని యేడిపిస్తే పాపం — మేంవంటారు.

అవ — అవును.

వెం — అంచేతే వెధవలను పునర్వివాహాలు చేయించి, వాళ్ళని దుఃఖ వారాసినుండి వడ్డుకుచేరిస్తే మహాపుణ్యం — లేదూ "వెధవల్ని పెళ్ళిచేసుకోరాదూ, శాస్త్రసమ్మతం కాదూ" అని అని అడ్డుతగులుతే మహాపాపం సంభవిస్తాది. తెలసిందా యేం వంటారూ?

రామ — యగ్జాక్ట్లీ (Exactly) నిజం వేనూ.

కిష్టా — ఘోరపాపం వేనూ —

అవ — (పూరకుండును)

వెం — మాంవగారు వూరుకున్నారేం? చూడండి మరొక్కమాట. వెధవ అవగానే వాళ్ళలోవున్న మదమాత్సర్యములుకూడా వెధవ అవుతుందనుకొన్నారా యేంవిటి? యెంతవంటిపూట భోజనం అయినా — అదిగో ఓరే రామం - మీాఅమ్మ వస్తుందిరోయ్! యీ బాతాఖాని చూచిందంటే వెంటపెడుతాది. టేక్ ఎ బుక్ (take a book) (అవధాన్లుతో) మాంవగారూ యీా ఇన్ఫెంటు అండు విడో మారేజస్ (Infant and widow marriages) విషయమై రోజులకొద్ది లెక్చరు (lecture) యివ్వవచ్చు. మొన్నటి కాకినాడ కాంగ్రెసులో దీనిగురించి రెండురోజులు లెక్చరిచ్చేసరికి గాంధీగారు గాబరా అయిపోయి సర్ (sir) అని టైటిల్ (title) యిచ్చేరు. అదిగో ఆవిడవస్తుంది. యీా సంగతులు విన్నదంటె మరి యింటికిరానివ్వదు. రేపుమాా లాడ్జికి వకసారి రండి. యీా లెక్చరు ఫినిష్ (lecture finish)

చేసి మీచేతనే ఔననిపిస్తాను. గుప్పి చప్పి (old womna) ఓల్డు ఉమన్.

[ప్రవేశం—సుబ్బమ్మ.]

వెం—రీడ్ ఆన్ రామం—(read on Ramam.)

రామం—(పేకదాచివేసి పుస్తకంపట్టి చదువుచున్నాడు. క్రిష్ణారావు నారాయణమూర్తి మెల్లగా జారిపోవుదురు.)

రామం—

"Oft I had heard of Lucy gray
and when I crossed the wild
I chanced to see at break of day,
the solitary child."
"O Mary go and call the cattle home,
and call the cattle home,
And call the cattle home,
Across the sands of Dee.
The western wind was wild and dank with foam
And all alone went she."

సుబ్బ—యేం- అబ్బాయీ పరీక్షలు యింకా రెండువారాలైనా పూర్తిగా లేవుకదా యీలా బాతాఖానీ చేస్తే నీమొహం, యేలా పేసవుతావురా? యీసంవత్సరం కాని పేసు కాకపో యేమంటే నిన్ను యిట్లోనుండి గెంటెయ్యడం వే- తెలసిందా.

వెం—యీసంవత్సరం మీవాడు ఫస్టుగా పేసు అవుతాడండీ— నిన్ననే వీళ్ళ హెడ్ మాస్టర్ (Head master) గారితో కలుసుకొని మాట్లాడేను. మార్కులు మాం బాగా వచ్చేవట. బాడీ గార్డ్సుతో (Body guards) తో మరిన్ని-

సుబ్బ—బాబూ నివ్వా - నేమానివాళ్ళ కుఱ్ఱవాడనుకొన్నాను. కచేరికి వెళ్ళి చక్కా పనిచేసుకుంటున్నావా?

రామం — వాట్ ? ఆఫీసు ? (whit? office ?)

వెం — (రామంతో కన్నుగీటి) స్టాప్ మాన్ ఎ (stop man a) కోతా- ఆ వెళ్లుతూ వున్నానండి. చక్కా- పనిచేసుకుంటూ వున్నాను. జీతం వరిమోషనుకూడ చేసేరు.

సుబ్బ — యిప్పుడు యెంతయిస్తున్నారు నాయనా ?

వెం — అరవై అయిదున్నర యిస్తున్నారమ్మా. యింకా ముందుకు జాస్తీ చేస్తారు.

సుబ్బ — యీ సంవత్సరం, మా వాడు పేసుకాగానే మీకచేరీలోనే ప్రవేశపెట్టిస్తాను. దేనికైనా యీ వెధవాయి బాగా చదువుతేనా ?

వెం — బాగా చదువుతాడండి- మీ వాడు మంచి తెలివైనవాడు కూడాను.

సుబ్బ — అయితే బాబూ యేవైనా ఖాళీలు వున్నావా మీకచేరిలోనూ ?

వెం — ఓ కావలసి నన్ని- నిన్ననే ముగురికి నోటీసు (notice) లు యిచ్చేరు- రిట్రెన్చ్‌మెంటు (retrenchment) లో. మీ వాడివిషయంలో నేను శ్రద్ధతీసుకొంటాగా.

రాము — (చదివిందే చదువుతున్నాడు) ఇఫ్ ఐ యామ్ టరన్డు అవుటాఫ్ ది హౌస్ ఐ విల్ సర్టన్లీ మారీ ఎ విడో "If I am turned out of the house I will certainly Marry a widow"

సుబ్బ — మా వాడు యేదిచదివినా అనర్గళంగావు నీరుతాగినట్టే చదువుతాడు.

వెంక — యింకా దానిలో అర్థం మీకు తెలియదు. తెలుస్తే యింకా సంతోషిస్తారు.

అవ—వెంకటేశం- యిదేమిటి యేదో విహో అంటూవున్నాడు- వెధవపెళ్ళిస్స సంగతి కాదుకదా ?

వెం—హామిట్- అది కాదండి మామగారూ 'హా' అంటున్నాడు. హా అనగా ఎ బరడ్ (a bird) వక పక్షి అని అర్థం- వీళ్ళకి రసాయన శాస్త్రం, పక్షిశాస్త్రం, గణితశాస్త్రం, కావ్యశాస్త్రం మొదలగు శాస్త్రాలన్నీ చెబుతారండి.

అవ—ఓసే అక్కా- రావే వీళ్ళ చదువు సంగతి మనకెందుకు. నా అమ్మ నిన్నొకసారి రమ్మంది.

సుబ్బ—వెుదు కబ్బీ ! వస్తానుండు. (వెంకటేశంతో) బాబూ పని సంగతి మాత్రం అశ్రద్ధచేయవద్దు-

రామం—ఓసే యిక్కడ చదువుకాకుండా బాతాఖానీ యేమిటమ్మా- కాస్త యింట్లోకి వెళ్ళిపోదూ. (అని చదువుచుండును)

సుబ్బ—సరే పోతానబ్బీ- నాయినా వెంకటేశం- వస్తానూ- అవదాన్నా- రారా యింట్లోనికి- కాస్సేపు రగాయపెడుతాను (వెళ్ళిపోతూ వెంకటేశంతో) బాబూ నీతో చెప్పదాం అని మర్చిపోతూవున్నాను. మా వెధవకు సిగరెట్లు రోజూ కాలుస్తున్నాడని విన్నాను. కాస్త కనిపెట్టి కోంబకుదూ, యెంతకన్నా నేను తిట్టను.

వెం—అలా అనకండి- యీకాలం సిగరెట్లు తాగక వల్లకాదు- చూచేరా మామ్మగారూ ప్రతి ఆఫీసులోనూ యిప్పుడు అధికార్లు తెల్లవాళ్లున్నారు. మనకు యేదైనా వుద్యోగం కావలిస్తే వాళ్ళదగ్గరకు వెళ్ళి అప్లికేషన్ అనగా అర్జీ యిచ్చుకోవాల. ఆదొర్లలు యిరువైనాలుగు గంటలూ సిగరెట్లు త్రాగుతునే వుంటారు. అంచేత యెవరు పనికోసం వెళ్ళినా,

సిగరెట్టు చేతికిచ్చి స్మోక్ ఆన్ మై డియర్ ఫెల్లో- (smoke on my dear fellow)- అనగా తాగవయ్యా అంటాడు.

రామం — వెల్ సెడ్డు వెంకా (well said Venka)-(చదువుచుండును)

వెం—అప్పుడుగాని తణుకూ, బెణుకూ లేకుండా అమాంతంగా జేబులో సిగరెట్టుతీసి అనర్గళంగా కాల్చినట్టయినా అరమైరూ పాయల జీతంకు ఆర్డరు పడేస్తాను. లేదూ 'నాకు సిగరెట్టు తాగడం రాదూ- మా అమ్మ కోపబడుతాదీ- నేను సిగరెట్టు తాగనూ' అన్నట్టయినా డామిట్ గెట్ యవే ఫెలో (get away fellow) అనగా పనీలేదూ గినీ లేదు పొమ్మని గెంటేస్తాను.

క. "జిగిబిగి మెరుంగులు గల
వగలాడిని బోలి నీవు! పాపపుఁజెడతో
జగమెల్ల మోసపుత్తువు
సిగరెట్టా నిన్ను నుతులు సేయఁగఁ దరమే?"

అన్నాడు- విన్నారా? అంచేత చూచేరా మామ్మగారు, ఆవిషయంలో మాత్రం మీరు అడ్డుపెట్టక అడిగినప్పుడల్లా అణా డబ్బులు పారేస్తూవుండండి—

సుబ్బ—అలాగా బాబూ. ముసల్దానను. యీలాంటి సంగతులు నాకేంతెలుస్తాయి—యీ వెధవకక్కుర్తి యీలా అని చెప్పడేం? పట్టినే సిగరెట్టు త్రాగుతే శరీరం చెడుతుందని కొంబడుతూవుంటాను.

వెం— పోనీ యిప్పటినుండయినా ఆ అభ్యంతరం యేంవీచెయ్యకండీ—

సుబ్బ — సరే—వస్తాను బాబూ. (నిష్క్రమణము అవధాన్లుతో)

రామం—ఓరే వెంకా యెక్సెలెంటు (excellent) అయిన కోతా కొట్టేవురా! యిఖ మరి దొంగతనంగా కాల్చ నవసరం లేదబ్బీ

పబ్లిక్కుగా (Public) గా మా అమ్మయెదురుగానే స్మోక్ (smoke) చెయ్యవచ్చును.

వెం—ఓరే రామం- నీగురించి యింతశ్రమ పుచ్చుకొని మీా అమ్మ భయంలేకుండా చేసేను. యేదీ నా ఫీజ్ (fees).

రామం—యీాపాటిదానికే ఫీజ్ డిమాంను (fees demand) చేస్తూన్నావ్ రా ?

వెం—యింతకన్నా యెక్కువ యేంవిచేస్తూన్నారనబ్బీ ప్లీడర్సు (Pleaders)కి హండ్రెడ్సు హండ్రెడ్సు (hundreds hundreds) ధారపోసేస్తారు మనవాళ్లు ?

రామం—యిందరా వక సిజర్ ప్యాకట్టు (sissor packet).

వెం—థేంక్ యు వెరీ మచ్ (Thank you very much) ఔనుగాని యేరీ యీా యిద్దరు వెదవలు యెక్కడకుకొట్టేసేరు—బై ది బై రామం (By the by Ramam) ధ్యానం విడచి లొట్ట లోపడ్డట్టు నేనొకపనిమీాద వచ్చి యీా హస్కు (husk) లో పడ్డాను. (యిటుఅటుజూచి) శారదయెక్కడ కనబడలేదేంవిరా?

రామ—ఓరే బ్రదర్ (Brother)- నీకు చెప్పడం మర్చేను. యెక్సూజు మి.(execuse me) దాని ఫాదర్ (Father) తో యెవడో మెల్లగా వూ—దే (యిటునటుజూచి) అబ్బీ మళ్లా మా అమ్మ రాగల్దు పద బీచికిపోదాం. నీతో కొన్ని సీక్రేట్సు (secrets) చెప్పాల్ను.

వెం—ఆల్ రైట్ కమ్ ఆన్ (All right come on)- గొడ్డుచచ్చినట్టుంది.

(యిద్దరు నిష్క్రమణము.)



# కాంతాపహరణము

## ద్వితీయాంకము.



### ప్రథమరంగము.

స్థలము:—మద్రాసు సెంట్రల్ స్టేషన్.

[ప్రవేశము :—వెంకటేశం వక సూట్ కేస్‌తో.]

వెం—తుదకు యేలాగో మహాసముద్రంలోనుంచి యీదేసి అమాంతంగా గట్టుచేరేం. నేను లోకంలో అందరికన్నా దురదృష్టమంతుణ్ణని అనుకుంటూ వుంటాను, గాని ఒకొక్కొక్కప్పుడు నా అదృష్టం, యీలా చుక్కల్లో చంద్రుళ్ళాగు, కనబడుతునే వుంటుంది. వెన్ లక్ ఫక్సు దేరీజ్ నన్ టు చక్ (When luck fucks there is none to chuck) అని మిల్టన్ (Milton) వుట్టినేనా అన్నాడు. (అని కొంచెం ఆలోచించి) అదృష్టం కాకపోతే యెక్కడ విశాఖపట్నం- యెక్కడ చెన్నపట్నం- చిల్లిగవ్వైనా చేతలేక, గేట్ (gate) యివతలకు వచ్చేసేవా ?—

తొత్తుకొడుకులు ట్రావిలింగు (Travelling) వాడెవడైనా వస్తాడేమో యని బెంగచేత, వూపిరి బిగపెట్టుకొని, హేటూ, బూటూ వున్న ప్రతివాడినీ ట్రావిలింగు (Travelling) వాడనుకొని, యేదో తమాషా చేస్తునే వుండేవాడిని. దేనికైనా మనపెద్దలు చెప్పిన సామెతలు వుట్టినే పోవు—'సాహసం

పురుషలక్షణం' అన్నాడు. చూసే నేను సాహసం చెయ్య కుండా ట్రెయిన్ చార్జెస్ (Train charges) లేవని యిర్రా వైజాగ్ (Vizag) లోనే కూర్చుంటే అమాంతంగా తన్నులు తినేద్దునే...ఆపూర్లో అప్పులు లావైనందుకూ, రంగనాయకు లిగారి కూతురికి నాకూ వున్న ప్రయివేటు కరస్పాండెన్సు (private correspondance) పైకి తెలిసిపోయినందుకున్నూ-దేరీజ్ గాడ్ ఎబవ్—(There is God above) యిఖపాత రస్తా పాతసంగతులూ మర్చిపోయి, యీపూర్లో కొన్నాళ్ళు వెలిగించాలి. (అని ఆలోచించి)

ఆహా చిన్నప్పుడే తలిదండ్రులు పోవడం—చెక్ (check) చేసే వాళ్ళెవరూ లేక యీలా సొమ్మంతా, డి. జీ. సు కింద తగ లెట్టేసి, యిప్పుడు విచారిస్తూయున్నాను. దేనికైనా అనుభవం అవుతేగాని తత్వం బోధపడదు. యిఖమీాదట యెప్పుడైనా, వాళ్ళగుమ్మం తొక్కుతానూ,—రిపెంటన్సు కమ్సు టూ లేట్ (Repentance comes too late)— లేకపోతె యేం గ్రహచారం టిక్కట్టు లేకుండా రాడానికి—ఓహో యేం గ్రాండుగా వుంది యీస్టేషను. నేనేకాని వక కవీశ్వరుణ్ణయి యుంటే వక చిన్నసీసపద్యం వ్రాసి ఆంధ్రపత్రికలో అచ్చువే యిస్తును.

(జోబీలు తడమి) దగ్గర సిగరెట్టు పాకెట్ (packet) తప్ప కప్పు కాఫీ (cup coffee) కైనా కాసీ లేదు. ఐతేనేం దేవు డిచ్చిన బ్రెయిన్ (Brain) వుంది కదా. యిహా పూర్లో పడు దాం—వేళైనది. ఇక్కడ తంబుచెట్టివీధిలో రంగయ్య హోటేలున్నదని విన్నాను. మెల్లగా అక్కడ బసవెయ్యాల. (రిక్షావాడిని పిలచి) హాల్లో కమ్ హియర్ (Hollow come

here) యీసూటుకేసు బండిలో పెట్టు. తంబుచెట్టి వీధిలో రంగయ్య హోటేలుకు తీసుకపో. (తాను కూర్చొని) గాన్ రన్ ఆన్ (Gone run on)—ఆకలి వేస్తుంది. వక ఆణా మెక్కువ యిస్తాను.

రిక్షా—సార్ తంబుచెట్టివీధి యిక్కడకు నాలుగు మైళ్ళు వుండాది. చాలదూరము. తమరు యేమియిస్తురో యిప్పుడే చెప్పవాలా.

వెం—నేను యీవూరికి కొత్తలాగు చెబుతూవున్నాం యేంవిటి. తంబుచెట్టివీధి యిదిగాదూ. వక్క నిముషం పట్టదు పరుగెత్తి వెళ్లేను. యేదో నాకుతోచింది యిస్తానులే. పద, వేగరం ఆలస్యం చేయకు ఆకలి వేస్తూవుంది.

రిక్షా—సార్ మీరు యీవూరికి క్రొత్తమోస్తరువుండారే. లేకుంటె తంబుచెట్టివీధి యిదిగాదూ అని శెలవిస్తూవుండారు. మీకు తెలుసునా దారి.

వెం—నే నెప్పుడో నాచిన్నతనంలో యిక్కడ చదువుకొనేవాణ్ణి. అప్పుడు స్కూలుకు వెళ్ళుతానని పుస్తకాలు పట్టుకొని, చక్కా యీ కాఫీ హోటేళ్ళు, పాత సెంట్రల్ స్టేషను (central station) కొత్త సెంట్రల్ స్టేషను, (central station) నూ, ఎగ్మూరూ (Egmur) నూ, ట్రిప్లికేను (Triplicane) నూ, యివన్ని తిరిగి, సరిగా భోజనంవేళకు, యింటికి వెళ్ళిపోయే వాడను. యిప్పుడు ఆదార్లు అన్నీ మర్చేపోయాను.

రిక్షా—సెంట్రల్ స్టేషను (central station) క్రొత్తా, పాత అని శెలవు యిస్తూవుండారు.

వెంక—యీసెంట్రల్ స్టేషను (central station) పూర్వం యిక్కడుండేదేంవిటి ? ఛా. ట్రిప్లికేను (Triplicane) లో వుండేది. అప్పటికి నీకు చిన్నతనం అయివుంటాది. చాలదూరం అయి

పోయినదీ ప్రయాణికులకు, రిక్షావాళ్ళకి చాలశ్రమకలుగుతూ వున్నదని యిక్కడకు మెల్లగా యిడ్చేశారు. అపును గాని మరి యెంతంటావ్.

రిక్షా—రెండు రుప్పా సార్.

వెంక—లేదు వన్ రుపీ (one rupee) యిస్తాను. మరి మాటాడకు. యింకా వేగరం వెళ్ళేవా అంటే మరొక క్వార్టరు (quarter) యిస్తాను.



# ద్వితీయరంగము.



రంగయ్య హోటేలు.

రంగ.—ఓసీ వెంకీ—వేగం బజారుకు పోయి కూరలు తేవే. పదిగంటలు అయింది. యెప్పుడింకా వంట చేసేది.

వెంకి—యేమిటినా తెచ్చేది బాబూ.

రంగ—నిత్యం యేమిచెప్పేదే—యిదెక్కడ మాలోకం—యేవో నాలుగురకాలూ, నాలుగుకూరలు తేవే. చప్పున పో. యిందు దుడ్డు—(యిచ్చును)

వెం.—బాబూ మైర్ వుండాదా?

రంగ—ఔనే మర్చిపోయ్యాను. పెరుగు నేటికి సరిపోయింది.

(వీధిలో 'ఓ' అని దీర్ఘ కేక)

రంగ—అదిగో పెరుగు, పిలవే యిటు- వకఅణాది తీసుకో.

వెంకి—యేయ్—మైరూ. యింగ వా- వరణా మైరు కుడు.

(పెరుగువాడు వచ్చి పెరుగుయిచ్చి కేక వేసుకొంటూ వెళ్ళిపోవును.)

[వర్రి॥ గున్నయ్యపంతులు యింటినుండి యెంగిలి చేతితో]

యేవయ్యోయ్ రంగయ్యగారూ, యీకూరలో అన్నం మెతుకులు. (చూపిస్తు) ఛై-ఛై-యేవి అనర్థ వచ్చి పడ్డాదయ్యా - యెవరు విడచినకూరో—

రంగ—యెందీ!—యెవరో విడచిపెట్టినకూరా, యీలాంటిమాటలకే వళ్ళు మండుకొస్తుంది. ఇహ యేంవైనా అంటె యిదిగో రంగడు యీలాంటి కోపిష్టి అంటారు—పొద్దున్నే లేచి, కాఫీ అలవాటు లేదన్నారని, ఆయింతా వేడి వేడి అన్నం కూరా పెడుతేనూ, కూరలో మెతుకులు వున్నావని అంటారేం గ్రహ

చారం! యెవరైనా యిలాంటిమాటలు వింటే నాపరు వేం వుండీ యిహ- మాహోటేలులో మరి మీరు తిన అవసరం లేదు. యే 'ఆనందభవనో' యే 'కోమలవిలాసు' కో పోయి ఆయెంగిలి మెతుకులు అక్కడేతినండి — మీమాటలూ వద్దూ మీడబ్బు అంతకన్నా వద్దూ —

గు — యెంపయ్యో యిదేంవిటి పెడార్దీసుకొని పిలాగుంది. పైసా పుచ్చుకొని, పాడిఅన్నం, పాచికూరా పెట్టి తిరిగీ బుకాయిస్తావున్నావ్. అంతగట్టిగా మాట్లాడుతే జడుసుకుంటా ననుకున్నావేం? యీలా అన్యాయం చేస్తే యేం నిలుస్తుందయ్యా నీడబ్బు. న్యాయండబ్బు పుచ్చుకొని న్యాయంగా తిండి పెట్టాలుగాని.

రం — ఓ నీవు యిచ్చినడబ్బుకు —

గున్న — కావలిస్తే వకడబ్బు యెచ్చు పుచ్చుకోవాలనుగాని- యెంగిలికూర పెడుతావటయ్యా? యెవరు చెప్పేవాళ్లు లేకా. మెల్లగా మాట్లాడుతూవుంటే గమ్మత్తు చేస్తూ వున్నావూ. యీలాగైతే నీకు రావలసిన సొమ్ము యిస్తానులే !

రం — యివ్వకుంటే పోనీ నీవిచ్చేది యెంది? నే పుచ్చుకునేది యెంది? నీలాంటి చిల్లరవాళ్ళని నేను గమనించేది లేదు.

[ప్రి॥ రిక్షావాడు]

రిక్షా — సామీ యెవరో జంటల్‌మాను, మీ హోటేలుకు వచ్చియుండారు. అవతల్నే నిలచియుండారు. తమురువా వచ్చి తీసుకపోండి.

రంగ — యెవరో పోయి తీసుకురారా, లోపలకు. పైని యెందుకు వుంచేవు? (గున్నయ్యతో) యీవేళకు వూరుకోండి మరి నోరు పెట్టకండి. యెవరో వచ్చినట్టుంది. ఆలకిస్తె నాపరువు పోతుంది. తెలియక పొరపాటుజరిగినది — నిన్నను రాజమండ్రినుంచి

వచ్చినవారిద్దరి ఆకులలో కూరా, మాపనిమనిషి కిచ్చేదాం అని ఆకులోపెట్టి వేరే వుంచేను.

గున్న—(ఆత్రుతతో) అదికాని పెట్టిశా వేంవిటి?

రంగ—పొరపాటు జరిగింది మరేంచేసేది గున్నయ్యగారు. గ్రిహచారం జరిగిపోయింది. యేంవిచెయ్యగలం. చెయిజారింది. క్షమించండి.

గున్న—ఛా-ఛా-ఛా- (శోకుతూ) నిజంగా యెంగిలేనా. రామ రామ యేం గ్రిహచారం అయ్యా నీహోటేలుకు రావడం-ఆకక్కట్టల యెంగిలి తినడం వచ్చింది.

రం—వురుకోండి— మీాధర్మవుంటూది. గున్నయ్యగారూ—అదిగో యెవరో వస్తున్నారు—నాపరువు పోతుంది.

[ప్రి॥ రిక్షావాడు, వెంకటేశం సూటుకేసు (suit case) తో]

రం—అయ్యా తమ దేయూరూ ?

వెం—మాది విజయనగరం అండి. నాకు వేరే కోర్టుపనిమీాద యిక్కడ నెలరోజులు వుండవలసివచ్చినది. మావూర్లో నా ఫ్రెండు (friend) రామారావని వకప్లీడరు వున్నాడు. అతను యెప్పుడు యిచ్చటకు వస్తునేయుంటాడు. అతను చెప్పేడు యీాలా 'రంగయ్యగారి హోటేలుకు వెళ్ళితే చాలా సదుపాయం' అని. అంచేత స్టేషనునుండి కనుక్కొంటూవచ్చేను.

గున్న—యేదయ్యా నాపెట్టె- నేను వెళ్ళిపోతాను. (అనుచూ లోపటికి పోవును).

రంగ—సరే వెళ్ళండి. అదిగో పెట్టె యింట్లోను. (వెంకటేశంతో) చూచారండీ అన్నంతిని సొమ్ము అడుగుతే యెంతకోపంవోనూ.

వెం—టూట్- అలాగు యెప్పుడు కోపంతెచ్చుకోరాదు. హోటేలలో బోంచేస్తె వాళ్ళకి ముందుగానె సొమ్ము యిచ్చివెయ్యాలి.

చూచే రంగయ్యగారు, నేను కలకత్తాలో రెండు సంవత్సరాలు బి. యే. చదువుకొన్నాను. హోటేలులో భోంచేసేవాడిని. నెల యింకా పూర్తిగా అయేదే కాదు, సొమ్ము యిచ్చేస్తూయుండే వాణ్ని.

రంగ—చిత్తం బాబూ. ఆలావుండాలి పెద్దమనిషితరహా—మీాదయయుండబట్టి, శ్రీవతీసుకొని యీాలా హోటళ్ళన్నీ దాటించుకొని వచ్చేరు. బట్టలుతీసి అట్టాపెట్టండి—కాళ్ళు కడుగుకొందురు గాని—తమ యింటిపేరు ?

వెంక—మాయింటిపేరు కస్తూరివారండి—మేము నియోగులము.

రంగ—ఆలాగునా బాబూ మీానాన్నగారి పేరూ ?

వెంక—శతావధాన్లుగారండి.

రంగ—చిత్తం. పేరు యెప్పుడో విన్నాను. వారేంచేస్తూన్నారండి?

వెంక—మానాన్నగారికి వృద్ధాప్యం. నేను వక్కణ్ణే కొడుకును. అంచేత యెంతో ముద్దుగాచూస్తూ చదివించేరు. అన్నిపరీక్షలూ అనర్గళంగా పేసు అయేను గాని, యేంపనిలోకి వెళ్ళనిచ్చేరుకారు. వాళ్ళు భూములు వ్యవసాయం చేస్తూ మాగ్రామంలో వున్నారు. నేను అక్కడవుండడానికి యిష్టంలేక విశాఖపట్నంలో బీచిని వక మేడ కట్టించి అచ్చటనే వున్నాను.

రిక్షా—నాకు లీవు యిప్పించండి సార్ (Sir).

వెంక—అ—యిదిగో—యిస్తున్నాను. (అని జేబులో చెయిపెట్టి ఆత్రుతతో అన్నిజోబులు వెతకి) అయ్యో తాళం కనబడకుండా వుందేంవిటి ?—యెక్కడో దాన్లో పడిపోయివుంటాది—వుండండి రంగయ్యగారూ, స్టేషను (Station) వరకూ వెళ్ళి వస్తాను.

రంగ—శాదస్తం కాని, పోయినతాళం యింకా కనిపిస్తుందీ? యీపాటికి యెవరిచేతనైనా పడే వుంటాది.

వెంక—అయితే పెట్టె యేలా రావడం ? ప్రస్తుతం యిబ్బందిపడాలే.

రంగ—యేం యిబ్బంది నిమ్మళంగా విరగగొట్టవచ్చు.

వెంక—అవునులెండి—ప్రస్తుతం జేబులో రాగికానీ లేదు. రిక్షావాడికి రూపాయి యివ్వాల.

రంగ—సరేలెండి నే నిస్తాను. తరువాత మనం చూచుకోవచ్చును.
(అని మొలను తీసియిచ్చును)

రిక్షా—యేమి సార్ వక్ రుపీ దా యిచ్చినారు ? మరివకటి.

రంగ—అరె వెధవా నీకు రెండు రూపాయలటరా, కూలి స్టేషనుకు యిక్కడికిన్ని ?—

రిక్షా—వూరుకోవయ్యా—నీ కెందుకు ?

వెంక—రంగయ్యగారూ—పారెయ్యండి మరొకరూపాయి. యీలాంటి వెధవలతో మనలాంటివారం నోరు చేయరాదు.

రంగ—(యిచ్చును) తీసుకుపోరా.

రిక్షా—గుడ్ మార్నింగు సర్. (Good morning sir)
(అని నిష్క్రమించును.)

రంగ—మీరుగనుక యిచ్చేరుగాని నేనైతే పొమ్మనేదునండి—

వెంక—పోనిస్తురూ—యీలాంటిస్వల్పంలో మాటపోకూడదండీ—చూచేరా ఆరెండురూపాయీలు మన కొక ఖాతరులేదు. వాడికి అదే వకకొండ. అంత యివ్వనంటె యేడుస్తాడు—వక ప్రాణి యేడుస్తూవుండగా నేను భరించలేనండి—

రంగ—యేలాగైనా నియోగులింట బిడ్డలు మీరు. చూచేరా యేవన్నాడో కవి—"నియోగులు రాజయోగు, లవయోగులు

జోగులు భోగు లిమ్మహిర్ణ్" అని—యిఖ మాసంగతి చెప్పకోమంటారా "సన్నకుట్టువిస్తళ్ళకు పప్పుపచ్చళ్ళకు సంతసమొందుదురయ్యా వైదికుల్" అన్నట్టు మేం యెప్పుడూ తిండి తిండని యేడుస్తాం—సరే కాని—బాబూ తమరు స్నానానుకు వెండి వేడినీరు పోసుకుంటారా ?

వెంక—ఆ- యింటివద్దను, వేడినీరే అలవాటండీ. (అని లోపలికి పోతూ) రంగయ్యగారూ మరొకమాట—చూడండి, నేను డబ్బుగురించి కేర్ (care) చేసేవాడను కాను. మీయిష్టం వచ్చినంత తీసుకోండి, గాని కొంచెం దయవుంచి నాకు స్పెషల్ మీల్ (special meal) అనగా ప్రత్యేకంగా భోజనం పెట్టాల.

రంగ—అయ్యా డబ్బా శాశ్వతం ? మాట వుండాలి, ఫలానాచోటికి వెళ్ళితే బాగా ఆదరిస్తారని. నిన్నప్రొద్దున్న కావోసు బోంచేసేరు—యిదిగో వంట అయిపోవచ్చింది.

వెంక—దారిలో యెంతతింటే నేంఅండి, అన్నంతో సరిరాదు. టిఫిన్‌కు (Tiffin) కు నాకు, నాఫ్రెండ్సుకు (friends) కు ఫైవ్ రుపీస్ (five rupees) అయేవండి.

రంగ—మీరు స్నానంచేసి మడికట్టుకొనే సరికి భోజనం తయారూ.

(నిష్క్రమించును.)



# తృతీయరంగము.

స్థలము:— మెడ్రాసులో నొకవీధి.

[ప్రవేశం— వెంకటేశం.]

నేను వచ్చి నియర్లీ ఫయివ్ వీక్సు (Nearly, five weeks) అయింది. వచ్చినదుండి ప్రతిరోజూ తండాగా బోంచేసి, యెన్నివీధులు తిరిగినా, యింకా యీకల్లుక్రొత్తవీధులు చూస్తునేవుంది. యేమి అద్భుతం! వక్కనాడైనా యీలాగు యీమెడ్రాసు వీధులలో తిరుగుతాననుకున్నానూ? నేననుకుండే దేంవిటి? నెససిటీ ఈజ్ ది మదర్ ఆఫ్ యిన్వెన్షన్ (Necessity is the mother of invention) అన్నాడు. అక్కడ పప్పుడక్కకదా యిక్కడకు వచ్చేసేరు. (ఆలోచించి) హోటేలు వకటి మంచిది దొరకింది. పూర్ మేన్ (Poor man) వట్టి అమాయకుడు. మంచి మంచి మాట్లాడినట్లయినా మంచి మంచి కూరలు వండి పెడుతాడు. వట్టి మాటలుతో భోజనమే కాకుండా ఫిఫ్టీన్ రూపీస్ (Fifteen rupees) నగదు అప్పు పుచ్చుకున్నాను, నాపైకర్చుకి.

యింతకు నామానసఫలం మూ బాగుంది. నాకుడికన్ను బెదురుతూవుంది. యెపుడుబెదరినా యేదో వకలాభం వున్నదన్నమాటే. (అని యిటు నటు జూచి) ఆ వస్తున్న దెవరు నాలాగే దేశదిమ్మరిలాగున్నాడు. స్నేహంచేస్తే యీలాంటి వాళ్ళతో చెయ్యాల. చేసినా కుదురుతుంది. బర్డ్సు ఆఫ్ ది సేమ్ ఫెదర్ ఫ్లాక్ టుగెదర్ (Birds of the same feather flock together). (అని దగ్గరకు వెళ్లుచుండగా (ప్ర॥ వేణు) యేవం

డోయ్ మిమ్మల్ని యెక్కడో చూచినట్టుంది. యెప్పుడైనా వైజాగ్ (Vizag) వచ్చేరా ?

వేణు—లేదండీ వైజాగ్ (Vizag) నేనెప్పుడూ రాలేదు. వకసారి విజయనగరం వచ్చేనండి- వేరే వకపనిమీద. మీ నేటీవు ప్లేస్ వైజా (Native place Vizag) గా యేమి ?

వెంక—కాదు కాని ఫర్ ది ప్రిజంటు (for the present) అక్కడే వుంటున్నానండి. యిప్పుడు బాగా జ్ఞాపకం వచ్చింది. మిమ్మల్ని విజయనగరంలోనే చూచేను. మనం అంతా వక (side) వాళ్ళమే. నేను మొన్ననే వేరేపనివిషయమై వచ్చేనండీ. వచ్చినకానుండీ మనసైడు ఫ్రెండ్సు (friends) వకడూ కనబడలేదు. యిప్పటికి మిమ్మల్ని చూచేను. ఐ యాంమ్ వెరీ గ్లాడ్ (I am very glad)—మీ నేటివ్ (Native) ప్లేసూ?

వేణు—కాకినాడ జగన్నాథపురం అండి.

వెం—ఆలాగా అండి. మీవూరి శ్రీకృష్ణవిలాస్ డ్రామా కంపెనీ వారు మా వైజాగ్ (Vizag) వచ్చి తౌజండ్సు (thousands) డోసేశారండి. వారికి చాల రస్పెక్టు (repect) వుంది అక్కడ. ఆల్ మోస్టు ఆల్ బెస్ట్ యాక్ట్సు (Almost all best acts)

వేణు—మీరు చూచేరా అండి ?

వెం—అయ్యో చూచేరా అని అడుగుతూవున్నారూ ? ప్రతిడ్రా మాకూ వెళ్ళేవాళ్ళమండి. రామకిృష్ణారావు (Ramakristna-rao) నాయుడుగారు ఫిలిమ్ యాక్టర్సు (fillim, actors) ని మించేస్తారండి. అహాహా! అంత గ్రాండు యాక్టర్ (Actor) ని నే నెప్పుడూ చూడలేదు. ప్రహ్లాదలోని హిరణ్యకశ్యప కేరక్టర్ (Charactor) చూస్తే ట్రెంబలింగు (trembling) పుడుతుందండి.

వేణు — అతనికేం ? స్టేజి యెక్స్పీరియన్సు (experience) బాగావుంది. ఆల్ రవుండు యేక్టర్ (All round actor) సారంగధర లోని, రాజరాజనరేంద్రుడు వేసేరంటే ఆ ఫీలింగ్సు (feelings) యెవరు చూపించగలరండి ?

వెం — సింపిలి యెక్సలెంటు (Simply excellent !) 'ప్రమీలార్జునీయం' లో హౌ బ్యూటిఫుల్ (How beautiful) యేమంటారు ?

వేణు — అనేదేంవిటి ? డిస్క్రైబ్ (describe) చేసేదేంవిటి ? చూచేదితప్ప.

వెం — మొత్తముమీద హోల్ కంపెనీ, యాక్షన్సు (Whole Company, actions) కు పుట్టినిల్లు-అన్ రయివిల్డు (unrivalled).

వేణు — నాయుడుగారు స్టేజి కండక్టరు- అందుచేత చూచేరా చిన్నపిల్లలు కానుండి యెంతబాగా యేక్టు (Act) చేస్తారోనో ?

వెం — అలాగునా అండి! అయితే క్రెడిట్ (Credit) అంతా నాయుడుగారిదే. మొన్న ట్రిప్ (Trip) లో మా ఫాదరు (Father) నాయుడుగారికి, జగన్నాయకులు, హీరోయిక్ కేరక్టరు వేస్తాడూ అతనికి — ప్రహ్లాద వేస్తాడు, కంసాల్ల కుఱ్ఱవాడట అతనికీ మెడల్సు (Medals) న్నూ కంపెనీ (Company) కి వక సిల్వర్ (Silver) క ప్పున్నూ ప్రెజంటు (Present) చేసేరండి- అయితే మీరిక్కడున్నారేం బ్రదర్ (Brother ?)

వేణు — యిక్కడ మా బ్రదరిన్లా (Brother-in law) వున్నాడండి. అతను ఫర్వార్డింగు యేజన్సీ కంపెనీ (Forwarding agency Company) లో మేనేజరుగావున్నారు. మా సిస్టర్ (sister) కూడా యిక్కడేవుంది. వకసారిచూచిపోదామని వచ్చేను.

వెం—మంచిపని చేసేరు బ్రదర్- యీద సిగరెట్టు కాల్చండి. (యిచ్చి అగ్గిపుల్ల అరగదీసి అందిచ్చి తాను కాల్చును.) అయితే బ్రదర్ (Brother) నాకొక సహాయం చెయ్యాలను.

వేణు—యేంటది నేచెయ్యవలసిన సహాయం ?

వెం—యేంచేదూ. యేదైన వుద్యోగం చూచుకొందాం అని టూ మంత్సు (two months) అయింది యీవూరు వచ్చి. సిన్సియర్ ట్రయిల్సు (sincere trials) చేస్తూవున్నాను. యెక్కడా వుద్యోగం దొరకకుండా వున్నదండి. మొన్ననే వకవెదవ వుద్యోగం యిస్తానంటే టూ హండ్రెడ్సు రూపీసు (two hundred rupees) యిచ్చేను. వుద్యోగం దొరకలేదు. సరేకదా ఆ (rupees) కూడా దొరకలేదు.

వేణు— క్రిమినలు (criminal) గా ప్రొసీడ్ (proceed) కాకపొయ్యేరా-

వెం—(criminal) గా ప్రొసీడ్ (proceed) అవడానికి చిన్న చిక్కొచ్చి పడిందండి. మొన్ననే (penal code) అంతా తిరగవేశాను. దానిలో లంచం యిచ్చినవాడికి పుచ్చుకొనేవాడికి కూడా పనిష్మెంటు (punishment) వుంది. అంచేతే చక్కావూరుకున్నాను.

వేణు—యేమీా ఫర్వాలేదు. మా వూళ్లో వక ప్రసిడెంటు (president) లంచం పుచ్చుకొని పనియిస్తే అదిమెల్లగా లీక్ (leak) అయిపోయింది. గవర్నమెంటు (Government) దఖలుపుచ్చుకొని వాడిని ప్రొసీక్యూట్ (prosecute) చేసేశారు. చూచేరా బ్రదర్ (Brother) అంచేత వెంటనే ప్రొసీడ్ (proceed ) కాండి.

వెం.—యింతకు గొప్పచిక్కు ఆ అసామీ కనబడడండి. యెక్కడకో అబ్‌స్కాండు (abscond) అయిపోయేడు. చాన్నాళ్లై తిరుగుతూ వున్నాను వాడికోసం, కనబడితే మూడు నిమిషాల్లో శంకరగిరిమన్యాలు పట్టించెయ్యనూ ?

వేణు—పెరసన్ (person) ని తెలియకుండా యేలా అంత యెమౌంటు (amount) యిచ్చేశారూ ?

వెం.—అది వక గమ్మత్తుగా జరిగిందిలెండి. మద్రాసు (Madras) టోపీ—షూటూ బూటూ చూచే సరికి యెవరో పెద్ద ఆఫీసరనుకొన్నాను.- యింతకు వాడి అదృష్టం, మనదురదృష్టం యీలా యేడ్చింది. లెట్ బై గాన్సు బి బై గాన్సు (Let by gones be by gones)- కాని బ్రదర్సు (Brothers) మీరొక సహాయం చెయ్యాలను. మనం అందరం వక్క సైడువాళ్లం కాబట్టి మిమ్మల్ని రిక్వెస్టు (request) చేస్తూవున్నాను. యిదే టామిలియన్ (Tamelian) ఐతే యెంతమాత్రం (request) చెయ్యను.

వేణు—యెంతమాట అన్నారు. మనం మనం వకరికొకరు సహాయం చేసుకోకపోతే పైవాళ్లా మనకు సహాయం చేసేది. యేదో చెప్పండి, నాచేతనైనంతవరకు చేస్తాను.

వెం.—యేంవీ లేదూ- మీ బ్రదరిన్‌లా (Brother-in-law) గారి వద్దకు నన్ను తీసుకపోయి యిన్‌ట్రొడ్యూస్ (introduce) చేసి యేదైనా వుద్యోగం యివ్వమని కాస్త రికమెండు చెయ్యాలను.

వేణు—కాస్త కాదు. కావలసినంత రికమెండు చేస్తాను. అటుపైని మీ ఫార్చ్యూన్ (fortune.). వేకన్సీ (Vacancy) వుంటేమాత్రం మిమ్మల్ని వేయించే పూచీ నాది. లేకుంటే నే చెప్పలేను.

వెం—యిప్పుడు సజ్జా లేకున్నా ఆపాటి యెప్పటికైనా వేకెన్సీ (Vacancy) రాదా యేంవిటి? మీా బ్రదరిన్‌లా (brother-in-law) కాని ప్రామిస్ (promise) అన్నది యిచ్చేరంటే నెల కాకపోతే రెండునెలలు వుంటాను.

వేణు—అయితే తప్పకుండా దొరుకుతుంది లెండి. నేను స్ట్రాంగ్ (strong) గా చెబుతాను, రండి నాతోను.

వెం—యెంతదూరం వుంటుందండి మీా బావగారియిల్లు?

వేణు—అబ్బే యిదిగో యీావీధి దాటేక- ఆ రెండోయిల్లు.

వెం—మీారు యింకా మీాల్సు (meals) పుచ్చుకోలేదు కాబోసు బ్రదర్, (brother) మిమ్మల్ని యిప్పుడు ట్రిబుల్ (Trouble) యిస్తాను.

వేణు—యేమి పరువాలేదు లెండి. యిదే సమయం. మా బావగారు కూడ యింటివద్దనే వుంటారు.

వెం—సరేకాని మీారుచెప్పడంలో మాత్రం మా స్ట్రాంగ్ (strong) గా చెప్పాలను. మన యిద్దరం క్లాసుమేట్సు ఫ్రెండ్సు (class mates friends) అని చెప్పండి. ఆలా చెబితే కాస్త వెయిట్ (weight) వుంటుంది.

వేణు—ఓ యస్ ఆలాగే చెబుతాను గాని, బ్రదర్ (Brother) మీా నేటివ్ ప్లేసులో యేం ట్రయి (try) చేసేరుకారూ?

వెం—చెయ్యకేం కావలసినంత ట్రయి (try) చేసేనండి. కాని యేం విలాభం లేక పోయినది.

వేణు—యీా నెలలో రిజిస్ట్రేషన్ ఆఫీసెస్ (Registration Officies) లో కొత్త గుమస్తాలను వేసుకుంటారు కాబోసు. మీారేం ప్రయత్నం చేయలేక పోయేరూ?

వెంక—అయ్యో వూరుకున్నా రనుకున్నారేంవిటి? విశ్వప్రయత్నం చేసి వదలిపెట్టేను. త్రీ మంత్స్ ప్రొబిషనరీ (three months, probitionary) గా కూడా వర్కు (work) చెయ్యమంటే చేసేను. చేస్తే మాత్రం యేమిలాభం? డేస్ (Days) బాగు లేకపోతేను. అదీగాక యీరోజులలో క్వాలిఫికేషన్స్ (qualifications) గుడ్డిగవ్వకైనా పనికిరావడం లేదండి. చూసేరా యిన్నాళ్లూ ఆఫీసు (Office) లో కనిపెట్టుకొని వుంటే వేకెన్సీ (Vacancy) రాగానే నాకు యివ్వకుండా, యెవరో అప్పుడే షూటూ బూటూ వేసుకవచ్చి అప్లకేషను యివ్వగానె మనిషిని చూచి గాబరాయెత్తిపోయి, చటాల్న ఆర్డర్ (order) పడేశాడండి! యిది చూచే సరికి, అయ్యో యీలాగైతే నేనూ షూట్ (shoot) వేసుక వెళ్లుదునూ—యీ సీక్రెట్ (secret) నాతో వక్కరైనా చెప్పేరు కారేం అని ఆఫీసు (Office) వాళ్ళని అడగే సరికి, మాకేం తెలుసు ననేసేరు వాళ్ళు—

వేణు—బాగానే వుంది జస్టిసు (justice)—యిదిగో యీయిల్లేనండి మా బ్రదరిన్లా (Brother-in-law) వున్నది.

(అని గడపనెక్కి తలుపుతట్టును. కనకలక్ష్మి తలుపుతీయును. వెంకటేశము కొంచెము ప్రక్కకు వరుగును).

కన—యింతసేపు యెక్కడ వున్నావు అన్నయ్యా. మీబావగారు నీకోసం చూచి చూచి యిప్పుడే మడికట్టుకొన్నారు.

వేణు—యిదిగో బజారులో నాఫ్రెండు (friend) వకాయన కనబడితే, అతనితో మాట్లాడుకొంటూ వచ్చేను. బావ యెంతసేపు అయింది మడికట్టి? (వెంకటేశంతో) బ్రదర్ (Brother) యీలారండీ—ప్లీజ్ టేక్ యువర్ సీట్ (please take your

seat). మనం అందరం వక్కసైడువాళ్ళమేను. మనకేం ఘోషా సిస్టమ్ (system) లేదు.

వెంక — థాంక్స్ (thanks) (కూర్చొనును).

కన — వీరి దేయూరు ?

వేణు — మనవూరేను —

కన — చెప్పడం మర్చిపొయ్యేను. నాన్నదగ్గరనుంచి పుత్తరం వచ్చింది.

వేణు — (ఆతృతతో) యేదీ — యేదీ యేవనివ్రాసేరు. చదివేవా ?

కన — ఆ. చదివేను. నిన్ను వేగరం వెళ్ళిపోరమ్మని వ్రాసేరు, నాన్న గారు. (యిచ్చును)

వేణు — (చదివి) చెల్లీ నేను పోతానే — అర్జంటుగా రమ్మని వ్రాసేడు నాన్న.

వెంక — సో సూన్ - క్వైట్ అన్ యెక్స్పెక్టెడ్ (So soon - quite unexpected.)

వేణు — లేదండి యిల్లు విడచిపెట్టి చాన్నాళ్ళైంది. యీవేళ నైన్ ఒక్లాక్ మెయిల్ (Nine O'clock Mail) లో వెళ్ళిపోతాను.

[ప్రి॥ అప్పలనరశింహం పంతులు చేయి తుడుచుకొంటూ]

యేవివాయ్ వేణూ చెడతిరిగేస్తూవున్నావ్ ? యేం యింతాలస్యం ? యీఅబ్బాయి యెవరు ?

వేణు — యితను నాయింటిమేటు ఫ్రెండు (friend). నేను వచ్చేనని తెలసి నాకోసం తిరుగుతూవున్నాడట. ఫార్చ్యునేటు (Fortunate) గా మీటు (meet) అయ్యేం. మీరు వకసహాయం చెయ్యాలను. ఆయనకు కాదు నాకు చేసినట్టు తలస్తాను. యితనికి మీఆఫీసు (Office) లో యేదైనాపని యిప్పించాలను. పాపం టు మంత్స్ (two months) అయి వచ్చేడు యీవూరు — చిన్నప్పడినుండి వక్కదగ్గరనే చదువుకొనేవా

శ్యాం. హీ యీజ్ యె వెరీ గుడ్ మాన్ ఎస్. ఎస్. ఎల్. సి. కాండిడేటు(He is a very good man. S.S.L.C candidate.)

అప్పల—అయ్యో మొన్ననే వక వేకన్సీ ఫిల్ అప్ (vacancy fill up) అయిపోయిందే. పది పదిహేను రోజులలో యేదైనా ఖాళీ వస్తుంది. అప్పుడు చూస్తానులే.

వేణు—చూస్తానంటే కాదు. తప్పక హెల్పు (help) చెయ్యాల. నేను లేకపోయినా మీరు అశ్రద్ధ చేయవద్దు. (వెంకటేశంతో) ఫ్రెండు (friend) మీరు కోరినట్టూ చెప్పేను. యిక మీరు తిరగడంలోవుంది. ప్రతిరోజూ వకసారి వచ్చి వారితో కలుస్తూవుండండి. నేను రాత్రికి వెళ్ళిపోతూవున్నాను.

వెంక—ఐ యామ్ వెరీ సాకి (I am very sorry)—రాత్రికి స్టేషను లో (station) లో మిమ్మల్ని కలుస్తానులెండి. మీరు బోజనంకు లెండి. ఇటీజ్ హై టైమ్ ఫర్ మీల్ (It is high time for meal.)

వేణు—మీరు బోంచేశారా ?

వెం—ఓ రెండుగంటలైయింది బోంచేసి.

వేణు—నేను వెళ్తానండీ (బోజనంకు పోవును).

వెం—పంతులుగారండి నేను శలవుతీసుకొని మళ్ళా దర్శనంచేస్తాను. తమరు దయవుంచి వేకన్సీ (Vacancy) రాగానే నన్ను వేసేరంటే యెంతో థాంక్ (thank) చేస్తాను.

అప్పల—సరే వెళ్ళండి. అప్పుడప్పుడూ కనబడుతూయుండండి. (కొంచెం ఆలోచించి) మాసూపరెంటెండెంటు కొంచెం లంచగొట్టండి—యేం వంద, రెండువందలు కర్చుపెట్టగలరా ?

వెం—లేదండీ—తెచ్చిన సొమ్మంతా ఖర్చు ఐపోయింది. నాదగ్గర దమ్మిడీలేదు. యెక్కడికి వెళ్ళినా యీకరప్షన్ (curruption)

అనేది పోయింది కాదండి. మొదట రైల్వే డిపార్టుమెంటు (Railway department) వక్కటే ఆలాంటిదని అనుకున్నాం గాని, యిప్పుడు అన్ని బ్రాంచిల్లోకీ పాకిసింది దండి.

అప్పల—నిజమేనూ—యిప్పుడు పైసా మదుపు పెడుతేగాని పనికావడం లేదు. (పొడుం పీల్చును).

వెం—అదేకాదండీ యీరోజుల్లో కరప్షన్ అండ్ ఫావరిటిజమ్ రూల్ (curruption and favouritism rule) చేస్తూన్నావండీ—అయితే నాకేం సెలవు ?

అప్పల—కనబడుతూవుందండి—యేమో ప్రయత్నం చేస్తుం—

వెం—నమస్కారం—శెలవుతీసుకొంటాను.

(నిష్క్రమణము).



# కాంతాపహరణము.

## తృతీయాంకము.



### ప్రథమ రంగము.

స్థలము—మింటు స్ట్రీటు.

[ప్ర॥ వెంకటేశము.]

యిదేంవిటి చెప్మా యీవీధి యెంతో ఫెమిలియర్ (familiar) గా కనిపిస్తుంది. యిదివరలో గాని చూచేనా యేంవిటి. (అని జ్ఞాపకము తెచ్చుకొని) ఓ—ఐ—సీ (O—I-See) మొన్న బట్టలు కొనడానికి రంగయ్యా, నేనూ, యీవీధిని వెళ్ళిపోతూవుంటే యెవత్తో డి. జి. లాంగువుంది మేడమీదనుండి అమాంతంగా సైటన్ (sites) విసరేస్తూవుంది. చూచి నేనూ చిన్న గమ్మత్తు చెయ్యాలనుకొన్నాను గాని పానకంలో పుల్లలాగు రంగయ్యవొకడు మధ్యనుండిపోయ్యేడు. ఇప్పుడేం అయింది వక్కరంవే వున్నాంకదా లెట్ అస్ యెగ్జామిన్ హెర్ వన్సు మోర్ (Let us examine her once more). (కాసేపు వూరుకుండి) అవునుగాని, యేం మళ్ళా తెలివితక్కువగాడిదనైపోతూవున్నాను! యీ డి. జీస్ సంగతుల్లో అంత సెల్ఫ యెక్సుపీరియన్సు (self-experience) వుంచుకొని వాళ్ళపేరైనా యెత్తనని హై (high) గా ప్రమాణంచేసి మళ్ళా మైండును ఫ్రీ (free) గా వదిలేస్తూవున్నాను. కమ

లంసంగతి జ్ఞాపకంవస్తే ప్రపంచంలో యీరెచ్చడ్ డీ. జీస్ మాటే లేకుండా పూర్తిగా హతం ఆర్చేదామూ అన్నబుద్ధి పుటతుంది గాని, పోసీ మానవప్రాణాలు 'అహింసా పరమో ధర్మః' అన్నాడని అనుకుంటూవుంటాను.

యింతకు కమలం యేంచేసింది? డబ్బు లాగేసింది. యేలా లాగేసింది? కన్నంవేయలేదే మనయిల్లోను! నేనే యేప్రిల్ ఫూల్ (April fool) ని అయిపోయి దానిమాయల్లో పడి తిరుపతి మంగలి క్షౌరంలాగు నాహెడ్ (head) నున్నగా గొరిగేసిందాకా తిరిగేను. యిఖ మళ్ళా వీళ్ళమాయలలో పడడం యెంతమాత్రం యడ్వైజబిల్ (advisable) కాదు. (ఆలోచించి) మాయల్లో పడుతేమాత్రం యేంపోవాల? పోయినదేదో పోయికే పోయింది యిహా పోయేదేంవిటి? నాశ్రాద్ధం. యీపూరిలో యేదైనా వాచిక పారిందంటే బోన్లో యెలక పట్టదన్నమాటే—

[యింతలో వకబ్రోకరు వచ్చి వెంకటేశంతో]

అగ్గిపుల్లవుందా?

వెం—ఆ-యిదిగో పెట్టె—మీ రెవరండి?

బ్రో—(వెలిగించుకొని) మీది యేదేశ్యం. సామీ?

వెం—మాది రాజమండ్రి.

బ్రో—యేం పనిమీద యీడ వచ్చితిరి?

వెం—వేరే వ్యవహారంమీద వచ్చేరు—

బ్రో—(నవ్వుతూ) సరే యీపూరిబోగంవాళ్ళని చుస్తుమనా యీవిధిని వచ్చేదీ?

వెం—యీవిధి సాసిపీధా? ఐ యామ్ క్వైట్ యిగ్నోరంటు (I am quite ignorant) నాకు తెలియదు. (అనిప్రక్కల్ని యింటునటు

జూచి) ఆనిలబడ్డవారందరూ భోగంవాళ్ళా? సంసార్లు అనుకున్నాను. మాపూర్లో సంసార్లూ యీలాగే వుంటారండి. అంచేత వీళ్ళనికూడ సంసార్లని అనుకున్నాను. యిప్పుడు కొన్ని టవున్సు (Towns) లో అండి సంసార్లని, సాన్లని, మిక్సు (mix) చేసేస్తే సెపరేటు (separate) చెయ్యలేం సరేకదా, ఎట్టైమ్సు (at times) సంసార్లని భోగవాళ్ళకింద యెంచేస్తాం. ఇప్పుడు యెక్కడచూచినా రిఫైనిటి (refinity) జాస్తి అయిపోయి సబ్సికెంటు (subsegent) గా డిబేచరి (debatchery) లో దింపేస్తుంది. సాన్లు రోజుకు పదిసార్లు పియర్సు సోప్ (Pears Soap) తో మొహంతోముకూవుంటే సంసార్లు రోజుకి వందసార్లు స్వీటు సెంటెడు (Sweet scented) రోజా సోపుతో తోముకూవున్నారు. పూర్వల్లాగు పసుపు రాసుకోవడం కుంకం పెట్టుకోవడం అంతా డామిట్, హెల్ (damit, hell) అనేస్తూవున్నారు భోగంవాళ్ళతాతల్లాగు వీళ్ళే తయారవుతూవున్నారు. అంచేత యీకాలం మాణిక్యం అన్నట్టు వాళ్ళ గిరాయికీలు కొంచెం తగ్గేవి. కొంచెం యేంటిటి బాగానే తగ్గేవి. ఫేస్ పవుడర్ (face powder) కైనా కిట్టకుండావుంది పాపం. సంసార్లమీదపడి యేడుస్తూవున్నారు. (బో్రకరువైపు జూచి) అయితే యీపూర్లో సానికొంపలు వేరే వున్నానా? లేక మాపూర్లోలాగు సంసార్లకొంపల్లో అక్కడక్కడ కలసి వున్నావా?

బో్ర—లేదు. వాళ్ళవీధులు వేరే వుండావి.

వెం—దటీజ్ సంవాట్ బెటర్ (That is some what better) అలాగైతే అట్టే పరువాలేదు. లేకపోతే డేంజర్సు (Dangers) అనగా ప్రమాదాలు జరుగుతూ వుంటావండి. మాపూర్లో

యేం అయిందనుకున్నారు వకసారి-యెవరో క్రొత్తవాళ్ళు వచ్చేరు. వాళ్ళు జల్ పోకిరీలు. సానికొంపలో దూరదాం అని బుద్ధిపుట్టి బయల్దేరారు. వీధిని యెవరో తుంటరివెదవ వకడు కావొస్తె అబ్బాయీ యీవూళ్లో సానివీధి యేదని అడిగేరు. ఆ వెధవడు యీలా సానివీధి వేరే లేదూ, భోగవాళ్ళ కొంపలూ సంసార్ల కొంపలూ కలిసేవున్నావి అని చెప్పేడు. వీళ్ళు యేదైనా సానికొంప చూపించమని ఆ వెదవని అడిగేరు. ఆ రాస్కెల్ (Rascal) యేంచేసేడంటే వక సంసారియిల్లు చూపించి, యిదిగో యిది సానియిల్లు తలుపుతట్టండి అని వాళ్ళతో చెప్పేసి వాడు పొయ్యేడు.

బ్రో—మంచిపని దా చేసేడు!

వెం—యీ స్టోరీ (Story) యీలాగుండా, యిథ ఆయింటిసంగతి యేంవిటంటె వాళ్ళు కొంచెం రకంవారి. ఆయింటియజమాని విడో డాటరు (Widow daughter) వుంటె దానికోసం వకరిద్దరు ప్రతిరోజూ అర్ధరాత్రిప్పుడు వస్తున్నారని ఆయజమానికి గాలికబురు తెలసి ఆరాత్రి తెలివేసివుండి ఆ వెదవలొస్తె కాళ్లు విరగకొట్టుదాం అని కఱ్ఱపట్టుకొని రడీ (Ready) గా వున్నాడు. యింతలో యీ అన్ ఫార్చ్యునేట్ ఫెలో స్ (Unfortunate Fellows) యిద్దరూ తలుపు మెల్లగా తట్టేసరికి ఆయింతా తలుపుతీసి తటాలున రెండుతాపులుతన్ని కఱ్ఱకోసం యింట్లోకి వెళ్ళేసరికి వీళ్ళిద్దరూ చెరివక వీధిని పట్టేశారు.

బ్రో—మంచి గ్రహచారమేనుం సామి.

వెం—యింకా అదృష్టమంతులు. వీళ్ళుచప్పున తలుపుతట్టేసరికి, హార్టు యాక్సిల రేట్ (Heart acclarate) అయిపోయి కంగారీఅయి

కట్టువదలేసి తలుపుతీసేదు. లేకుంటే వాళ్ళిద్దరూ ఆసుపత్రి పాలౌదురు. అయితే మీ రేంచేస్తువున్నారు?

బ్రో—నాకు వేరేంవి పనిలేదూ—యెవరైనా మీలాంటివాళ్ళని ఆశ్రిమించడంవే నాపని. యీవూర్లో భోగంవోళ్ళందరికి నాకు తెలుసును. మీలాంటివాళ్ళు యెవరింటికైనా తీసుకపొమ్మంటే తీసుకపొయ్యేదీ—మాటలు కుదిర్చేదీ—

వెం—(తనలో) యీ వెధవడు బ్రోకరు (Broker) అటోయ్! యెవరో పెద్దమనిషనుకున్నాను. అయితే యేదో ఆఫరు (Offer) వచ్చిందన్నమాటే. మెల్లగా వీడిని పోకెట్టు (Pocket)లో వెయ్యాలను. (పైకి)ఆలాగునా యిందసిగరెట్టు—తాగుతావా? తాగు (అనియిచ్చును) అయితే యిప్పుడెందుకు వచ్చేవ్?

బ్రోక—యేంవిలేదప్పా మొన్నటిదినం మీరు దా యీవీధిని వెళ్ళిపోతూ అల్లా మేడమీద వుండిందీ (అనుచూపుచూ) దాన్ని చూస్తిరట. అదియేమో మిమ్మల్నిచూచి యెవరో పెద్దమనిషి వోరువుండారని సామ్మని వూరుకుండిందంట. అప్పటినుండి నన్ను కొరుక్కతింటూ వుండాది- మిమ్మల్ని వెదక్కతోడ్చుకరమ్మని. యిప్పుడు మళ్ళా మీరు కనపడ్డారూ-

వెం—యీజ్ యిట్ సో (is it so) నిజంవే?

బ్రో—సత్యందా సామీ. అంచేద్ద మీ వద్దకు వస్తిని. రండి మీకేమీ ఫరువా లేదు. నేను తీసుకపోతాను.

వెం—సాన్దా నింటికి వెళ్ళడానికి ఫరువా యేంవిటి వోయ్! దాని పేరూ?

బ్రో—రాజామణి.

వెం—రాజామణో రోజాపువ్వోగాని మా మజాగుంది మాలముండ. యిప్పుడేం చేసేదీ? చేసేదేంవుంది- వెదకవలసిన తీగ కాళ్ళ

కే చుట్టుకొందన్నట్టు అదే ఆఫర్ (offer) చేసి నప్పుడు వెళ్ళకపోవడంయేం ?—(నవ్వి) నేనూ నావేషం నా స్పీక్ (spek) సూ నా చేతికఱ్ఱా చూచి యెవడో ప్రొప్రయిటరు (proprietor) అనుకొంది కావోసు. దీనికి కాలం దగ్గరకు వచ్చింది. కానీ వకరు చెడితే గాని వకరు బాగు పడరు. లెట్ మి గో వన్సు—నో హారమ్ (Let me go once—no harm) (పైకి) పదవోయ్ యెందుకో అది పిల్చింది రాక పోతే బాగుండదని వస్తూవున్నాను. ఆలా సాని పంచల్లంటి తిరిగే చవటపందిని కాను—

బో।)—రా సామీ.

(యిద్దరు నిష్క్రమణము)



# ద్వితీయరంగము.

స్థలము:—రాజామణి మేడ.

[రాజామణి తలపువ్వులు సర్దుకొనుచూ అద్దము చూచుకొను చుండగా బోగికరు ప్రవేశించి]

తీసుక వచ్చితిని—

రాజా—యెంగె?

బోగి—కింద వుండారూ- నీవు యెదురుగా పోయి తీసుకొనిరా- కుర్చీలు సర్దుతాను యింతలోను.

[రాజామణి యెదురుగా వెళ్లుచుండగా, ప్రవేశం వెంకటేశం]

రాజా—యింగవా సామీ యింగె వుకారుంగో. (అని కుర్చీ చూపించును)-

వెం—(నవ్వి) వుకారుంగో- గికారుంగో నాకు తెలియదు. తెనుగు వస్తే మాట్లాడుదూ.

రాజా—(నవ్వి) రండి సామీ (కుర్చీ జరపి) యిందు కూర్చోండి- ఓసే గోపీ యిటు వచ్చి అయ్యగార్కి కొంచెం విసరవేపుక్కపోస్తూవుండాదీ—

వెం—అక్ఖ్రే అవుసరం లేదు. చల్లని గాలి వేస్తూవున్నాది. (అటు యిటు చూస్తూ) యీ యిల్లు మీస్వంతందేనా?

రాజా—అవును సామీ- మొన్ననే పదివేలు దా యిచ్చికొనుక్కుంటిని.

వెం—(తనలో) మంచి వెల్ టు డు (well to do) లాగుంది-

రాజా—మీది యేవూరు?

బోగి—వీరిది రాజమండ్రి. వేరేవ్యవహారంపైని పట్నం వచ్చినారూ. పెద్ద ప్రొప్రైటర్లు—

రాజా—వ్యవహారం మేమి చేస్తూవుండారూ ?

వెం—మరేం వ్యవహారం లేదూ. రెండు రైస్ మిల్సు (rice mills) వున్నావి. ఆపైని భూములు మీద సిస్తు కొంచెం వస్తుంది.

రాజా—యేమాత్రిం సిస్తు వచ్చును ?

వెం—యేటా ఫయివు తవుజండ్సు (Five thousands) అనగా ఐదు వేలు- నీకే పాప్రికం వుందా ?

రాజా—(వూరుకొండును.)

బోగి—ఆ- వుండింది సామీ. యిదివరలో పెళ్ళారు పిళ్లే వుంచు కొంటిరి. యిప్పుడు వేరే చిక్కుల్లో పడిరి వ్యవహారంలో- అంచేద్దానా పరిస్తుతం విడచి పెట్టి వుండారు.

వెం—అతనికి యేం వ్యవహారం ?

బోగి—రత్నాలు వ్యవహారం- సండా దుడ్డు వుండేది—

వెం—(తనలో) అయితే తొత్తుకూకురు వాడిని కుపరం చేసి వదలిం దన్నమాట !

రాజా—(బోగికరుకి కన్ను గిట్టును.)

బోగి—(వెంకటేశంతో) సామీ మీరు యిక్కడదానే వుండండి. యిప్పుడా వస్తును. నే వచ్చు వరకు పోవద్దు. యేం సెలవు.

వెం—సరే తే వేగరం రా? (తనలో) నీవెందుకు యిక్కడ పానకంలో పుల్లలాగు.

రాజా—(ప్రక్కకుర్చీ మీద కూర్చొని) మీ రాజమండ్రిలో సాన్లు యెట్లా వుందురు ? మావూర్లో మాదిరే వుండేదా.

వెం—సాన్లు యెక్కడా వక్కమోస్తరే వుంటారు. యీవూరూ ఆ వూరూ యేంవిటీ ! యేవూరు వెళ్ళినా వక్కటైపే—

రాజా—(నవ్వి) అయితే మీరు అన్నివూర్ల భోగవాళ్ళని చూచితి రన్న మాటే !

వెం — అందర్ని చూచేను. అన్నివేషాలూ వేసేను. యిప్పుడు బుద్ధి వచ్చి చక్కా వ్యవహారంలో పడ్డాను.

రాజా — యిప్పుడు బుద్ధివచ్చిందంటారా వుండారు యిదివరలో యేం చెడితిరా యేమి ?

వెం — చెడిపోతానా? తెలయేళ్ళు యెండాకాలం వస్తే యెండిపోవడానికి? మహాసముద్రం యీలాంటి సన్సు (suns) అనగా సూర్యుళ్ళు యెంతమంది కావాలను యెండించడానికి?

రాజా — (కిళ్ళీ కడుతూ) గూఢంగా మాట్లాడుతూవుండారు. స్పష్టంగా చెబుతేద్దా మాకు తెలుసునూ?- యిందు తాంబూళం వేసుకోండి.

వెంక — (పుచ్చుకొని) యిదిగో యిదే గట్టి చిక్కొచ్చింది. సానియిళ్ళల్లో దూరగానే మొదట యీకిళ్ళీ యిస్తారు- వెధవలు దీన్లో యేం మందు వేస్తారో గాని స్నేక్ పోయిజన్ (snake poison) లాగు వెంటనే అయోర్టాలో పడి ఆర్టెరీస్ అండు వీన్సు (arteries and veins) ద్వారా బాడీ (body) కి అంతా సర్క్యులేటు (circulate) అయిపోయి మైండు (mind) ని మూ బాగా మార్చేస్తాది- యిఖ దానికి ఆంటిడోట్ (antidote) యీ భూలోకంలో లేదు సరేకదా అమరవైద్యులకు అప్లయి (apply) చేసినా అప్రమదం లేదనేస్తారు. యీ కిళ్ళీ పుచ్చుకోకపోతే వాళ్ళ మైండు (mind) చెడుతుంది. పుచ్చుకుంటే మన మైండు (mind) చెడుతుంది.- యేం దారి ?

రాజా — యేమి ఆలోచిస్తూ వుండారు ? యీ రాజామణి యింటికి యెందుకు వచ్చితిననా ?

వెం — యేంపీ లేదూ. నీవిషయం కాదూ- యిందాక నివ్వడిగిన

పరీక్షా- స్పష్టంగా చెప్పమంటే- యేం వని చెప్పకుండేదని ఆలోచిస్తూ వున్నాను.

రాజా—నా వద్దనా మీరు రహస్యం దాచిపెట్టేది. చెప్పరూ యెక్కడ యెక్కడ భోగంవాళ్ళని చూచివున్నారో, యెట్టి వేషం వేసి వున్నారో?

వెం—యేం గొప్పని చెప్పేదీ?—మా నాన్నగారు నాచిన్నతనంలో నే కాలంచేసేరు. మా అమ్మ వుంది. లక్షరూపాయీలు ఆస్తి. యింతలో నేను పెద్దవాడి నయేసరికి వక సాన్ది- దాని పేరు కమలం- మెల్లగా స్నేహం ఐంది. దాన్ని వుంచుకొన్నాను. 'యింత ఆస్తివుందీ మరి నేను పెళ్ళిచేసుకోనూ వాళ్తో వుండిపో' అని నేను అన్నాను. సరే అని నన్ను నమ్మించి- యేభై వేలు రమారమి కాటువేసి యెవడో యింకొక గొప్పవాడు దొరికితే వాడితో మెల్లగా వుడాయించింది. చూచే రాజా మణీ- యీ యేభై వేలు పోతే మరో నూరువేలు గణించుకోం టా, సొమ్ముకోసంకాదు నే నన్నది—కాని దానిగుణం తెల సింది. అప్పటనుండి నీకు కోపంవస్తే రానీ గాని, నిజంచెప్పే స్తూవున్నాను. సానంటే అసహ్యం అయిపోయింది.

రాజా—బాగుంది, సాన్లు అందరికీ కలిపేస్తూవుండారేమి? అందరూ దానిమల్లె దొంగులే వుందురా? మొన్నదా యెవడో వక డువచ్చి మాపొరుగు సాన్ని టోపీవేసి వెయ్యిరూపాయీలు సరుకులు పట్టుకు చక్కా పోయ్యేడూ. అట్లా అని యింటికి వచ్చిన ప్రతివారిని ఆలా దొంగలమని అనుకుందుమా యేమి?

వెం—(ఆశ్చర్యముతో) యేలాగు టోపీ వేశేడూ? మెడ్రాసు (Madras) వాళ్ళనే 'టోపీవాళ్ళ'ని అంటారు కదా. మీమ్మ

ల్ని టోపీవేసినమహాత్ముడు యెవడుచెప్తా! ఆలాంటివాడెవడైనా వుంటే అమాంతంగా బ్రిహ్మారదం పట్టెయ్యా-

రాజా—కనబడుతే వాడి పని తెల్సిపోను—

వెం—యేలాగు టోపీ వేశాడూ? చెబుదూ హాశ్చర్యంగావుంది!

రాజా—యేలా గేమి—నాలుగుదినాలేమో దానితో స్నేహం దా చేసినాడంట మొదట దుడ్డు యేమాత్రం యిచ్చేవాడూ. తర్వాత మెల్లగా బుడ్లుతీసుక వచ్చేవాడంట. యిద్దరు గొంతుకు మొయ్యంగ తాగుతూయుండేవారంట. వకనాడేమోదానికి పూర్తిగా తాగించి తానేమో తాగినట్టు నటించినాడూ. మంచి రాత్రిప్పుడేమో లేచి దీని వస్తువులన్నీ పూడ్చేసి తలుపు మెల్లగా తీసుకొని పొయ్యాడూ. పొద్దున పదిమూశికి గాని దానికి తెలివి రాలేదూ. తెలివివచ్చిన వెటనే పోలీసుకేమో రిపోర్టు యిచ్చిరి. తరువాత సొమ్ముపు ట్టుదుకుంటిరి.

వెం—(తనలో) గాడిదకొడుకు పెంకివాడులా వున్నాడు. మా యెత్తు యెత్తేశు-ఐ హావ్ టు థాంక్ హిమ్(I have to thank him) (పైకి) యీ వెధవల్లాంటివాళ్ళు బయలుదేరుతే మాలాంటి పైపూరివాళ్ళ పరువు మరేం వుంది?

రాజా—అబ్బే! యెంతమాట శెలవిచ్చితిరి సామీ. యెవడో వక్కడు ఆరీతివాడైతే అందరును కలిపేస్తూ వుండారా? మీకు పెండ్లి అయిందా?

వెం—(హాస్యాస్పదంగా) లేదు యింకాను. నాకు పిల్లను యెవరు యిస్తారూ. మీ యింట్లో పిల్ల వుందా యిస్తురు గాని—

రాజా—నాకంటె యెవరువుండారు. నన్నుదా పెండ్లి చేసుకోండి. (నవ్వుతూ) అసలు మీకు యెవరుయిస్తురు బిడ్డను. యిట్లు మీరు పోకిరీవేషాలు వేస్తువుండారే—

వెం—అవును నిజమే- నీ యిట్లోవుంటే మళ్ళా వేషాల్లో దిగేనను కొంటారు. యీవూర్లో యీశెట్టి లందరికీ నాకు తెలుసును. వాళ్ళుగాని చూచేరంటే మా అమ్మతో చెప్పేస్తారు. వెళ్ళి పోతాను. (లేచును)

రాజా—(వెంకటేశం చేయిపట్టుకొని కుర్చీమీద కూర్చుండబెట్టి) యెక్కడకు వెళ్ళిపొయ్యేదీ ? నా చేత చిక్కినతరువాత. రావడమే మీవంతు. పోవడం మీవంతు కాదే!

వెం—లేదు- అర్జంటుగా పనివుంది. మళ్ళావస్తాను. యెవరైనా మీ యింటికి వస్తే తంటా.

రాజా—(కోపంగా) యేం వస్తూ వుండారూ ? యెవరైన వస్తార నా ? యెవరు యెందుకు వస్తారు మాయింటికి ? ఆలా అందరూ రప్పించుకొని, భాగవతం ఆడుకునేది కాదు యీరాజను ణి, నాసంగతి మీకు నిండా తెలియదు. రమ్మంటేనని చులకనగా పలుకవద్దూ.

వెం—ఆలాగా నీది యక్సెపషనల్ కేసు (exceptional case) అని నాకేం తెలుసును ? అందరి డి. జీస్ లాగు అనుకున్నాను.

రాజా—(చిరునవ్వుతో) వుండండి అందరిని పిలచి మిమ్మల్ని చూపి వేస్తాను.

వెం—చూపించేం—చూపిస్తే నాపీక యెగిరిపోతుందనికాదూ. మా అమ్మతో యెవరైనా చెప్పేస్తారని భయం—

రాజా—అంతభయందా వుంటే మరి మీవూరిలోనే బోగందాన్ని యెట్లావుంచికొంటిరి, మీఅమ్మగారికి తెలియ లేదూ?

వెం—లేదు. రహస్యంగా వుంచేను. పిట్టకైనా తెలియదు—

రాజా—ఆపాటిది సంగతి తెలవదా వూర్లోదావుంటే యెన్నా చోద్యం—

వెం—ఆలకించూ కొన్నాళ్ళుపోయేక మెల్లగా మాఅమ్మతో యెవరో చెప్పేశారు. అప్పుడు నన్ను కోంబడితే నిజం చెప్పేశాను. మాఅమ్మ వట్టు వేయించుకొని మరియెవరినీ తేవద్దనేశింది. అప్పటినుండి యెవరింటికి వెళ్ళలేదూ—అసలు ఆప్రస్తావనే లేదూ.

రాజా—'నాటికీ నేడాయెరా' (అను జావళీ మొదటిచెరణం పాడి) అన్నట్టు అప్పటికి యిప్పుడు మాగుమ్మం తొక్కినారా ?

వెం—ఆఁ-మరేం ? యేదీ మొదలు యెత్తనే యెత్తేవ్ జావళీ పూర్తిగా పాడెయ్—యీ సైడు (side) వాళ్లు యేలాగు పాడుతారో వింటాను.

రాజా—ఆఁ-యెంత ఆశ ? వుట్టినే పాడవలె యేం ? దుడ్డు చేత పెట్టండి పాడుతాను.

వెం—వుట్టినే కాకపోతే నాదగ్గర యిప్పుడేంవుందీ దుడ్డు ? 'యీలా రాజామణి యింటికి వెళ్తానూ—పాడిస్తానూ' అని కలగన్నానేంవిటి ? నాల్గురోజులు కోర్టువాయిదా వుంటే వచ్చేను.

రాజా—అబ్బే! హాస్యానికి దా ఆలాఅంటిని సామీ. మీదయ నిండుగా నాపైని వుండిందంటే అదేశాలును—పదివేలుగా యెంచుకొందును.

(హార్మోనియము తీసి సృతివేసి పాడును)

యేలావుంది ?

వెం—చెప్పేదేంవిటి ? యేలావుండాలనో ఆలాగునే వుంది.

" ఉ. గానకళారసగ్రహణకాంక్ష కడుంగడు హెచ్చె ; గాయకుల్
వీనుల కింపు నింపరు చలింపక పాడిన నేమి ? స్త్రీగళా

నూనవికస్వరస్వరరసోల్బణ ముండదు ; నిశ్చయంబుగా
సానులం జెప్పి చెప్పవలెం జానల నెల్లఱం బాడనేర్చినర్. ”

అని కవి వుట్టినేనా అన్నాడు. గాని యేదీ “ చాలునులే, పో పోరా వన్నెకాడా ” అను జావిళీ వచ్చునా ? వకసారి గుంటూరుమేళంలో వకర్తె పాడి అభినయింపడితే పదిరూపాయీలు యిచ్చేను.

రాజా—యేదీ దానికి మించినది ‘ యిదిమంచిసమయమోయీ అని పాడుతాను యేమియిస్తురో చూస్తాను.

వెం—యేంవి యిమ్మన్నావు ? యిదిగో జోబీలో అయిదు రూపాయిలున్నావి—యిస్తాను పాడు. ఆజావిళీ చాన్నాళ్లై విన్నాను.

రాజా—దుడ్డు దగ్గర లేదంటిరే? యేమిచిక్కదనం—

వెం—అబ్బే- నీతోడు. చిక్కతనంకోసం కాదు. యీ డామ్ ఫైవు రుపీస్. (dam five rupees) కే సొమ్మనేస్తూ వున్నావు. మా కమలంకు యెట్ యె టైమ్ (at a time) అనగా వకొక్కసమయంలో వందలు వందలు యిచ్చేవాడను. యీ అయిదురూపాయీలూ యేలాగు నీకు యిచ్చేదని సిగ్గుచేత సొమ్ము దగ్గర లేదనేశాను.

రాజా—నాకు యిచ్చివేస్తే మీకు దా రెయిల్ చార్జీ యెట్లా గడుస్తుందీ- యిబ్బంది పడరా?

వెం—(తనలో) చచ్చేనాౖ దేంవుడా. ఎక్స్పోజ్ (expose) చేసేసేను ఫైవ్ రుపి- నోట్ (five rupee- note-) వుందని- శాస్త్రేస్తాది కావోసు. (పైకి) బాగుందీ అంతగా రైలువే ఫేర్ (Railway fare) కావలిస్తే ఆపాటి యెక్కడ దొరకదూ. వూరు గొడ్డుపోయిందా యేం? అంత మాఐదురూపాయీలు అప్పు

పుట్టకపోవడానికి. అంత పేరూ, ప్రతిష్ట లేకుండా పోలేదు. రెండొంతులు నాకు టికెట్ (Ticket) అవుసరం లేనేలేదు. రైలువే (Railway) వాళ్ళందరూ నాకు ఫ్రెండ్సు (friends) అనగా స్నేహితులు- సరే పాడుదూ ఆలస్యం అయిపోతూ వుంది. నేను వెళ్ళి పోవాలను.

రాజా—(పాడును.)

యిది మంచిసమయమూ మోయీ గోపాలా
యిక నైనా లేచీ రావోయీ।
మదనా జన కానాదూ మామాయింటను లేదూ
వదినే గారిపుడే నన్వదలీ అవతలీ కేగెను।
కదలిరావికజాలమేలోయీ-ఘడియతాళిన సమయమాదోయీ
కొందువమాటలకేమిలే నా-కోర్కె దిర్పుము తాళజాలా॥ ఇది॥

వెం—ఆకోర్కె యేదో మరి ప్లేయిన్ (plain) గా చెప్పె, చెప్ప కుండా తీర్చుమంటే యేంవిటి తీర్చేదీ—

రాజా—(నవ్వుతూ) నన్ను నవ్విస్తే మరి పాడనూ- (హార్మోనియము ఆపి వేయును.)

వెం—లేదు. మరి నవ్వించను. పాడీ ఆ వున్న చరణాలు. యింద ఫైవు రూపి నోటు (five rupee note-) (అని నోటు, మీాదకు విస రును. రాజామణి నోటు వెదకి వెంకటేశం జోబీలో పడవేసి) నాకు అవసరంలేదు. నవ్వించనంటే పాడుతానూ.

వెం—సరే. ఆఖరు చర్ణాం పాడేదూ. నాకు భోజనంకు టైమ్ అయి పోయిందీ. వెళ్ళిపోవాలను- అదిగో గుండుకూడా వేశేశారు- 8 గంట లయిపోయింది.

రాజా—యీారాత్రికి సాపాటు చెయ్యకూడదా మా యింట?

వెం—అప్ టు డేట్ (up to date) అనిపించుకోని ఆపాటిదానికి ఆలోచిస్తాం వనుకున్నావేఁవిటి? హోటేలువాడు దెబ్బలాడుతాడని భయంకాని- సరె యేదీ ఆఖరు చరణం-

రాజా—(హార్మోనియమ్ (Harmoniam) సృతివేసుకొని పాడును.)

చెక్కిలీ నొక్కావోయీ కౌగిటాజేర్చి
పుక్కిటా విడీమియ్యి వోయీ-
చక్కెరా విలూకానీ సాయాంగములకూ నే-
జిక్కితి దక్కితి- సృక్కితి జిక్కితి-
టక్కులెల్లను మానివినవోయీ
మక్కువా నాయందుగనవోయీ (బుగ్గపొడిచి)
యెక్కడికిలే నీకుమాటలు, వక్కసారియు నన్నుగవలే॥దిదినుంచి॥

వెం—యేదీ యీవేళేకదూ మనం కలుసుకొంది అప్పుడే ఆలా అనేస్తున్నావేఁవిటి? యిందనోటు. (అని చేతిలో పడవేసి చప్పునలేచి వెళ్ళబోవ రాజామణి వెంకటేశం చేయి పట్టుకోబోవ వెంకటేశం తప్పించుకొని పరిగెత్తును. రాజామణి వెంట పెట్టును. వెంకటేశం తప్పించుకొని గడపదిగును.)

వెం—మళ్ళా వస్తానులే.

రాజా—(యివతలనుండి) మళ్ళా అంటే యెప్పుడూ? సాపాటు చెయ్యంగానే వచ్చెయ్యాల. కనిపెట్టుకొని వుంటును. రాకుంటే నన్ను చంపుకున్నట్టుదా.

(తలుపువేసుకొని లోపలకు పోవును.)

వెం—దీనిని విడిపించుకొనేసరికి బ్రిహ్మాండం బద్దలైంది. యేలాగైనా డేస్ (days) మాబాగావున్నావి- దీనికీ కాలం సమీపించింది. చిన్నగమ్మత్తు చెయ్యాలి. యేలాగో మెల్లగా మచ్చిక చేసేసింది మాలముండ. సానుల్లోవున్న మజాయే యిది. యెంత

కొత్తవాడైనా లాలన చేసి అంతలో మచ్చిక చేసెయ్యడం మొదట పని- ఆపైని మెలమెల్లగా చాపకిందనీరులాగు పైసా లాగెయ్యడం రెండోపని. ముఖ్య షేవింగు (shaving) సంచి చేతికివ్వడం ఆఖరుపని.

ఈరాత్రి ఓనిదగ్గరకు వెళ్ళి యింకా ఫ్రెండుషిప్ (frindship) చేస్తాను. అటుపైని తాపీగా తమాషా యేలా చెయ్యడంవో తర్జుమా చేసుకొందాం. స్లో అండ్ స్టడీ విన్సు ది రేస్ (Slow and steady wins the race) అన్నాడు.

గాని ముందుగా మనకతేంవిటి? ఫైవ్ రుపీస్ (Five rupees) యిచ్చేసేరు. ఫర్ ది ప్రిజంట్ (for the present) ఫరువాలేదు గాని, రెండురోజులు పోతే కొంచెం యిబ్బంది పడాలి. రంగయ్యదగ్గర మొన్ననే అప్పు పుచ్చుకున్నాను. (ఆలోచించి) నిష్కారణంగా యిచ్చేసేనూ! తొత్తు కూతురికి వద్దంటున్నా వుంచేనూ- అయితే నేం యివ్వడం నకపటం చేత మంచిదేనూ. యీతపంతుళ్లో క్నాలిజి తాలిపంను రాల్చమన్నాడు—సో, లెట్ అజ్ నాట్ రిపెన్టు ఫర్ ది ప్రిజన్టు (So, let us not repent for the present)

(నిష్క్రమించును)



*

# కాంతాపహరణము.

## చతుర్థాంకము.



### ప్రథమరంగము.

స్థలము:—మెడ్రాసులో తంబుచెట్టివీధి.

[ప్రవేశము:—వెంకటేశం.]

ఈవూర్లో ప్రవేశించినప్పుడు రైల్ దిగగానె కుడికన్ను బెదరింది. వెంటనే లాభం మాబాగా కనపడ్డాది. మళ్ళా బెదరేసరికి డబుల్ (double) లాభం—ఫస్టు (first) ది మొన్న పంతులుగారికి యింట్రొడ్యూస్ (introduce) చేసిన ఫ్రెండ్ (friend) కనబడ్డంచేత మంచిబారి వకటి కనపడ్డాది. రెండోది యింకా నా లాడ్జి (lodge) కి పోనేలేదు. దారిలో అన్ఎక్స్పెక్టెడ్ (unexpected) గా రాజామణి వద్దనుండి ఆఫర్ (offer) వచ్చేసింది. ఆఫర్ (Offer) అంటె యేం ఆఫరు (offer?) ఆఫర్ విత్ హైలీ గిల్టెడ్ లెటర్సు! (offer with highly gilted letters!) దీంట్లో నిజమైన ఫాక్టు (fact) యేం వంటే నాకన్నులో యేదో మెస్మరిజమ్ వుంది! లేకపోతే కన్ను బెదరడం యేమిటి? యీలాంటి బార్గెయిన్సు-వన్ ఆఫ్టర్ ఎనదర్ (bargains- one after another) రావడం యేమిటి? యిహ చంద్రునికి నూలుపోగులాగు యీకన్నుని వకసారి కిస్ (kiss) చేదాం (అని కిస్ (kiss) చేసి)

ఓ రాయల్ కన్నా! నీలో యేదో హై స్పిరిటెడ్ పవర్ (High spierited power) వుందని రంగయ్య హోటేలులో ప్రవేశించగానే సస్పిషన్ (suspicion) కలిగింది. కొద్దిరోజులు వరకు నీలో ఆ పవర్ (power) నిజంగా వుందా లేదా అని చిన్న డైలోమ్మ (dilomma) లో పడ్డాను. మొన్న ఈ టూ యాక్సిడెంట్సు (two accidents) జరిగినవుంచి నా సస్పిషన్ స్ట్రాంగ్ యసర్టెయిన్ (suspicion, strong ascertain) చేసేసేను సరేకదా నీయందు వక మోస్తరు రస్పెక్టు (respect) కూడా కలిగింది. యిఖ నిన్ను రిక్వెస్టు (request). చేసే దేంవిటంటే—యిప్పటినుంచీ నీయిష్టంవచ్చినప్పుడల్లా బెదరుతూ వుండు. అలా చేసేవంటే నీకూ లాభం * లేకపోలేదు. నీవు చూస్తానన్న వస్తువులల్లా చూపిస్తూవుంటాను! అలా చూడ్డంలో మాత్రిం పొరపాటున మజ్జిగలో చల్లకలిపివేసినట్టు చేయక కొంచెం నీ యింటల్ జెన్సు (intelligence) చూపించేవంటే నీకూ నాకూ కూడా హేపినెస్ (happiness) వుంది——
మెల్లగా అప్పలనరశింహాంపంతులుగారి ఆశ్రిమం వకటి కట్టెది దొరకింది. యిహ యీ ఆపర్ట్యూనిటీ స్లో (opportunity slow) గా యెవేయిల్ (avail) చేసుకోవాల. ఆహా! అతని వైఫ్ (wife) ని చూస్తే నాకేం తోచకుండా యుంది. యెంత ఫెయిరూ? యెంత మోడస్టి (modesty ?) బ్యూటీ (beauty?) అంటే రాజామణికి లేదూ బ్యూటీ (beauty)? దాన్ని ముంచీసినంత వుంది. వుంటే యేం ప్రయోజనం? బూడిదలోపోసిన పన్నీరు మోస్తరు, మోడస్టి (modesty) లేందీ? మేలిమి బంగారం వస్తువుకు మెరుగు పెడుతే యేలాగు మెరుస్తుందో—ఆలాగా బ్యూటిఫుల్ అండ్ యంగ్, మెయిడెన్స్

(beautiful & young, maidens) కి మోడెస్టీ (Modesty) వుంటే అంత రాణిస్తుంది. మోడెస్టీ (Modesty) అనేది ఫిమే ల్సు (females) కట్ల బ్రిటిష్ పాలిష్ (British polish) లాంటిది ?

ఆమాటకేంగాని యీ రాస్కల్లీ ఓల్డు ఫెలో (rascally old fellow) కి అంత యొంగ్ గరల్ (young girl) యెందుకు చెప్మా? వాడి శార్ధం పెట్టుకోడానికి! నాలుగో పెళ్ళట! యిప్పుడెంత సివిలి జేషను హెచ్చు అవుతూవున్నా యీ అపృచ్ఛపువెధవ పె ళ్ళిళ్లు మానేశారు కారు—సామ్ముకోసం బ్యూటిఫుల్ యంగ్ లేసెస్ (beautiful young lasses) ని ఓల్డు ఫెలోస్ (old fellows) కి అంటగట్టడం. వాళ్ళు ఏజ్ (age) వచ్చి కళ్ళు తెరచాక, మంచి యూత్ (youth) లో వున్న వారెవరినైనా చూచుకొని, వాళ్ళతో వుడాయించేరంటే వాళ్ళదా తప్పు? నన్నడుగుతే తప్పు లేదనేస్తాను సరేకదా వాళ్ళకి యెంకరేజి మెంటు (encouragment) కూడా యిస్తాను. బికాజ్ ఇట్ ఈజ్ సింప్లీ టీచింగ్ ఎ లెస్సన్ టూ దెమ్ (Because it is simply teaching a lesson to them)? కానీ--చూ తాం శాంతంగా. (అటుచూచి) ఆవస్తూందెవరు? (హాశ్చర్యం గా) యిదేంవిటి ? బుచ్చయ్యశెట్టిలాగున్నాడు- చచ్చేనా? దేంవుడా కనబడుతే పరువుతీసి పైనిపెడుతాడు. తొత్తుకొ డుక్కి పాతికరూపాయీలు యివ్వాల, కమలంకు కొన్న బట్ట లు తాలూకూ. మంచిగా చెబుతానూ వింటే విన్నాడు, లే కుంటె పతేల్ మని వక్కటి లాగేసి వుడాయిస్తాను. లెట్ మి ట్రై టు కాప్ హిం (Let me try to cap him) (అని ప్రక్కదుకాణంవానితో) యిది యెంతకు యిస్తావ్ ?

[ప్రవేశం—శెట్టి యెదురుగా.]

శెట్టి—యెంవయ్యో మొకం దాసేసుకోకు. సూసేను మా బాగా సూసేను నిన్ను. నీకేం సిగ్గు లేదు. పద్దె పాతికరూపాయిలూ. నిలబడిన పాటున వసూలు సేస్తాను.—

వెం—ఓహో శ్రేష్టిగారా! యిదేం పట్నం వచ్చేరు? ఇక్కడ కూడా వ్యవహారం వుందేఁవిటి? మీదేం వ్యవహారం అండీ. చప్పన్న దేశ్యాలు తిరుగుతూవుంటారు. వేలుకు వేలు దోసేస్తూవుంటారు. లక్ష్మీపుత్రులు.

శెట్టి—యింకా కలకత్తా యెల్లాలి. అక్కడ సరుకుంది. తేవాలి. యెరకన్న కొట్లోవుంటే నేను తిరుగుతాను నేనుంటే ఆడు తిరుగుతాడు. యీలాగే ల్యేవార్యం జరుగుతుంది.

వెం—మీ యిద్దరన్నదమ్ములూ యెంతో కలసికట్టు. నేనదే సంతోషిస్తూవుంటాను. అంచేతే ఆలా వ్యవహారం సాగుతూవుంది. మీ సొమ్ము వారంరోజుల్లో ఫైసలాచేస్తాను. యిక్కడ వుద్యోగం ఐంది. యీ ఫస్టుకి జీతం అందగానే మీ పాతిక పువ్వుల్లో పెట్టి పంపిస్తాను.

శెట్టి—యిక నీ ఆట్లు మరి సాగవయ్యో. పోలీసోళ్ళకు అప్పసెప్తాను. (అని గట్టిగా) యిస్తావా యివ్వవా నాపాతిక రూపాయిలూ? నిలబడినపాట్ను వసూలు సెయ్యకపోతే నేను కోఁవటి గవరయ్యకు పుట్టలేదు.

వెం—(తనలో) లంజకొడుకు మాట్లు మీరేస్తున్నాడే—పీక నొక్కేస్తానంటే బాగుండదూ. అందరూ నడుస్తున్నారు. (పైకి గట్టిగా) యెందుకోయ్ ఆలా అరుస్తున్నావ్? నాతో రా అణా దమ్మిడీలతో ఫైసలా చేసేస్తాను.

శెట్టి—పద యెక్కడకో యీ వేళ నిన్ను వదల్ను—

(వెంకటేశం శెట్టిని బీచివైపు తీసుకొనిపోవుచుండును, శెట్టిదారిలో నోరుచేస్తూ)

శెట్టి—యిదేంవిటి బీచివడ్డుకు తీసుకొస్తూన్నావ్?—

వెం—(కోపంతో) రావోయ్ వెట్టిపప్ప—సొమ్ము కావలిస్తే—బట్ట లాగు అరవకు తన్నైగల్ను—

శెట్టి—(పెద్దకేకలు వేస్తూ) అయ్యల్లారో సూడండోయి బాకీసొమ్ము అడుగుతూవుంటే తన్నేస్తాడంట. యెలాగు తంతాడో సూస్తాను. యినండయ్యలారో యీాకదంతాను. రేపు కోర్టులో సాక్షికం సెప్పాలి—

వెం—చెప్పుకో తొత్తుకొడుకా—తన్నడం తన్నడం—కొనితేవాలేంవిటి— నీయబ్బతో చెప్పుకో—(అని వక్కతాపు తన్ని క్రిందపడేసి రెండుగుద్దులు గుద్ది ప్రక్కవీధిలోకి పారిపోవును).

వెం—(పునఃప్రి) వీడిసంకటం కుదిర్చేసరికి తలప్రాణం తోక్కొచ్చింది. హొటేలుదగ్గరే దొరకిపొయ్యేను. రంగయ్య యెక్కడవింటాడో అని ఝడిసేను—గాని తగినప్రాయశ్చిత్తం చేసి వదలిపెట్టేను. యిఖ్ కనబడినా మరి అడగడు. దెబ్బకు దెయ్యం జడుస్తుంది వీడనగా యెంత. హొటేలురంగయ్య విన్నాడంటే యెంతమోసం వచ్చునూ. నేను వేసినప్లాటు (plot) అంతా పాడైపోవునా? (ఆలోచించి)

లోకంలో బాగా మక్కీపెట్టి యగ్జామినేషన్సు పాస్ (examinations pass) చేసినవాడే మంచి తెలివైన వాడని దురభిప్రాయం పడుతూవుంటారు. తెలివంటే అదా తెలివి? నెవ్వర్ (never) యెంతమాత్రం కాదు. కామన్ సెన్సు (common sense) అనగా లోకజ్ఞానం బాగా వుండాలి. ఆపైని కొంచెం ట్రిక్కీష్ నెస్ (trickishness) వుండంటె యీాలాంటి లా

కాయ్ లూకాయ్ వ్యవహారాలు యేమైనావుంటే బై హూక్ ఆర్ బై క్రూక్ (by hook or by croock) మెల్లగా తప్పించుకోవచ్చును. అప్పులుచేయడంలోనూ కొంచెం యింటెలిజెన్సు (intelizence) చూపించవచ్చు — అంతా వక్కదగ్గిరే చేస్తే నలుగురుఅప్పులవాళ్ళూ కలుస్తారు. వూర్లో మరి పరువుండదు. అందుచేత అప్పుచేస్తే యీకొంత వకరిదగ్గర ఆకొంత వకరిదగ్గరా యీలా వకరికి వకరికి తెలియకుండా చేసేం అంటే కొన్నాళ్లు అవుసరమైవేద్యం తీరుతుంది—యిక యీవూర్లోకూడా అప్పులు లావైపోతూవున్నవి— రంగయ్యకూడా సొమ్ముసంగతి మెల్లగా యెత్తుతూవున్నాడు.

ఔనుగాని, యీలాగు యెన్నాళ్ళు టోపీవేసుక తిరుగుతాను,— (ఆలోచించి) హార్డింగు (Harding) అన్నట్టు—ఉయ్ కేన్ డిసీవ్ ఆల్ యెట్ వన్ టైమ్ ఆర్ సమ్ యెట్ సమ్ టైమ్సు-బట్ నాట్ ఆల్ యెట్ ఆల్ టైమ్సు. ('We can deceive all at one time or some at some times— but not all at all times ')అందుచేత యెప్పుడో వకప్పుడు దొరకిపోతాం-సరే ముందుసంగతి యిప్పు డెందుకు? యీరంగయ్యకి మరో టెన్ డేస్ (ten days) గమ్మత్తు చెయ్యాలి. యీలోగా నాప్లాటు (plot) పూర్తి అయేపోతుంది. ఆలాంకాకపోతే మరొకదారి చూచుకొందాం. అట్నుంచి నరుక్కురమ్మన్నాడు.

(అని నడవబోయి)

యిటువైపువెళ్ళితే కాఫీహొటేలువాడు సొమ్ము అడుగుతాడు. మరొకదార్ని పోదాం—

(నిష్క్రమణం).



# ద్వితీయరంగము.



స్థలము—రంగయ్యహోటేలు.

[హోటేలులోపల నలుగురైదుగురు భోంచేస్తూవుందురు రంగయ్య వాళ్ళతో మాట్లాడుతూవుండును. వెంకటేశము మెల్లగా వీధిగుమ్మమెక్కి తలుపుయిరుకున చూచి]

వెం—(మెల్లగా) లంజకొడుకులు తింటూ బాతాఖానీచేస్తూవున్నారు. నాసంగతేం లేదుకద? అయినా యివతలనుండే విందాం—

(అని తలుపుప్రక్కన నిలుచుండి యీక్రింది సంభాషణ వినుచుండును).

రంగ—అయ్యా మీది యేవూరన్నారూ ?

మొదటిమనిషి—మాది కాకినాడ అండి—

రంగ—(మరొకరిని చూచి) మీదికూడా కాకినాడేనా ?

రెండవమనిషి —కాదండి మాది విశాఖపట్నం—

రంగ—ఆలాగా—విశాఖపట్నంనుండి యెవరో వకఅబ్బాయి వచ్చేరండీ. అతనికి విజయనగర దగ్గర వక అగ్రహారం కాని, విశాఖపట్నంలో బీచిని కొత్తగా మేడ కట్టించి, దాన్లో వున్నారట. కాస్త పెద్దకుటుంబాలోనివారేనూ.

రె॥మ॥—(ఆశ్చర్యంగా) యెవరండీ! బీచిని కొత్తగా మేడలు కడుతూ వున్నారుగాని- కట్టినవి కొత్తవి లేవే ! మనిషి యేలా వుంటాడూ?

రంగ—కాస్త పొట్టిగా కొంచెం లావుగా వుంటారు. వుండండి. వేళైంది వస్తారు.

రెం॥మ — నాకు టైము అయిపోయిందే బండికి- యింకా యెప్పుడు వస్తారో?- (వెంకటేశం మళ్లా తలుపు యిరుకున చూచి)

వెంక — (పైకుండి) వీడే తస్సాగొయ్య! వీడుగాని తలుపు తీసుకొని వెళ్ళిపోయియుంటే కొంప మునిగిపున్ను- యీబండికి వీడు వుడాయిస్తాడు. మళ్లావస్తాను. (గడప దిగును.)

[లోపల] 'యేమండీ యింకా రాలేదూ? నాకు టైము అయిపోయింది. యేలాగుంటారన్నారూ- కొంచె తెల్లగా పొట్టిగానా- యెవరు చెప్నా — అంత నొప్పవాడైతే యీహోటేలు ఖర్మం యేందుకి?. వెంకటేశంగారేవచ్చి యేం వేషాలు. వేస్తూన్నాడేం విటి? యిప్పుడు విశాఖపట్నం నుంచి యెక్కడికో పారిపోయేడని విన్నాను- (రంగయ్యతో) యేమోనండీ యీదపా వచ్చినప్పుడు చూడవచ్చును. నాకు టైము అయిపోయింది రెయిలుకు వెళ్ళిపోతాను. యిన్ని హోటల్లు చూచేనుగాని యీమోస్తరు యెదీ లేదండి. భాగా సహాయం చేస్తారు.

రంగ — సహాయం యేదీ. చూస్తిరా నాకు యెవరూ లేరు. అంచేత యెవరిదగ్గర పుచ్చుకున్నది వాళ్ళకే పెట్టేస్తాము. వెళ్ళిపోతారూ? వెళ్ళండి బండికి వేళైంది. దయమాత్రం వుంచండి రంగయ్యమీద.

రెం॥మ — మళ్లా వచ్చినప్పుడు యిక్కడికే వస్తాను లెండి- (అని పెట్టి పట్టుకొని పైకివచ్చి పక్కకు పోవును.)

[ప్రవేశం: — వెంకటేశం.]

రంగ — యేవండోయ్, యీ వేళ యింత ఆలస్యం అయిందీ! యింతసేపూ యెవరో మీవూరినుండి వచ్చేరు. మీకోసం చూచి యిప్పుడే వెళ్ళిపోయేరు.

వెం — (ఆతృతతో) యెవరూ? యెంతసేపైంది వెళ్ళిపోయి?

రంగ—అబ్బే యిప్పుడే కాలుగంట అయి వుంటాది. యింకా పూల అంగడికి వెళ్ళరు.

వెం—(ఆలోచిస్తూ) యెవరండీ వారు? పేరడిగేరు కాదూ?

రంగ—పేరా జగ్గారావు కావోసు-

వెం—ఓహో జగన్నాయకులటండీ- యెట్టగా బక్కపలాసగా వుంటాడూ.

రంగ—ఆ- అతనే- మీకు తెలుసునేంవిటి?

వెం.—తెలియకేం? యీలా నాపేరు చెప్పేరు కారేం? యీవేళ వుండిపోనే. అతను నాయింటిమేటు ఫ్రెండు (friend).

రంగ—సమయానికి మీపేరు జ్ఞాపకం వచ్చిందికాదండి. వందసార్లు మీపేరు చెపుతునే వుంటారు వందసార్లు మర్చిపోయి మళ్ళా అడుగుతునే వుంటాను.

వెం—అయ్యో యెంతపని చేసేరూ యీలాగ. రమణారావు (Ramanarao) గారూ యిక్కడే వున్నారని చెప్పలేకపోయేరూ. వుండిపోనే—

రంగ—అదిగో అదే మర్చిపోతూవుంటాను- రమణరావుగారు- యీదపా మరి మరవను.

వెం—పోనీ వట్టి రావుగారు అనలేకపోయ్యేరా తెలసిపోనే—నేను యీవేళ ప్లీడరుగారితో మాట్లాడుతూ వుండిపోయ్యేను. అతను యింతవరకూ వదలేడు కాదు. మా నాన్నగారి బాల్య స్నేహితుడట. భోజనానికు వాళ్ళింటికి వెళ్ళిపో రమ్మని బలవంతం పెట్టేరు కాని నేను రానన్నాను. చూసే రంగయ్యగారూ నాకు చట్టాలింట్లో భోజనం అంటే కొంచెం మొగమాటం. మావూర్లోకూడా యెవరింట్లోనైనా భోజనాలైతే వాళ్ళొచ్చి నన్ను రమ్మని తినేస్తారు. కాని నేను వెళ్ళను.

మెల్లగా తప్పించేసుకొంటాను—రంగయ్యగారూ యేమైనా ప్రత్తరాలు వచ్చేవా మాయింటనుండి ?

రంగ—ఆఁ—వచ్చేవండీ రెండుత్తరాలు. యివిగో రెండు కవర్లు—మీకెప్పుడు కవర్లేగాని సాధారణముగా కార్డ్లు రావు. (యిచ్చును.)

వెం—(విప్పి చదివి) యేమండి నిన్న యేమీ ప్రత్తరాలు రాలేదూ?

రం—అబ్బే నిన్నను రాలేదే- మొన్న వకటి వచ్చింది. మీకు యిచ్చేశాను.

వెం—అయ్యో నిన్నటి ప్రత్తరం మిస్ (miss) అయిపోయిందే—మా నాన్నగారు వస్తారట వారంరోజులలో.

రంగ—వస్తానని వ్రాసేరా యేమి ?

వెం—ఆఁ—యిదిగో ప్రత్తరం చూడండి ఇంగ్లీషు నుండి. తర్జుమా చేసి తెనుగున చెప్పమంటారా ?

రంగ—అబ్బే అంత తర్జుమా యెందుకూ- మీనాన్నగారికి యింగ్లీషు వచ్చునేం అండి ?

వెం—అబ్బే వృద్ధాప్యం- వాళ్ళకి యింగ్లీషు యెందుకండి- ఆప్రాన్లో మాస్నేహితుడు వహాదున్నాడు. వాడిచేత వ్రాయిస్తారు. మాగుమస్తా టైపుయంత్రంమీద అచ్చుకొట్టి పోస్టులో పడేస్తాడు—(ప్రత్తరం మళ్లా చదువుకొని) వారం క్రిందట "బైసికిల్ వకటి కొంటాను, సొమ్ము పంపించు" మని వ్రాసేను. దానికి యిప్పుడు జవాబు వ్రాసేరు.

రంగ—ఏం వనీ ?

వెం—సొమ్ము రెండు మూడు రోజులలో పంపిస్తారట.

రంగ—యేమాత్రం పంపుతారండి- యేం- వంద రెండువందలా?

వెం—వందా రెండువందలూ చాల్తాదీ ? ఆరువందలు పంపుతారు. మామ్మోలు పైకి లనుకొన్నారేంవిటి ? యిపుడు క్రొత్తవి వస్తూన్నావి. అవి తొక్కనవుసరం లేదు. యెలక్ట్రిక్కు (electric) అనే యంత్రంమీద వాటిమట్టుకవే చెప్పినట్టూ నడుస్తావి. మాంటురోడ్లో వున్నావి. దాని ఖరీదు ఐదువంద లు నాపైకర్చుకి వంద మొత్తం ఆరువందలు పంపిస్తారు.

రంగ—తెల్లవాడండీ వకటి చేస్తూన్నాడూ వకటిచెయ్యలేదూనా? అన్ని రకాలూ కనిపెటుతూవున్నాడు—అయితే రావుగారూ నాకు రావలసినసొమ్ము అందుతు దన్న మాటే—

వెం—అయ్యో యేం మ్మాట ! మీ సొమ్మేకాదు. మంచి ప్రెజంటు (present) యేదైనా యివ్వాలని వుంది. యిస్తాలెండీ.

రంగ—(చిరునవ్వు నవ్వుతూ) నాకు యేం ప్రజంట్లూ వద్దూ. మీ చేతిపెట్టెమీద నాకుంది. యేదైనా నాలుగు రోజులు పని యూణాకు నాలుగు బట్టలు వేసుక చక్కాపోవచ్చు.

వెం—(మెల్లగా) ఆఖరుకు నీకు అదే ప్రాప్తం అవుతాదిలే. (పైకి) యేం పరువాలేదు లెండి. యిదే కాదు. మీ సర్దాతీర మ రెండు యిటువంటివి కొని యిస్తాలెండీ. కాని—రంగయ్య గారూ పెట్టె పైని పెట్టేస్తూవున్నారేంవిటి ? పీకపోతుంది సు మండీ. ఐదువేల రూపాయిలు నష్టం. పెట్టి పోలేను. అన్ని దస్తావేజులు ప్రామసరీనోట్లు (promissory) నోట్లు వున్నావి. చాల భద్రంగా చూస్తూవుండాల సుమండీ. మిమ్మల్ని నమ్మి యిక్కడుంచేను—

రంగ—యేంతమాట అండీ. నాప్రాణంతో సమానంగా చూస్తూ వున్నాను.

వెం—దావా పడెయ్యాలండి—యీనెలాఖర్ని.

రంగ—యిన్నాళ్లెందివచ్చి, దావా పడేశారు కారేం?-

వెంక—కోర్టులు శెలవులండి. యింకా వారంరోజుల వరకూ-

[హోటేలులోవున్న మరొకమనిషి.]

అయ్యా యిప్పుడేం శెలవులండీ ?

వెం—యిప్పుడా- కిస్‌మిస్ శెలవులండి-

క్రొత్తమనిషి—(ఆశ్చర్యంగా) యిప్పుడేం క్రిస్‌మిస్ శెలవులు ? జనవరికి కదూ యిస్తా. యిది ఏప్రిల్ కావోసునే-

వెం—లేదండి మొన్న జనవరికి కేసులు హెచ్చుగావుంటే శలవులు యివ్వలేదు. యిప్పుడిచ్చేరు. కావలిస్తే భోగట్టా చెయ్యండి—

క్రొ-మ—అయ్యో భోగట్టా యెందుకూ ? మాకేం తెలుస్తుంది యీ కోర్టులు సంగతి చదువుకొన్నవారు కాబట్టి మీకు అన్నిసంగతులూ తెలుస్తూవుంటావి. అందుకే చదువు చదువని దేవులాడుతారు. మావాడు యెంతచదువుతున్నా చదవడండీ.

వెం—మీరీలాగున శెలవిస్తూవున్నారు. మానాన్నగారు, చదవవద్దని నన్ను బ్రితిమాలుతూవుంటారు. నేను చదివేనంటే చేతికి పుస్తకము అంటుకోవాలి. ఆలాగు చదివేవాడను. యగ్జామినేషన్ (Examination) లో (first) ఫష్టుగా పేసు అయేవాడను. మాస్టర్ (Master) కు తప్పు దిద్దేవాడను.

యిప్పటివాళ్ళు వట్టివెధవలండీ—చదవరు. యెప్పుడూ సిగరెట్లు తాగడం— సానివాడల్లో సరసానికి తిరగడం— అంతా డామిట్ (damit) నాకు అసహ్యంవేస్తాదండి.

రంగ—రావుగారూ— కోర్టులంటే జ్ఞాపకంవచ్చిందీ—మీ రొకసహాయం చెయ్యాలి. కూచిపూడినుండి వకవెధవ వచ్చి చెడతిని పారిపొయ్యేడండి- వాడిమీద కేసు చెయ్యాలి.

వెం—వాడిపేరు తెలుసునా ? తెలుస్తే వక్క నిముషంలో వసూలు చేస్తాను. చూడండి నాతడాకా.

రంగ—పేరు మరిచిపొయ్యేనండీ— పేరు తెలియకపోతే సొమ్మురు నీళ్ళదా ారే ?

వెం—ఆఁ—యెందుకుపోతుంది ?—పూరు కూచపూడేనా ?

రంగ—అవును. అదే.

వెం—ఋఖనే ? నేనంతా దరియాప్తుచేస్తాను లెండి. వకయింటిమేటు ఫ్రెండ్ (intimate friend) అనగా ప్రాణస్నేహితుడు వకడు వున్నాడు. వాడిద్వారా పేరు కనుక్కొని క్రిమినల్ (criminal) పడేస్తాను. పవర్ ఆఫ్ ఎటర్ని (power of attorney) నాకు వ్రాసియ్యండి.

రంగ—అంటే ?

వెం—అంటె చెప్తాలెండి బోంచేసి,. ఆకలివేస్తుంది. యేం కూరలు చేసేరు.

రంగ—యీవేళ యేంవీ దొరకలేదండీ—పప్పు, దప్పడం, నూవుల బీరకాయ ఉుకురు, పొటటోపొడిముక్కలు, తాండ్రి పచ్చడి, కరేపాకుపచ్చడి—చారూ, మజ్జిగానూ. అంటుమామిడిపళ్ళు అరడజను తీశేను యిప్పుడే. మీాయిష్టం వచ్చినన్ని కోసి పెడుతా.

వెం—(తనలో) ఆహా ! యేం మజా, నాతాతల్నాడెరగను యిన్నికూరల్‌తో తినడం—(పైకి) మడికట్టనా ?

రంగ—మీాదే ఆలస్యం.



# తృతీయరంగము.



స్థలము — అప్పలనరసింహంపంతులుగారియిల్లు.

[ప్రవేశం:— వెంకటేశం తలుపుకొట్టును. కనకలక్ష్మి తలుపుతీయును]

వెం — యేమండీ పంతులుగారు వున్నారా ?

కన — లేరూ. యిప్పుడే ఆఫీసుకు వెళ్ళిపోయేరు. పాపం. మీరు యెప్పుడువచ్చినా పంతులుగారు యింటివద్ద వుండరు.

వెం — అది నారోజులు మహాత్యం అండి. దానికి మీరేం చేయగలరూ నేనేం చేయగలను. రోజులు వంకరగా వున్నప్పుడు అన్నీ ఆలాగునే తటస్థపడుతూవుంటాయి. అయితేనే నెండి పంతులుగారితో అప్పుడప్పుడు ఆఫీసుకో కలుస్తూవున్నాను. ప్రతి రోజూ ఆఫీసుకు వెళ్ళుతూవుంటే బాగుండదని వకప్పుడు యింటికి రావడం తటస్థిస్తూవున్నాది. మీఅన్నయ్య వుత్తరాలు వ్రాస్తూవున్నాడా ?

కన — లేదండీ రాలేదు. యెన్నాళ్లై వుత్తరాలు వ్రాయడంలేదూ.

వెం — మీఅన్నయ్యకూ నాకూ చిన్నప్పటినుండీ చాలాస్నేహం. యెప్పుడూ హాస్యాలు ఆడుకొంటూ వుండేవాళ్ళం. చూచిన వాళ్ళంతా 'వీళ్లిద్దరూ కృష్ణార్జునుల్లా వుంటూ' రని అనుకునేవారు. అప్పుడు మీకు చిన్నతనం. యిప్పుడు మిమ్మల్ని పోల్చుకో లేకపోయేను.

అతను వెళ్ళిపోయేటప్పుడు ప్రతిరోజూ మిమ్మల్ని చూస్తూవుండమన్నాడు. పెద్దపట్నం—కొత్తగా రావటం—ఆపైని మనవాళ్ళెవరు కనపడరూ చాలా కష్టంగా వుంటుందని. మనం అంతా వకసైడువాళ్ళం కాబట్టి అభిమానం వుంటుంది. తర్చుగా వస్తూన్నానని అన్యథా తలంచకండేం ?

కన—అబ్బే యెంతమాటా—మిమ్మల్నిచూస్తే మావాళ్ళ నందర్నీ చూచినట్టుంటుంది. మీపనిసంగతి యేంవయిందీ?

వెం—యింకా కాళీలు రాలేదంటూ వున్నారు. పంతులుగారితో మీరు కాస్త రికమెండు (recommend) చెయ్యాలి.

కన—ఓ తప్పక చెబుతానులెండి—మీది యేవూరన్నాటూ?

వెం—యేవూరైతేం లెండి డేస్ (days) అనగా రోజులు బాగు లేనప్పుడు. చిన్నప్పుడు యెంతముద్దుగా పెరగేనో యిప్పుడంత కష్టాల్లో మునిగివున్నాను. యిక్కడకు వచ్చి మూడు మాసా లైంది. హండ్రెడ్ రుపీస్ (hundred rupees) అనగా నూరు రూపాయిలు కర్చు అయిపోయినాయి. పనీలేదు పాటూలేదు. యిఖ దమ్మిడీ చేతలేదు. ముందుసంగతి యేమీ తోచకుండా వున్నది. చూచారా అండి యెంతచదువుకున్నా గుడ్ లక్ (Good luck) అనగా అదృష్టం వుండాలి. లేకపోతే గుడ్డిగవ్వకు మారం.

కన—అవును నిజమేనూ. యెవరు యెంతతెచ్చుకొన్నారో అంతా అనుభవించాలి. నిజంగా మిమ్మల్నిచూస్తే నాకు కనికారం వేస్తూవుంది.

వెం—మీకేకాదు నన్నుచూస్తే యెవరికైనా సరే-మెత్తనిహృదయం వుంటే చాలును—కనికారం వేస్తాది. యీవేళ పంతులుగారితో చెప్పేసి, మావూరు వెళ్ళిపోతాను. యిఖవుంటే యెక్స్పెన్సెస్ (expenses) గాని మరేం లాభంలేదు.

కన—వెళ్ళిపోకండి. వుద్యోగంసంగతి బాగా చూచి మరీవెళ్ళండి. తొందరపడుతే లాభంలేదు.

వెం—వుద్యోగం వుద్యోగం అనడంవేగాని యేంవుద్యోగం తీస్తురూ. పొద్దున్ననుంచి సాయంకాలమువరకూ కష్టపడుతే మూపై

రూపాయీలు యిస్తారు. మనయిళ్ళల్లో కూలివాళ్ళకు ఆపాటి కిట్టదూ? పైదేశ్యం వెళ్ళిపోతే వందలు వందలు గణించుకో వచ్చును.

కన— దూరదేశ్యం అంటే యెక్కడ-అమెరికా అంటారు అక్కడకా?

వెం—అక్కే అంతదూరం మనం వెళ్ళగలమా? కటకపూరు, కాఫీ మట్టి అని పెద్దయి డిపెండెంటు స్టేట్సు (Independent states) అనగా స్వతంత్రరాజ్యాలు రెండు వున్నాయి. అక్కడకు పోయేమంటే వాళ్ళు రోజుకు నాలుగైదు గంటలు పనిచేయించుకొని వందలుకొద్దీ యిస్తారు. దర్జాగా వుండవచ్చును. ఐతే మొదుకు అక్కడకు వెళ్ళిపోయూరుకారని అడుగుతారు కాబోలు. మీరు అడగకముందే చెప్తా వినండి.—ఇవి తెనుగు దేశ్యాలు. యిక్కడున్నాటే మనవాళ్ళూ మనదేశస్థులూ కనబడుతూవుంటారు. వుద్యోగఫాయిదాను చూచి అక్కడకు వెళ్ళిపోతేను, మిమ్మల్నందరిని విడచి వెళ్ళిపోవాలా లేదా? యేమంటారు?

కన—అవును.

వెం—ఇఫ్ యిటీజ్ సో (If it is so)— అలాగునైతే నాకు యెంత కష్టంగా వుంటుంది.

కన—అవును.

వెం—యిక సెకండు అండ్ ది మెయిన్ రీజన్ (second and the main reason) అనగా ముఖ్యమైన కారణం వినండి— నేను వక్కడను. షూసేరా అంటే శాస్త్రకారుడు యేంవన్నాడో నో ‘ యేక్ నిరంజన్. దో సుఖి ’—

కన—అనగా—

వెం—అనగా యేక్=వక్కడు. అంజక్ అనేది సంస్కృతపదం. దాని అర్ధం విచారం. ఇర్ అనేది వారియాభాషలో లేదని అర్ధం. రెండుకలిస్తే విచారం లేదని. అనగా బ్రహ్మచారికి యెట్టి విచారం వుండదని—

కన—మీకు చాలాభాషలు తెలిసినట్టుందీ ?

వెం—మీదయవల్ల చప్పన్నదేశ్యాలు తిరిగి చప్పన్నబాషలూ నేర్చేను. అయిదోతనం లేదన్నట్టు అదృష్టంవే లేదుకాని— తర్వాతసంగతి వినండి. మీకు విసుగులేదుకదా నామాటలు వినడానికి ?

కన—అయ్యో యెంతమాట. మీమాటలు విన్నకొలంది వినాలనే వుంటుంది.

వెం—అంతదయవుంటె చాలు. (మెల్లగా) కొండల్తో పోరాడుతాను. (పైకి) యిఖవినండి. నావక్కనిపొట్టకోసం ముప్పైరూపాయీలు యెత్తి ముంచా చాలు. పూసేరా యిక ఆ అన్యదేశాలు పోయి వందలు గణించుకొనిమాత్రిం యేమిలాభం. యెవరు తినాలి ? యెవరు సంతోషించాలి ?—

కన—యేంవీ మీకు భార్యా లేదూ ?

వెం—లేదు. నేను పెళ్ళాడను. ఆతలంపువుంటే యెంతమంది యిస్తామన్నారుకారు నాకు యిష్టం లేదనేశాను.

కన—యేం? యెందేత యిష్టం లేదు? (నవ్వును)

వెం—పెళ్ళిచేసుకొని పెళ్ళాం, పిల్లలుతోవుంటే యీముప్పై రూపాయీలు చాల్తావీ. యెంతమాత్రిం చాలవు. యూరోపియన్ ఫామిలీసు (European families) లాగు దర్జాగావుండాలి. పెద్ద బెంగ్లో (Banglow) చుట్టూ కంపౌండు వాల్ (Compond wall) (లూ) కాంపౌండులో చెట్లూ చేమలూ యింట్లో ఫాన్సీ

ఆర్టికిల్సు (Fancy articles) అనగా వింత వింత సామాన్లు బంట్రోతులూ- గింట్రోతులూ అట్టహాసం అంతా వుండాలి. అంచేత వాళ్ళకోసం యీదేశాలు విడచిపెట్టి పైదేశ్యాలు వెళ్ళిపోవాలా? పెళ్ళి లేకుంటే యెక్కడపడితేఅక్కడే వుండవచ్చును. అదీగాక పెళ్లాం వుందంటే వకొక్కప్పుడు డేంజర్సు (dangers) అనగా ప్రమాదాలు కూడా జరుగుతూ వుంటాయి. ఫర్ యగ్జాంపిల్ (for example) మాటవరసకు నేనువచ్చి పంతులుగారితో చాలరాత్రివరకు మాట్లాడుతూ వుండిపోతాననుకోండి- అప్పుడు పంతులుగారు యేమంటారు? వెంకటరత్నంగారూ చాలారాత్రి అయిపోయిందీ యిక్కడే పండుకొని వుదయాన వెళ్ళిపోకూడదా అంటారు. అప్పుడు నేను బాచిలర్ అనగా బ్రహ్మచారినై వుంటే యేం వంటాను. ఆల్‌రయిట్ సార్, ప్లీజు అరేంజి ఫర్ మై బెడ్ (All right sir, please arrange for my bed) సరే మంచిదండీ నడవలో పక్క వేయించండీ అంటాను. వకవేళ నేను మారీడ్ మేన్ (married man) అనగా కుటుంబీకుడనై యుంటే యేంవంటాను. 'అయ్యా డసంటు మేటరు మచ్ (doest matter much) పరువాలేదూ యెంతసేపు యిప్పుడే గమ్యస్థానం చేర్తానని శెలవుపుచ్చుకొని వెళ్ళిపోతాను. అంతరాత్రిప్పుడు ట్రామ్ (tram) వుంటాదీ? వుండదు. అప్పుడు మెల్లగా నడుచుకుంటూ వెళ్తాను. దార్లో వకవేళ జడుసుకుంటే ప్రాణం వస్తాదా? మన సైడా తగిన మందులూ మాకులూ పుచ్చుకోవడానికీ తగిన శ్రద్ధ తీసుకోడానికీ? యీలాంటి సిటిస్‌లో ఖాతరే వుండదు. అడ్డదిడ్డంగా వేస్తారు మందులు- పర్యవసానం యేంవిటయ్యా? ఫటేల్మని- చస్తాం- చూసేరా

అండి పెండ్లి చేసుకుంటే వక్కొక్కప్పుడు ప్రాణాలు మీాదికి కూడా వస్తూ వుంటాది.

కన— (నవ్వుతూ) యెంత వర్ణించేరూ. పెళ్ళాడిన వాళ్ళందరికీ ప్రాణాలు మీాదికే వస్తూన్నావేంవిటి?

వెం— లేదులెండి-ప్రాబబిలిటీ (probability) అనగా అవకాశం వుంటుందని చెబుతూవున్నాను. అదీగాక- ఆదేశ్యాలులో తెనుగువాళ్లు వుండరు. బంగాళీవాళ్ళు వుంటారు.

కన— అంటే యెవరు?

వెం— బంగాళీవాళ్ళంటే అది వకతెగ. మళయాళంమోస్తరు. ఆడవాళ్ళు మనమొగవాళ్ళలాగు పైకి తిరగడం- పనులు చెయ్యడం- పైసాతేవడం—

కన— మరి మొగవాళ్ళేం చేస్తారూ?

వెం— మొగవాళ్ళా? వంటచెయ్యడం పిళ్ళుతేవడం-

కన— (నవ్వి) బాగుది- యెప్పుడైనా ఆదేశ్యాలు చూడాలి.

వెం— (మెల్లగా) యెప్పుడో యేంవిటి కొద్దిరోజుల్లోనే- చూపించడానికే కదూ యీ ప్రియత్నం అంతానూ? (పైకి) ప్రాప్తం అనేది వకటి వుండాలండి. చూసేరా 'రుణానుబంధ రూపేణా పసుపత్ని సుతాలయా' అన్నారు. దేశ్యాలు తిరగడం చూడడం- కూడా దీనిలోనే చేరింది. యిక మనసంగతి వినండి-

కన— మీారు చెప్పేది నాకు తెలుసురు గాని, నేను చెప్పినట్లూ విని పెళ్లి చేసుకొని ఆపెళ్ళాన్ని తీసుకొని ఆదేశ్యాలు వెళ్లిపోయి హాయిగా వుండండి. ఆలాయైతే నాకు యిష్టం-

వెం— అదీ వకపక్షంచేత బాగానేవుంది. కాని చిన్న కష్టం వకటి వుంది. మీారే ఆలోచించండి- యిప్పుడు నాకు తగిన కంపేరిజన్ (Comparison) అనగా వైఫ్ (wife) (నాలిక కరచు

కాని) యీ వెదవ యింగ్లీషు బరులలో చదువుకొంటే యిదే తంటా! సరిగా తెనుగు మాట్లాడలేం. యేదో యింగ్లీషు ముక్క దొర్లుతునే వుంటాది. అందులో నాకు దొరలతో సహవాసం లావు. అంచేత మాట్లాడుతూ వుంటే ముత్యాలు లాగు యింగ్లీషు ముక్కలు వూడిపడిపోతూ వుంటావి. విసుగుకోకండి—

కన—నాకు యింగ్లీషు చదువుకున్నవాళ్ళంటే చాలా సర్దా. మా అన్నయ్య చదువుతూవుంటే ప్రక్కన కూర్చుండే దాన్ని- యిప్పుడన్నా చిన్న చిన్న ముక్కలకు అర్థం తెలుస్తుంది. యిప్పుడు మీరన్న ముక్కకి అర్థం చెప్పనా ?

వెం—చెప్పండి చూదాం-

కన—'పెళ్లాం' కదూ. (నవ్వును.)

వెం—వెరీ నైస్ (very nice) చాలా బాగుంది. మీకు కూడా యింగ్లీషు కొంచెం వచ్చునన్నమాటే ! మీలాంటివారే గాని వక్క ఆరుమాసాలు నాతర్ఫీదులో వున్నట్టయినా సరోజినీ దేవిలాగు సరిగా ప్లాటుఫారము (platform) మీద లెక్చర్సు (lectures) యివ్వరూ ?

కన—మా పంతులుగారు యేంవీ నేర్పరు. యిరవైనాలుగుగంటలూ కచేరీ పనే.

వెం—అట్టే ఓల్డుపీపుల్ (old people) వృద్ధాప్యంలో యీసర్దాలు యేంపిటండి- కృష్ణా రామా అని హాయిగా కూర్చోనే యీడువాళ్ళకి- చూచేరా అండి- యిందాకా వైఫ్ (wife) అనే సంగతి చెబుతూ యీ ఫిమేల్ యెడ్యుకేషను (female education) అనే సంగతిలో దిగేం—యిపుడు నాకు ప్రస్తుతం వివాహం అయివుండలేదు. యిక వివాహం చేసుకొందాం

అంటే యెంతో సొమ్ము వుండాలి. ఆసొమ్ము నేనే సంపాదించుకోవాలి. ఆలాగు సొమ్ము సంపాదించుకోవడం యెన్నాళ్ళకో గాని కాదు. యిన్నాళ్ళూ యీపూరిలో వుండి మీలాంటివాళ్ళతో నోటిలో నాలుకవలె స్నేహంగా తిరుగుతూవుండి- యెవత్తెనో పెళ్ళాడగానే చటాల్న యేలాగు వెళ్ళిపోయేది? కష్టంగా వుండదూ? యేం వంటారు.

కన—అవును నిజంవే. పోనీ యిప్పుడే మీరొక్కరూ వెళ్ళిపోయి వుండగూడదూ?

వెం.—నేను వక్కడనే వుంటే తిండి యేలాగు? అక్కడ తిండి మనకు సరిపోదు. వాళ్లు అన్నం తినరు. వుడికీ వుడకని మాంసం రొట్టే తింటారు. నేను వెళ్ళేనంటే యెవర్నైనా తీసుకవెళ్లాలా? వంటకు? యెవరువస్తారు చెప్పండి. నేను వక్కణ్ణే వండుకొని కష్టపడడం మీకు యిష్టంవేనా?

కన—హై—

('తలుపు' 'తలుపూ' అని పైనుండి)

వెం—అదిగో పంతులుగారు వచ్చేరు!—యింట్లో మాట్లాడుతూవున్నాం—నన్ను చూస్తే అనుమానించరూ? యేంవిటి దారి?

కన—యేం ఫరవాలేదు లెండి. ఝడిసిపోవద్దు. మీ కంతభయంగా వుంటె పెరటిదార్ని వెళ్ళిపొండి—యిదిగో తొందరపడి వెళ్ళిపోకండేం,—హోటేలువాడు తొందరచేస్తే యిుద యీవుంగరం. అమ్మేసి అందాక వాడి కిచ్చియ్యండి. పెట్టిలో రూపాయీలు తీసేవరకూ పంతులుగారు వుండరు.

(వుంగరం తీసియిచ్చును).

వెం—అక్కే అవుసరంలేదు లెండి—మీదయవుంటే చాల్ను—

(మరల తలుపు తలుపు అని శబ్దము.)

కన—అదిగో తలుపు బాదేస్తూవున్నారు. మీరు వుద్యోగం అయేక నాది నాకు యిచ్చేదురుగాని లెండి. చప్పున పెరటితలుపు తీసికొని వెళ్ళండి నేను వీధితలుపు తీశేస్తూవున్నాను. (అని వుంగరం వెంకటేశంజోబీలో పడవేసి చప్పున వెళ్ళి తలుపుతీసి మరల వచ్చును).

అప్పల—(ప్రవేశించి) యేం వస్తా యెంతసేపు తలుపు తియ్యడం గంటపేపాయి అరుస్తూ వున్నాను. (కోటూ పాగా విప్పుచుండును).

కన—యింతసేపూ, మీరు వస్తారనే యెదురుచూస్తూ యేం చప్మా యింకా రాలేదని యీలా మంచంమీద సాగలపడేసరికి చిన్నకునుకు పట్టింది—యింత ఆలస్యం యేం యీవేళా?

అప్పల—యేం వుద్యోగం తీస్తు అట్టే కూర్చొని వ్రాయడంచేత నడుం పీకేస్తూవుంది వల్ల కాటిపని. వదలెయ్యాలని చూస్తూవున్నాను. (అని మంచం యెక్కి) కొంచెం నడుం పట్టూ—

కన—ప్రతిరోజూ యీలాగే అంటూన్నారు. యీలా అనడం మానరు పనీ మానెయ్యరు. మధ్యను నాచేతులు పీకుతున్నావి మీ కాళ్ళు పట్టడాన్ని—ఔనుగాని—యేదీ కాసులపేరూ? తెచ్చేరూ యీవేళ తెస్తానని మరీ మరీ చెప్పేరు.

అప్ప—యేదీ తెరిపి వుంటేనా?

కన—(మొహం తిప్పుకొని) పోనీ లెస్తురు యెప్పుడూ యిలాగే.

అప్ప—అంతలో అవతలకు తిప్పేసుకోంవడంవా మొఖం—తయారైపోయింది. యిదిగో సొమ్ముకూడా తెచ్చేను. శ్రావణశుక్రవారం రేపు మెడలో వేసుకుందూగాని.

కన—నాతోడే?

అప్ప—వట్టీ నీతోడూ తప్పక రేపు తెస్తాను. మెడలో వేసుకుంటే నిజంగా కనకలక్ష్మివే! యేదీ ముద్దు—

కన—అబ్బే వుండుకూ—చుట్టకంపు, పొడుంకంపున్ను—అసహ్యం వేస్తాది. లేవండి బోజనానుకు—(తనలో) యెంతకన్నా యీముద్దులుపెట్టుకోవడం—మరేయేదుపులేకపోయినా ముద్దులుకుమాత్రం లోటులేదు—(పైకి) రండీ మడికట్టుకోని—

(లోపలకు నిష్క్రమణ).



# కాంతాపహరణము.

## పంచమాంకము.



### ప్రథమరంగము.

స్థలము :—రాజామణి యిల్లు.

[తలుపు తీసియుండుటచే వెంకటేశం మెల్లగా ప్రవేశించి యిరువైపుల చూచి]

యేరీ యింకా రాస్తూన్నట్టున్నారు? తలుపుతీసుకొని యెక్కడకు పోయ్యేరు? (కొంచెం ఆలోచించి) రాజామణి తిరుగుతుంది కాబోలు. వంటయింట్లో శబ్దం అవుతూన్నది—వస్తే గమ్మత్తు చేదాం. కనబడకుండా యీమంచం కిందకి దూరుదాం. (మంచం కిందకు దూరును).

[కాంతసీపటికి తల్లి పిల్ల మాట్లాడుతూ ప్రవేశించి]

తల్లి—రాజా పిల్లో బాబు యెన్నిదినాలైనా రాలేదే? —కబురు పంపిస్తివా?

రాజా—లేదు తీస్తు—ను కేం వుండింది? అతను నిండా చిక్కుల్లో పడి వున్నాడూ. అందుచేతనా నేను సొమ్మని వుంచుకొంటిని—

వెం —(తనలో) యిదేంవిటి యీ ఓల్డు హాగ్ (old hag) వచ్చింది.

తల్లి—యీ నెలజీతం యిచ్చిపొయ్యాడా?

రాజా—లేదే—యివ్వలేదూ. యీదినం నీవుదా పోయి యెత్తుకొని రా.

తల్లి—మనకు రావలసిన దుడ్డు యెంతా ?

రాజా—నూరు రుప్పా—అంతకు గవ్వ తక్కువ తియ్యారు.

తల్లి—కాని వీ డెవడే ? నాలుగు దినాలై మనయిద్దెకు వస్తూండా డూ ?—గొప్పవాడేనా ?

రాజా—గొప్పవాడా ? లక్షరూప్ప ఆస్తి వుండిందంట. భోగందానికి యేబదివేలేమో పూడ్చిపెట్టినాడంట—యిళ్ళా వ్యవహారందా పెట్టి దుడ్డు సంపాదిస్తూవుండాడూ—

వెం—(యేమా ? సింగులర్ నంబర్ డామిట్ (singular number damit) దొంగరాస్కెల్సు (rascals) మర్యాదా లేదూ మంచీ లేదూ).

రాజా—నిండా దగ్గా మనిషి.

వెం—(నాదగ్గా యింకేం చూసేవు).

తల్లి—యిప్పు డెవరినైనా వుంచివుండాడా ?

రాజా—లేదే అంచేద్దానే నేను దృఢంగా ప్రియత్నం సాగిస్తూవుండానూ—యెత్తుకపొమ్మని చెంపుక తినేస్తూవుండా.

తల్లి—యేం చెప్తాడూ ?

రాజా—ఘుటంగు వకరీతిగా చెప్తాడు. ఘడియ కేమో సత్యంగా యెత్తుకపోతానంటాడు. ఘడియకు మాయమ్మ కోపం పెట్టుకోనంటాడు—యిట్లానె సెపూవుండాడు. అంచేద్దా నేను పస్తాయిస్తూవుండాను. యీదినం యేమో వస్తానూ యేదినం యెత్తుకుపొయ్యేదీ చెప్పుతానూ అని మొన్నటిగురువారం చెప్పి పొయ్యేడూ—నేటిదినం వచ్చునేమో ?

తల్లి—యిప్పటికి యేమాత్రం దుడ్డు విడచిపెట్టినాడే ?

రాజా—అబ్బే యేమీా యిచ్చిపోలేదే. యేదో కోర్టుపని వుండిందంట అంచేద్దా పట్నం వచ్చి నాలుగుదినాలు వుండాడు.

మొన్నటిదినం పాడితే జేబులో అంజీసుప్పా నోటు వుండింది—అది చేతిలో పెట్టిపొయ్యేరు.

వెం—(దట్ యీజ్ యె ఫాక్టు (That is a fact) కాని లంజలు యింకా పోరేం? యెంతసేపు కూర్చుండేది పుక్క-పెట్టి సంపేస్తుంది. నేరాపై దూరాను మంచంకిందికి)

తల్లి—చేతికి వుంగరాలు యేమీ లేవే? కాటు వెయ్యాక వూరు కొంటివా?

రాజా—అబ్బే, చిన్న చిన్న వాటికి కక్కుర్తి యెందుకని తలంచి వూరుకొంటిని. మనందా కొంచెం దర్జా చూపించవలె. చూపిన కదా- మనకు నమ్మి యెత్తుకపొయ్యేది. యిప్పుడు దా కక్కుర్తి చూపిస్తిమంటే—'వీళ్ళెక్కడ సామీ పిశాచులు మల్లె వుండారూ' అని యెత్తుకపోరు. అదీకాక చేతికి వుంగరాలు పెట్టుకు లేదే?

తల్లి—ఏకటి దైనా లేదే?

రాజా—యిల్లె అమ్మా- వుంటే నేం. లేకపోతేనేం? వాడిని యెవరేం అంటారెట్లా? ధనవంతులు వస్తువులు పెట్టుకుందురనే నీవు తలచేదా?

వెంక—(వెల్ సెడ్ (well said) వూహింపుశక్తి మాంవుంది ముండకు)

తల్లి—పెట్టుకుంటే పెట్టుకోనీ లేకుంటే లేకపోనీ వాడినెత్తి- గాని నీవుమాత్రం నిండా భద్రంగా వుండి వాడు యెత్తుకొనిపొయ్యేది సత్యమైతే వాడితో పోయి సాధ్యమైనంత త్వరలో నీకార్యము ముగించి మాప్రరు వకసారిదా చూసివస్తునూ అని సామ్మని వచ్చె.

వెం—(రంకు రాస్కెల్సు (rascals) యేం ఆలోచనలు చేస్తూ వు న్నారూ ?)

[ప్రవేశః—బ్రోకరు ]

బ్రో—రాజా నీకు వెంకన్న స్సెట్టియార్ తెలియూమా ?

రాజా—యెవ్వా—?

బ్రో—నాయనప్ప స్ట్రీటు వుండాదీ. అందుగుండా నేరుగా పోయి ప్రక్కకు తిరిగి రెండు మూడు యిల్లుదా దాటిపోతే అక్కడ పెద్దనగలసాపు వుండాదీ దాని యజమాని.

వెం—(యేదో క్రొత్తగరాయికీ తీసుకవచ్చేడు యీకోతి వెధవను. యింకా యెంతసేపు మాట్లాడుతారో ! ముక్కి చస్తూవున్నాను. యీవేళ యెవరి మొహం చూసేనో ?)

తల్లి—ఆను. ఆను. నాకు తెలియూం. నల్లగ రోలుమాదిరి వుండును వాడే ?

బ్రో—అవును వాడి సంగద్దా నేను సొల్లేది—

తల్లి—వేణుని వుంచి వుండాడూ.

బ్రో—రైటూ. వాడుదా. యిదివరలో వేణుని వుంచితిడి. వాడికి దానికి పోరు వచ్చి వుండాడి. అంచేద్దా దానియింటికి పోవడం కట్టిపెట్టేశినాడూ. నిన్న నేను వెంకటాద్రిగ్రా వాని అంగడికి పోయి యుంటిమి. మాపని ముగించిన తోడనే వాడు బా కన్ను సైక చేస్తిడి. యేదో బేరముండాదని నేను వుండిపోతిని. కొంతసేపటికి యిట్లా సంగతులు చెప్పి నీసంగతేమో అడిగినాడూ.

రాజా—యేమని అడిగినాడూ ?

బ్రోక—యేసంగతీ నీకు వద్దూ. నేను చెప్పేదానికి జబాబు చెప్పు. వాడు నెలకు యేబది రుప్పా యిస్తుడు. దుడ్డు నిండావుంది.

నిన్ను వుంచుకోండుడు. నీకు దా యిష్టం వున్నది లేద్ది సాళ్ళు—

రాజా—అంతియేనా ?

బ్రోక—అంతకు యింకా యేమి కావలె ?

రాజా—ఆలా నెల జీతముకు నేను వుండేది లేదూ. ఆస్థిలో సగం నాకు పూడ్చి పెడుతాడా ?

వెం—(యెంత ఆశ దీనికి- యిదేంవి యీకథ క్రాస్ వయిజు (cross wise) గా తిరిగింది ? కొంపతీసి సెటిల్ (settle) చేసుకొంటాదేంవిటి చస్తా ? నాతో రాదు కావోసు ?)

బ్రోక—ఆసంగతి నేను అడగి తెలుకో లేదూ వారిని తోడ్చుకొని రానా ?

తల్లి—పట్టుకొని రా పో- అంతా మేము సెటిలు చేసుకుంటాము.

బ్రోక—సర్దా- రాజా మొన్నటి తాలూకు దుడ్డు యిచ్చినావూ ? పాప్రిపై ప్రిటర్ను కుదిర్చి పెట్టినాను.

తల్లి—యేదీ మాకు దుడ్డు యేమీ చేరలేదే వాడిది. యింతలో నే తొందరపడుతూ వుండావు.

బ్రోక—నాలుగు దినాలు పోయేక చూస్తువూ- వాడు యిచ్చేది లేనిదీ-

రాజా—సరిదా నీవు పోయి తోడ్చుకొని వచ్చె- నీకు దుడ్డే చేతకు రాదా ? యింతకుముందు యెప్పుడైనా నీకు రావల్సి వచ్చినది మా వద్ద వుంచి వుండామా ?

బ్రోక—పూరుకో రాజా యెప్పుడైనా అట్లా అంటినా నేను—అవతల వీధిని నిల్చొనుండారు. యిప్పుడుదా తోడ్చుకొని వస్తాను. (పోవును.)

వెం—(యిదేంవిటి ? మరొక కోతి దిగుతుంది కావోసు. యీవేళ అడ్డంగా మాడేను.)

రాజా— అమ్మా నేను లేచిపోతానని యీ వెదవనికి తెలియవద్దూ- తెలుస్తే మనకార్యండా చెడును.

తల్లి—అబ్బె యెంతమాట. నాకు తెలియబాని చెప్పతుండావా ?- పూవులు ఆకోపాలో వుండావి. తలని మెత్తి పెట్టుకో. గొప్పి తెచ్చివుండాది.

రాజా—గొప్పి యేదీ- గది దుమ్ముగా వుండాది. పూడుస్తుంది. (గట్టిగా) ఓసే గొప్పీ !

వెం—(చచ్చేనాౖ) దేవుడా! మంచంకిందకు వచ్చి తుడుస్తుంది కావోసు. చూస్తే నా రస్పెక్టు (respect) పోతుంది- నవ్వేస్తారు. అంతగావస్తే కన్ను గిట్టేసి కానీ చేతిలో పెట్టి నోరుకట్టించెయ్యనూ ?)

[ప్రవేశం: గొప్పి కళ్ళునులుపుకొంటు]

రాజా—(వక్క దెబ్బకొట్టి) యెల్లప్పుడూ నిద్రేవా రంకుముండకు- పూడ్చు గదంతా.

(గొప్పి చీపురు పట్టి గబగబ తుడిచి చీపురు పడవేసి లోపలికి వెళ్ళిపోవును.)

వెం—నార్రో యస్కేప్ హవ్ ఫార్చ్యునేట్ (Narrow escape ? How fortunate ?).

[ప్రవేశం:—బ్రోకరు, వెంకన్నసెట్టిగారు.]

(రాజామణి, తల్లి నమస్కరింతురు.)

తల్లి—దయచేయండి సామీ-

బ్రో—వా- వుకారుంగో సామీ- (కుర్చీచూపును)

సెట్టి—(కూర్చొని) నాకు సాపాటుకి వేళయింది పోవాలి—

రాజా—యింకా కూర్చోనేలేదు, అప్పుడే తొందరచేస్తూ వుండాయి మొందుకు వచ్చితినని విచారిస్తూ వుండారా ?

సెట్టి—అబ్బే! నీకోసమే దా వచ్చింది.

తల్లి—సామీ- మీారేమో పిడిత్తో (బోగికర్ను చూపి) యేదో చెప్పి తిరంట, యిప్పుడే యిటు చెప్పిపొయ్యేమూ. అప్పటినుండీ మా రాజా కొరుక్కు తింటూవుండాది. (బోగికర్ను చూచి కన్ను గిట్టును.)

వెం—(యేం నాక్ (Nack) వుంది వీళ్ళకి.)

బ్రో—సత్యందా దీనిబాధ పడలేక, వేగం పరిగెత్తుకొని వచ్చితిని సామీ- మీాకూ మీాకూ కలిపివేస్తిని. మాట్లాడుకొండి.

తల్లి—మీాయిష్టందా సామీ. మీామాటలకు యేమి అడ్డు చెప్పవారము కాము. పోషించినప్పుడు మీాలాంటి వాళ్లుదా పోషించవలె. యేం రాజా (అని రాజామణినిచూచి కన్నుగిట్టును.)

రాజా—(నవ్వి వూరుకొనును.)

తల్లి—మా అమ్మాయికి నిండా సిగ్గు! అది చెప్పలేకుండా వుండాది. దానికి నెలజీతం యిష్టము లేదూ—సరే మీారు యెన్నాళ్ళు వుంచుకొనేదీ?

సెట్టి—యెన్నాళ్లు యేమి? నేను వుండినన్నాళ్లు అది వుండినన్నాళ్లు-

తల్లి—అంత కాలం జీతం యిస్తూనే వుందురా.

శెట్టి—జీతం యేంవిటి- నాకు పిల్లలు లేరు. ఆస్తి అంతా నా పెళ్లాముది సగం, వున్న సేషం నీకూంతురుకి రాసిపెడుదును.

వెం—(యెంతపోత్రంగా వుంది యీకోతివెదవడికి.)

తల్లి—సరేకాని- మా అమ్మాయి, యీామధ్యనేమో దాని తాతగారి యింటికి పోనూ- తిరిగివచ్చుట నెలదినాలేమో పట్టును. అం చేద్దా మీారేమో యేదైనా అడ్వాన్సు యిచ్చి పొండి—

వెం—(ఆఁ—వేసింది ముందు రంకుమెత్తు.)

సెట్టి—సర్దా- నాకు నిరబ్యరంతం- యింద (కోబీలో చంద్రహారం తీసియిచ్చును.)

తల్లి—నాకు వద్దు అదిగో దానికి యిచ్చి పొండి. నేను శెలవు తీసుకుందును సామీ- (పోవును.)

బ్రోక—సామీ నాకు శెలవు?

సెట్టి—సాయంకాలము అంగడికి రా రా- పో.

బ్రోక—చిత్తం సామీ. అల్లే దా వస్తును నాలుమణికి- (పోవును.

సెట్టి—రాజామణి యింద యెత్తుకో- యేదీ మెడా-

[రాజామణి తలవంచును సెట్టి మెడలో హారం వేయును.]

కొద్ది దినాల్లో వచ్చేయ్యాల. (అని పట్టుకొని ముద్దాడును)

తల్లి—(లోపటినుండి) రాజా సాపాటుకి వా అమ్మా—

వెం—(అన్నా బ్రతికేను శని వదలింది వెధవలు పోతారు.)

రాజా—నేను సాపాటుకు పోదును. మీరు కూర్చుంటారా యిక్కడ?

వెం—(ఆత్రుతతో) షట్ అప్ రాస్కెల్- లెట్ హిమ్ గో ఎవె (shut up rascal- let him go away).

సెట్టి—యింకా సాపాటు సేయలేదూ. పోతాను. (లేచి) రాత్రికి వస్తును.

వెం—(థేంక్సు (Thanks) రా బాబూ వేగరం దొబ్బు).

(రాజామణి వీధిగుమ్మంవరకూ దిగబెట్టును.)

తల్లి—(ప్రవేశించి) పోయేడా?

రాజా—ఆఁ—వెళ్ళినారు. (అని తలుపువేయును.)

తల్లి—వేసియ్యకమ్మా. అట్టనే వుంచు. వాడు వస్తుడేమో?— పద మనము సాపాటుకు పోదాము. (అని తలుపు తీసుకు పోదురు.)

వెం:—(మెల్లగా మంచంక్రిందనుండి వచ్చి గదిదాటి వీధితలుపు మెల్లగా తీసుకొని అవతలకు వెళ్ళిపోవును)

అమ్మయ్యా బ్రతికేశాను. యీ రాస్కెల్సు (rascals) యెవరైనా చూచిపోతారేమో అని ఝడిసేను. కాని యెంత మాదచ్చేత్ ముండలూ? మన సైడ్ ఫోరు సెవెన్సు (side four sevens) (మె) అనుకున్నాను గాని, వీళ్ళు అసాజ్జులే! సహారి కొకరు యీను దియ్యరు. ఇంతకు సానుల నెవను నమ్మమన్నాఁడు—

"సీ. పలువ లిచ్చినయంతఁ । బ్రాణనాయక యంచు
నగలు వన్నెలుఁ జూపి । పలుకరించు
రూక లిచ్చినయంతఁ । బోక లాడులు నిచ్చు
ముచ్చటించుచు ముద్దు । లిచ్చి మెచ్చుఁ
గాసు లిచ్చినయంతఁ । గామించుఁ బ్రేమించు
దాసురాల నటంచుఁ । దారసించు
సొమ్ము లిచ్చినయంత । నెమ్మెలం బ్రకటించు
భోగింపు మని వేగ । కౌఁగిలించు

గీ. పలువ లీకున్న దూషించుఁ । బలువయాచు
రూక లీకున్నఁ బొమ్మని । ప్రేలఁకించు
గాసు లీకున్న నిరసించు । నీసు పెంచు
సొమ్ము లీకున్న నుస్సులఁ । గుసుస్సురించు."

అన్నది అబద్ధమా? వీళ్ళ యీసునూటలూ- వీళ్ళూ- వీళ్ళ దొంగ ఆలోచనలూ- చూస్తే అసహ్యం వేస్తూ వుంది. నేనేమో గొప్పవాడి ననుకొని నన్ను కేప్ (Cap) వెయ్యడానికి నెట్ (net) అల్లుతూ వున్నారు. పూర్ క్రీచర్సు (poor creatures) యింకా తెలియదు నా తడాఖా వీళ్ళకి. ఐ హోంట్

మీాట్ దెం టుడే. లెట్ అజ్ గో టు కనకమ్స్ హౌస్. (I don't meet them today. Let us go to kanakam's house) అదేంవిటోగాని కనకం పేరు తలచగానె నా మైండు (mind) ఫుల్లుగా లోడ్ (load) అయిపోతుంది ప్లెజరు (pleasure) తో. దటీజ్ డ్యూ టు ట్రు లవ్ టువార్డ్సు హెర్ (That is due to true love towards her). యీ రాజామణిని చూస్తేనో? అసహ్యం వేస్తుంది. యెంత బ్యూటీ (beauty) గా వుంటేనేం? బ్లడీ రోగ్సు (Bloody rogues) నూాలుపోకలతో గొంతుకలు కోస్తారు. యిలాంటి వాళ్ళని తలస్తే హెల్ (hell). కనకాన్ని తలస్తేనో ప్యూర్ హెవెన్ (pure heaven) పీరస్వర్గం? తలంచడం యోంపటీ? ప్లాటినియమ్ ప్లేట్ (platinium plate) మీాద 'క-న-క లక్ష్మి' అని బిగ్ లెటర్సు (Big letters) తో చెక్కి దానికి గోల్డు బోర్డరు (Gold border) తో చట్రాం కట్టించి చంకలో పెట్టుకొని స్వర్గానికి వెళ్ళితే చప్పున ఎడ్మిటెన్సు (admittance) యిచ్చేస్తారు.

(సష్ట్రేమించును.)

# ద్వితీయరంగము.



స్థలము:—అప్పలనరసింహం యింటిముందరస్థలం.

[ప్రవేశము:—వెంకటేశం చిన్నగొంతుకతో పాడుతూ-]

ఓహో! కన్నియ నిన్నుగన్నకొలది కన్నుల కానందమయ్యె
కరమిటునిడి శరముల వేసిదాడి మాన్పుమా॥
అహా! నిన్ను గవయుంటే నాకన్నిటసుఖమని
నేనెంచితి నామది నోవన్నెలాడిరమ్మా-
రమ్మా యిటు రమ్మా మోమిమ్మా ముద్దిమ్మా॥

యీకనకం రూపుచూస్తే నాకేం తోచకుండావుంది. దీన్ని చూస్తే తారాశశాంకంలోని పద్యం జ్ఞాపకం వస్తూవుంది- పద్యం పూర్తిగా వస్తుందో రాదో యిప్పటికి చాన్నాళ్లైపోయింది ఖంతతాపెట్టి—(అని ఆలోచిస్తూ క్రిందిపద్యం చదువును)

“ఔరా చక్కదనంపుపలాసు ముఱిపెం బయ్యారె యొయ్యారమా
హౌరా మైసిరి హైసరే సొబగు మేలాహా విలాసంబుల
జ్జాంగే జవ్వన మద్దిరా వగలు మజ్జారే తనూవిభ్రమం
బీరామా మణితోడ సీడు గలరే యీరేడులోకంబులన్.”

యేలాగో పూర్తిగా యిడ్చేసేం. మరిచిపోయ్యా ననుకున్నాను. యీలాంటి శృంగారపద్యాలు మర్చిపోతాం? వెయ్యేళ్ళ మరం. స్కూలుపాఠాలు చెప్పా- యిప్పుడు చదువుతే పుస్తకం ముయ్యడంవే తరువాయి. మళ్లా కొత్తే?

అవునుగాని యీలాంటి శృంగారపద్యం శార్దూలంలో వ్రాసేడేం చప్మా కవి చంపకమాల వ్రాయకా? పూర్వకవులకు అనుభవంయెక్కడిదీ? యేదో వర్ణించేం అంటే వర్ణించేరు కాని—

"కొమ్మగా దిది బంగారుబొమ్మ గాని
యింతి గా దిది జాజిపూబంతి గాని
కలికి గా దిది మరునిపూములికి గాని
భామగా దిది లావణ్యసీమ గాని"

యిదేంవిటి యీవర్ణన? బ్యూటీ(beauty)ని వర్ణించేటప్పుడు కొమ్మ గాదు, బొమ్మ కాదు. అనడం — మీందే ప్రాంరమూ అంటే ఫలానాప్రారని చెప్పకుండానూ, అప్రారు కాదూ యీప్రారు కాదూ అనడం యేంవిటి? — 'యింతి కాదిది.' అనేస్తూవున్నాడు. వక యింతినే వర్ణిస్తూ యింతి కాదే ననేస్తేయూ, యికనేం వుందీ. వర్ణన? యిప్పటి వాళ్ళయితే యీలాగా వర్ణిస్తారు? (ఆలోచించి) అవునుగాని కొమ్మ గిమ్మ యెందుకూ రంభ వూర్వసి వ్రాటుకు కంపేరిజన్సు (Comparisons)కి? ఐతే నేం 'లోకోభిన్నరుచిః' అన్నాడు. నాలాంటి మోడరన్సు (moderans)కి పూర్వ కవిత్వం- పూర్వపు మనుష్యులూ పూర్వపు ఫేషన్లూ రుచిస్తాయి? యెంతమాత్రం రుచించవు. ఫర్ యిన్‌స్టెన్సు (For instance) చింతామణిలో వక పద్యం చదివి దానికీ మీద్దానికీ టాలీ (tally) వేద్దాం—

"రెప్పలు వాల్పకుండిన, ధరిత్రిని బాదము లంటకుండినన్
దప్పక రంభయో మరి ఘృతాచియొ మేనకయో యటంచు నీ
కప్పురగంధిపల్క భ్రమ కల్గకపోవునె యాలకింపలే
దిప్పురమందె యిట్టి జలజేక్షణ యున్నదటంచు నెన్నడున్."

యిది యెంత సింపిల్ (simple) గా వుంది. (ఆలోచించి) మా బాగుంది. పిల్లొచ్చి గుడ్డు నెక్కిరించిందన్నట్టు పెద్దపెద్ద కవీశ్వరులనే క్రిటిసైజ్ (Criticise) చేస్తూన్నాం—అయితే నేం? అంత హెడ్ (head) లేదేంవిటి మనకు? క్రిటిసిజమ్సు (Criticisoms)

వ్రాస్తూవున్న వాళ్లు మనకన్నా యేం యెక్కువ యేడ్చేరూ? సరేకానీ- రాజామణి సంగతి యేవిటి? ప్రతిరోజూ లంజె చంపేస్తూవుంది- తీసుకుపోమ్మని. నే నేదో డబ్బు ఖాతరు లేనట్టు మాట్లాడి యేభై వేలు కమలం కాకేసి పోయిందనగానె ఆలకకు మిగతా యేభై వేలు యిది దొబ్బాలని గంపెడు ఆశతో వుంది. పోనీ ప్రయాణం చేసి తీసుకుపోతానంటె సాని ముండ- యీ వేళ నాతో వుంటాది- రేపు మరొకరుతో పోతాది. వాళ్ళకు డబ్బే మొగుడూ. యీ వెదవల్ని నమ్మమని యెవడు చెప్పేడు? అదీగాక యెవరన్నా విన్నారంటె యేం వంటారు? దంగాముండను తీసుకవచ్చేరు. వెంకటేశంగారు అని అందరూ నవ్వేస్తారు. 'అనువాడిభార్య అందరకు వదన' అన్నట్టు సానందంటే అందరకు అనువే! యిళ్ళ వ్రూళ్లో మరి వుండలేం- యీకనకాన్ని తీసుకపోతేనో? యెవరైనా నోరు యెత్తుతారూ? యెవ్వరూ యెత్తరు. యెత్తరు సరేకదా నన్ను యెంతో రెస్పెక్ట్ (respect) గా చూస్తారు. రెస్పెక్టు (Respect) మాట అటుణ్ణి. యెంత హేపీనెస్ (happiness) అందులోకీ కనకంలాంటివాళ్ళతో పొందంటే మరి చెప్పేదేం విటి? అంచేతనే అనుభవశాలి వెంకటపతి—

'చ. తలప కులాంగనారతి సుఖప్రద మేమిసుఖంబు వేశ్యతో
గలయుట ద్రవ్యహానికిని కారణ మింతియె సందుగొందు యిం
తులయెడ పొందులన్న నతిదూష్యమగు స్వహుయత్న లభ్యతఁ
దలకొను నన్యభామలరతంబె రతంబు జగన్నుతంబుగన్."

అని వ్రాసేడు.

సరే యిహ రాజామణి సంగతి తేలిపోయింది. యేం తేలింది? అంటే యెప్పటికైనా టోపీ వెయ్యడంవే కాని, యంత

మాత్రిం తీసుక పోకూడదని—లెటజ్ థిఙ్క్ ఆఫ్ కనకమ్ (Let us think of kanakam) యిళ యీవిడ సంగతి యేం వి తేలిందయ్యా?—తేలేదేంవిటి? గ్రివుంటు ప్రిపేర్ (ground prepare) అయింది. యిళ పోల్సు (poles) పాతేసి అమాంతంగా ఫుట్-బాల్ (Foot- ball) ఆడ్డయ్యడంవే! తరువాయి. గాని కొంచెం మనస్సులో అనుమానంగావుంది. యీకనకం? యింతసంసారం యీహెూదా గల మొగుణ్ణి విడచిపెట్టి నాతో వెళ్ళిపోవస్తాదా? అని—. రాకేం? ప్రితిరోజూ బాతాఖానీలో—మధ్య మధ్య చిరునవ్వ్వు నాహిస్టరీ (history) చెబుతూ వున్నప్పు ఆ ఛేంజస్ ఆఫ్ కాంప్లిక్షను (changes of complexion) న్నూ చిన్నచిన్నహాస్యాలూ యివన్నీ లౌ సిగ్నల్సు (love signals) కాకపోతే మరేంవిటి ?

"చెలువపుదేటలే నగవు చేతను భావముచేత సిగ్గుచే
నలువగు లీలచేత సుగుణంబులచేఁ గడగంటిచూపుచేఁ
గలహముచేత లిందలకు కందువుమాటలచే నసూయచే
బెలుచన నింతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్."

అన్నట్టూ యీలా సిగ్నల్స్ (signals) ద్వారా కాకపోతే రాజామణిలాగు ప్లెయిన్ (plain) గా చెప్పేస్తుందా? యివన్నీ యెందుకూ మొన్న లక్ష్మివారంనాడూ మేం, యిద్దరం మాట్లాడుతూవుంటే పంతులు వచ్చి తలుపు తట్టగానే రింగ్ (ring) యిచ్చి పెరటిదార్ని పంపేసింది కాదూ? అదొక్క ఇన్సిడెంటు (incident) చాలదూ నా పోకెట్ (pocket) లో పడ్డాదని యెసర్టయిన్ (ascertain) చేయడానికీ? కాని బుచ్చెమ్మలాగు కాక యీవెడ కొంచెం పెంకిదే?—పట్టెటూరిమనిషైనా కొంచెం పట్నం సహవాసం వుంది కాబట్టి

కాస్త పెంకితనం వేస్తుంది. బొత్తిగా పల్లెటూళ్ళవాళ్లైతే నేనే కాదు—బ్రిహ్మదేవుడు చెప్పినా వినరు. వాళ్ళని కాప్ (cap) చేసేసరికి బ్రహ్మాండం మునుగుతుంది. యిఖ సిటీసు (cities)లో వాళ్లైతేనా మరిచెప్పేదేంవిటుంది—వన్ లెటర్ విల్ డు—(one letter will do) అంతా సెటిల్ (settle) అయిపోతాది. యీ కేసా? రెండింటికి చెడ్డ రేవడి. అంచేత కొంచెం డిఫికల్టి ఫీల్ (difficulty feel) అవుతున్నాం.

సరే యింకొకటి ఆలోచించాలి. యీలా ఫామిలి గరల్స (family girls)ని తీసుకపోతే పాపంకాదా అని? (ఆలో చించి) కాదనేద్దాం. కీడెంచి మేలెంచమన్నాడు — లెటజ్ ఆర్యూ విదిన్ అవర్సెల్వ్స్ (Let us argue within-ourselves) నైవాళ్ళలో ఆలోచించేంవంటే పరేల్ళని కొంకిజెల్లా తీస్తారు. యీకనకంలాంటి యంగ్ గరల్స ఆఫ్ సెలిస్టియల్ బ్యూటీ (young girls of celestial beauty) లని, డబ్బుకిచూచి, ఓల్డ్ రాస్కల్సు (old rascals) కి యిచ్చి వేయడం తప్పు కాదా? తప్పే. అయితే యెవరిది తప్పు? పిల్లనుయిచ్చేవాళ్ళదా పుచ్చుకొనేవాళ్ళదా? (ఆలోచించి) దిస్ క్వశ్చన్ యీజ్ సమ్వట్ డిఫికల్టు (This question is somewhat difficult) ఆలోచించుదాం. యీలాంటివి డ్రామాకంపెనీలవాళ్ళకు బాగా తెలుస్తావి. సరే వాళ్ళని అడిగేదేంవిటి? వాళ్ళకున్నబుద్ధి మనకు లేదూ? యిచ్చేవాళ్ళదే తప్పని తోస్తుంది. పదివందలో పన్నెండువందలో పుచ్చుకొని, కన్నుతెరవని చిన్నపిల్లల్ని యేడైభైయ్యో యెనభైయ్యో పడి ముసలివాళ్ళకు యిచ్చివేస్తూవున్నారు. అంచేత యిచ్చే స్కౌండ్రిల్స (scoundrels) దే తప్పు. ఆలా అని

పెళ్ళాడేవాళ్ళకిమాత్రిం వొప్పేంవిటి? వాళ్ళదీ తప్పేను—
అన్నిసత్వాలు వదలిపోయి కాటికి కాళ్ళు చాచుకొన్నవాళ్ళ
కెందుకూ యంగ్ గరల్సు (young girls) సూ? సొమ్ముందని
కావరంచేత యెన్నివందలైనా పారేసి, యెవత్తునో కాకుండ
మంచి బ్యూటిఫుల్ ఫిగర్ (beautiful figure) ని యెంచుకుం
టారు! కాళ్లుపట్టించుకొనేందుకు బ్యూటీ (beauty) ని యెం
చడం యెందుకో రాస్కల్స్? (rascals)? ఎ డాగ్ యిన్
ది స్టేబిల్—(A dog in the stable) గుఱ్ఱపుసాలలో కుక్క,
గడ్డి తాను తిననూ తినదు గుఱ్ఱానికి తిననివ్వదూ అన్నట్లు—
అంచేత యేం తేలిందయ్యా? యిద్దరిదీ తప్పే. పిల్లనికూడా
యీలిస్టు (list) లో చేరుద్దాం అంటే—పూర్ గరల్స్ (poor
girls) వాళ్లకేం తెలుస్తుంది? పెళ్ళినాటికి వాళ్ళకు వరల్డీ
నాలడ్జి (worldy knowledge) వుండదు. యేజ్ (age) వచ్చి
నతరువాత, అప్పుడు మనస్సులో విచారించుకొంటారు. యేం
వనగలరు పాపం? మనస్సులో యేం ఆలోచన్లువున్నా పైకి
అన్లేక గుక్కిళ్ళు మింగుతూ వూరుకుంటారు. లెట్ అస్ యక్స్
క్లూడ్ దెమ్ ఫర్ ది ప్రిజంటు. (Let us exclude them for
the presant). పూర్ క్రీచర్స్! (Poor creatures) యీ
లాంటివాళ్ళని చూస్తే కనకరం వేస్తుంది—

ఐతే యిప్పటికి తప్పులు ఆరోపణ అయింది. యెవ్రి క్రైమ్ విల్ బి
ఫాలోడ్ బై ఎ పనిష్మెంటు (Every crine will be follow-
ed by a punishment) యిభు వీళ్ళకేం పనిష్మెంటు
(punishment) అయూ? ఉభయ పార్టీసు (parties) కు కా
మన్ (Common) గా వుండాలి. బాగుంది జడ్జీస్ (judges)
పడే అవస్థలో పడ్డాం- (ఆలోచించి) ఆ చిన్నదాన్ని మెల్లగా

బుట్టలోవేసి చక్కా మొత్తుకపోవడంవే? అప్పుడు సొమ్ము యిచ్చి పిల్లను కొనుక్కున్నవాళ్ళు- సొమ్ము పుచ్చుకొని పిల్లను అమ్మినవాళ్లు- ముఖం ముడిచి ముడుక్కుల్లో పెట్టుకుని ముక్కుపోతారు. యిరుగు పొరుగువాళ్ళకైనా తెలుస్తుందేమో అని, వాళ్ళలో వాళ్ళే కుళ్లి సస్తారు? వెధవలు- యీతీర్పుకు హైకోర్టు (High court) కు వెళ్ళినా అపీలులేదు.

ఆలా చేస్తేనంటే, గాడ్ (god) కూడా మనయందు ప్లీజు (please) అవుతాడు. ప్లీజు (please) అయి మనకు చేసిన ప్రత్యుపకారం యేమిటనూ? కనకం, కాకుండా కనకం వంటిమీదవున్న నూరుతులాలు బంగారం, అప్పులవరకి హాంపంతులు కొత్తగా కొని స్త్రీధనం క్రింద కనకంపేర రిజస్టరీ చేయించిన పాతిక యెకరాల పల్లం. ఆప్పైని కొన్నాళ్లకి శాంతంగా బ్యూటిఫుల్ ఎండ్ రాబస్టు (beautiful and robbest) సన్యా — అది చాలదూ నాలాంటి అల్ప సంతోషికి?

సరే యిఖ సారాంశం తేలిపోయింది. అయ్యో పాపంకదా అని మా పస్తాయిస్తూవుండేవాణ్ణి. యిప్పుడవన్నీ అబలిష్ (abolish) ఐపోయేవి. (అని తలుపు యిరుకుద్వారా చూచి, నాలిక కరచుకొని) అయ్యో పంతులు లేడనుకొని, గట్టిగా మాట్లాడేశాను. విన్నాడేంవిటిచస్మా? విన్నాడంటే తంటా వచ్చిందనమాట! (మళ్లా చూచి) పాగా చుట్టుకుంటూవున్నాడు. ఆఫీసు (Office) కు పోతాడు కాబోసు. యిదే సమయం — లోపలికి వెళ్దాం.

'అయ్యా పంతులుగారూ' (అని తలుపు తట్టును.) (బంట్రోతు తలుపుతీయును. వెంకటేశం నమస్కరించును.)

పం — యేమండీ యిప్పుడు వచ్చేరూ?

వెం—యేంవీ లేదండి. తమ శెలవుపుచ్చుకొని యింటికి వెళ్ళిపో తలం పుగా వున్నాను. వచ్చి మూడు మాసాలైంది. నేను ఫామిలీ (Family) వొదిలి. మావాళ్ళని కాస్తచూసి మళ్ళా వస్తాను.

పం—సరే వెళ్లండి. వెళ్ళి వేగం పదిరోజుల్లో రండి. అప్పటికి యే దైనా ఖాళీ వస్తుంది.

వెం—(తనలో) యిన్నాళ్లు గంటలు మీద తిప్పి ఆఖర్కి పొమ్మనే శావూ? కానీ నీపొగరుం అణగిస్తాను వుండు. (పైకి) సార్ (sir) యీ టెన్ డేస్ (ten days) కు వెళ్ళీ రావడం ట్రెయిన్ చార్జస్ (train charges) కు ఫిఫ్టీ రుపీస్ (Fifty rupees) ఐపోతావి అంచేత యీ పదిరోజులూ యిక్కడే వుంటే?

కనక—వుండండి. యేదైనా పని యిస్తారు, పంతులుగారు. వెళ్ళిపో కండి.

పం—నీకెందుకు పో వంటింట్లోకి. ఆడదానికి పనీ పాట్లు సంగతులు యెందుకూ? వెంకటరత్నంగారూ మీరు వెళ్ళండి. యింత వేగరం పనికాదు. యిక మీరుంటే సొమ్ము దండుగే కాని మరేం కార్యం లేదు. యింత వేగరం ఖాళీలు కూడా రావు. వచ్చే ట్లు కానరాదు కూడాను.

(మాట్లాడుతూ నిష్క్రమింతురు.)



# కాంతాపహరణము

## షష్ఠాంకము.



### ప్రథమరంగము.

స్థలము:—అప్పలనరశింహాం యిల్లు. కనకలక్ష్మి తలుపు తీసుకొని నిలువబడివుండును.

[ప్రవేశము:—వెంకటేశం]

కన—నిజంగా వెళ్ళిపోతారేంవిటి?

వెం—అబ్బే—యిప్పుడే వెళ్లిపోతానూ? నామనస్సులో వక కోర్కె వుంది. అది నెరవేరాలీ, యిక్కడనుంచి బిషాణా యెత్తి వెయ్యాలి.

కన—ఆ కోర్కె యేంవిటో నాకు చెప్పరూ?

వెం—మీతో చెప్పవలసినది కాదు. యిప్పుడు వదలెయ్యండి వెళ్ళిపోవాల. అర్జంటు (urgent) పని వుంది. "నిన్న సాయంకాలం వస్తానని చెప్పేనూ. వెళ్ళలేదూ యీవేళయైన వక్కసారి వెళ్లి కనబడి వచ్చేదాం" అని యీలా వచ్చేను.

కన్న—మీ కోసం నిన్నను చూచి చూచి కళ్ళు కాయలుకాచేవి. యేంరాలేదూ?

వెం—నిన్నను రావాలనే అనుకున్నాను, గాని నా ఫ్రెండ్సు (friends) యేదో బీచ్ (beach) ని మీటింగు వుందని నన్ను తీసుకపొయ్యేరు.

కన—యేఁవి టౌమీటింగు. గాంది మీటింగో ?

వెం—అబ్బే అదికాదు. మరోహటి. దానికి నేషనల్ మీటింగు (national meeting) అంటారు.

కన—అనగా—

వెంక—అనగా—మీకు చెబితే తెలుస్తుందో తెలియదో ?

కన—తెలుస్తుంది చెప్పండి.

వెం—ఐతే చెబుతాను. నేషనల్ (national) అనేది లాటిన్ (latin) మాట. దానికి సరియైన తెనుగు అర్ధం సాధారణంగా యెవరూ చెప్పలేరు. చెప్పినా మీలాంటివాళ్ళకు తెలియదు. అయితే యేం చెయ్యాలి ? తెలియదుకదా అని వూరుకోంటే కాదు. పనసపండు తొక్కవలచి తియ్యాని తొన్లు తినిపించినట్లు అర్ధంతీసి, దాని సారాంశం మీకు చెప్పాలి.

కన—(నవ్వి) బురదపనస నాకు యిష్టంలేదు. ఖర్జూరం పనసయితే చాల యిష్టం—

వెం—నాకూ అదే యిష్టం. చూచేరా అండి మన మనస్సులు కలిసేవి కాబట్టి యిద్దరికీ వకవస్తువుమీదనే అపేక్షవుంది యేమంటారు ?

కన—(వూరకుండును.)

వెం—సరే వినండి- లోకంలో మేరేజస్ (marriages) అనగా పెళ్ళిళ్ళు మహా అన్యాయంగా జరుగుతూవున్నావి. లోకజ్ఞానంలేని చిన్నపిల్లలను, డబ్బుకాసించి తల్లిదండ్రులు, ముసలివాళ్ళకు అంటకడుతూ వున్నారు. ఇది అన్యాయం అంటారా ? కాదంటారా ? మొదట చెప్పండి.

కన—యేమో నాకు తెలియదు.

వెం—ఆలా అంటే యేలాగు? మీతలిదండ్రిల సంగతని కాబోలు బిడియంపడుతూవున్నారు. లోకం సంగతి చెబుతూవున్నాను.

కన—అన్యాయం వేనూ—

వెం.—దట్ యీజ్ గుడ్ (That is good)—పిల్లని యిచ్చేసేం, అన్నవస్త్రానికి లోటులేదన్నమాటేగాని, వాళ్ళ మనస్సులు యేలా చిదిగివుంటాయో?—యెంత వుసురుమంటారో? తల్లిదండ్రిలకు తెలియకుండా వున్ని.

కన—అవును యిదివరకే యీలాంటి మీటింగు లయేవే!

వెం—పేషన్సు ప్లీజ్ (patience please) చివర టా ఆలకించండి-ఆలాంటి మీటింగులు చేసేరు. తల్లిదండ్రులుని పిలచి "వెదవల్లారా తప్పుసుమండీ ఆలాచేస్తే పాపం- వుసూరుమంటారు. ఆడబొట్టె వుసురుమంటె అమగంట మాసిపోతారూ" అని చెప్పేరు. ముసలివాళ్ళని పిలచి "కాటికి కాళ్లుచాచుకొన్న వాళ్లు కృష్ణా రామా అని కూర్చోకుండా మీ కెందుకు పెళ్ళి" అని చెప్పేరుకాని వాళ్లూవినలేదు. వీళ్ళూ వినలేదు. ఇప్పుడేం చేసేరంటే—ఎ కమిటి (A committee) వక సభ నిర్మాణించి, ఆలా పెళ్ళిచేసుకొనేవాళ్ళకు, పిల్లనిచ్చినవాళ్ళకు సిగ్గు వచ్చేటట్టు ఆపిల్లని యెవరైనా యెత్తుకుపోతే బాగావుంటుందని వక రిజల్యూషను (resolution) పేసు చేసేరు.

కన—(నవ్వి) బాగావుంది. యెప్పుడూ నవ్వేన కబుర్లే చెబుతారు.

వెం—నవ్వుతాలికి కాదూ, చెప్పేది. నిజంగా జరిగింది చెబుతూ వున్నాను.

కన—ఆలాగైతేనూ, పెళ్ళాడిన వాళ్ళు వప్పుకొంటారూ?

వెం—వప్పుకునే దేవింటి? వాళ్ళముఖం- యేం చేస్తారు? యేడుస్తూవూరుకొంటారు. యింటికూ వాళ్ళకు ముందుగా తెలుస్తే

కదూ? ఆలా తెలుస్తే యింటిలో భార్యాలను కట్టుదిట్టాలుచేసి గదుల్లో పెట్టి తాళాలు వేశాస్తారని, కాన్ఫిడెంషియల్ (confindetiai) అనగా రహస్యంగా మీటింగు చేశారు.

కన—ఆలాచేస్తేనూ, పాపం కాదూ ?

వెం—పాపంవా ? యెంతమాత్రం కాదు. యేలాగంటారా ? వినండి శాస్త్రంలో యేం వుందీ ?

"చ. మగని నతిక్రమించుటలు మానినికిం దగదంటి వొప్పితిన్
మగడు మగండనంగ మదిమక్కువ యెవ్వనియందొ కంటికిం
పగు నత డెవ్వడో యతడె, యాతని కాదని యన్యు గూడినన్
తగదిది కాముకీజనుల ధర్మము మర్మము నే నెరుంగుదున్".

యిది తారాశశాంకం అనే వక మహాప్రబంధంలో పతివ్రతా ఘట్టంలో వుంది. వకపతివ్రత అంటుది యేం వని—(మాళ్ళా చదువును.)

"మగడు మగండనంగ మదిమక్కువ యెవ్వనియందో కంటి కిం పగు నత డెవ్వడో యతడే" అని—అర్థం మీకు తెలసే వుంటుంది. ఆ ప్రబంధం వకసారి మీకు యిస్తాను. చదవండి. చదువుతే యింకా బాగా తెలుస్తుంది. చూచారా అండి దమయంతీస్వయంవరంకు, యింద్రుడు దేవేంద్రుడు వచ్చి పెళ్ళాడుమన్నారు. పెళ్ళాడుమంటే యేంవంది దమయంతి—"నాత్రికరణసుద్ధిగా నలుని వరించేనూ, కాబట్టి అతనినే పెళ్ళాడతాను. మిమ్మల్ని పెళ్ళాడనూ రన్ ఎవె సర్సు (run away sirs)" అంది. అయితే "నల్లగున్నాడూ యేలాగు పెళ్ళాడుతావు" అన్నారు. "నలుపు గిలుపు నైజాంతా నా యిష్టం" అనేసింది. చూచెరా ఐతే వకటి చెప్పండి మీకు చిన్నప్పుడు పెళ్ళిచేసేరా ? పెద్దప్పుడు పెళ్ళిచేసేరా ?

కన—చిన్నప్పుడే—

వెం—సే సో—(say so) అప్పుడు మీకు అనగా కామన్‌శెన్సు (comonsen es) అనగా లోకజ్ఞానం కొంచమైన వుందీ.

కన—నాకేం తెలుసురూ, అప్పటికీ.

వెం—సరే పెళ్లైంది. అన్నీ అయేవి. నిజంగా చెప్పండి. యిప్పుడు మీ మనస్సంతా పంతులుగారి మీదేవుందీ? నాతోడూ అబద్ధం ఆడుతే—

కన—(పూరకుండును.)

వెం—సైలెన్సు యీజ్ ఆఫ్ కన్‌సెంటు (silence is half consent) అన్నాడు. నో (no) యెంతమాత్రం వుండకు. యెందుకు వుంటుంది? పేరుకు తగినట్టూ లక్ష్మిలాగు యెంతో సొభగా వున్న మిమ్మల్ని యెవరు పెళ్ళిచేసుకోరు? యీముసలాయనే దొరకేడూ మీతలిదండ్రులకు. మరేం, సంబందాలూ రా లేదూ?

కన—రాకేం, వచ్చేవి మానాన్నగారు పన్నెండు వందలు రూపాయీలు తీసుకొని, యితనికి యిచ్చేసేరు.

వెం—దటీసు యిట్! (That is it!) చూసేరా మీరే అనేశారు. మీమనస్సు అతనిమీద లేనప్పుడు అతను మీభర్త యేలా అయేడు? యీలాంటి తర్జుమా వకసారి వచ్చి వకావిడ యేం వందో తెలుసునా.

ఉ. "నాధుడె బంధుమున్ గురవు నాధుడె మాతృసహోదరాప్తులు న్నాదుడె దైవముం ధనము నాధుడె మోక్షపదంబు, నాధుడే నాధుడె రక్షకుండు, భువి నారుల కెల్లను, గాన నామనో నాధుడ నీవు నీపదము నమ్మితి బ్రోవుము ప్రాణవల్లభా."

"మనోనాదుడ" వాలా అంటుంది. అనగా మనస్సుతో వరియించిన వాడే నాథుడని. చూచేరా యిందాక పద్యంలో కూడా ఆలాగే చెప్పేను. ఆల్. జాకాల్సు క్రై ఎలైక్ (All jacals cry alike) అన్నాను. ఆలాగే శాస్త్రాలన్నీ యీలాగే ఘోషిస్తూ వున్నావి. అంచేత ఆలా 'మనోనాథు' డికి మాయచేస్తే మాత్రం తప్పకుండా పాపం సంభవిస్తాది.

కన—ఐతే మీవుద్దేశం యేమిటి? మీతో వెళ్ళిపోరమ్మనా?

వెం—అబ్బే యెంతమాట? ఆలా డైరక్టు (direct) గా అనేస్తానూ? మీంటికి సంగతులూ, లోకంమీాది సంగతులు చెబుతూ వున్నాను. కాని-తప్పులు పట్టకండేం?—

కన—చా—తప్పుకోసం కాదు. నాకు చదువుకున్న వాళ్ళను చూస్తే చాల సర్దా. అంచేత మిమ్మల్ని చూచిన కానుండీ నామనస్సు చాల సంతోషంగా వుంది.

(అని కాస్త బుజ్జవంచి సిగ్గునభినయించును)

వెం—(సంతోషంతో మెల్లగా) వడ్డాదిరా యెలుక పడ్డాదిరా (అని రాగవరుసతో పాడి కనకంవైపు తిరగి)

నాచమవేం చదువు? మీపంతులుగారు పెద్దచదువు చదివేరూ, పెద్దవుద్యోగం చేస్తూవున్నారు.

కన—మా పంతులుగారు పతివ్రతల కథలపుస్తకం చదవమనడంతప్ప యెప్పుడూ యీలాంటి సంగతులు చెప్పరు. ఆఫీసుపనే రాత్రస్త్య పగళ్ళూ.

వెం—తీస్తురూ- యేం సుఖం. యిప్పుడు మీారున్న పొజిషన్ (position) లో అనగా స్థితిలో మా సిస్టర్ (sister) గానే వున్నట్లయితే వెంటనే యెవరినైనా నా ఫ్రెండ్సు (friends) లో వకర్ని—దాసియిష్టంవచ్చినవాళ్ళతో సారె చీరా పెట్టి

మరీ పంపేమును. ఓల్డు ఫెలోస్ (old fellows) ముసలివాళ్ళకు, యీలాంటి రిఫారమ్సు (reforms) సంగతి యేవీ తెలియదు. యేం చేసినా మనలాంటి యంగ్ ఫెలోస్ (young fellows) అనగా యవ్వనులు చెయ్యాలి. "ఘటం చించాత్ పఠమ్ సించాత్ పురుషః ప్రిపేర్యతే" అన్నాడు. అనగా కుండ బద్దలుగొట్టో బట్టచించేసో మానవుడు కీర్తిపొందాలయూ అంటూన్నాడు. చూచేరా అండీ యెవరైనా మనలాంటివాళ్లు యీలా మీటింగు (meeting) లో రిజల్యూషను (resolution) ప్రకారం నకరు చేసేరంటే తరతరాలు వాళ్ళ కీర్తి వుండిపోతుంది. యిప్పుడు ముంగురు నూతనంగా బయలుదేరిన రిఫార్మర్సు (reformers) యీలా వీళ్లు యీ ఇన్ఫెంటు మేరేజస్ (infant marriages) అనగా బాల్యవివాహాల క్వెస్చను ప్రాక్టికల్ (question practical) గా సాల్వు (solve) చేసేరూ. చాల గొప్పవాళ్లాగ వున్నారు. వీళ్లిద్దర్నీ పువ్వుల్లో పెట్టి పూజచెయ్యాలీ అని వాళ్ళిద్దరి ఫొటోస్ (photoes) ని దేవుని గదిలో పెట్టి పూజ చేస్తూ వుంటారు.

యీలాటి సంగతులు ముసలివాళ్ళకు తెలుస్తాయి. యెంతమాత్రం తెలియవు. తెలియదుకదా అని దయతల్చి చెప్పేం అంటే కళ్లు మూచుకొంటారు.

కన—ఆలా అనకండీ—వాళ్ళేం చేస్తారు. మన ప్రారబ్ధానికి ?

వెం—దట్ యీజ్ మిస్టేక్! (That is mistake!) ప్రారబ్ధం ఖర్మం అని వూరకుంటే కాదు. దానికి ప్రొటెస్టు (protest) అనగా సృష్టికి ప్రతిసృష్టి మోస్తరే బ్రహ్మ—"ఆలా ముసలాయనకే పెళ్ళాడూ—మీరరాని దుఃఖం అనుభవించూ" అని నొసట వ్రాస్తే మనం అదిచెరిపేసి యీలా "మంచి

యంగ్ బ్యూటిఫుల్ అండ్ క్లవరు చాప్ (young beautiful and clever chap) అనగా అందమైనా, (మెల్లగా) నాలాంటి- (గట్టిగా) తెలివైనా, యవ్వనంలోవున్నా కుఱ్ఱవానిని పెళ్లాడి సర్వసుఖాలూ అనభవించూ" అని గట్టిగా దిద్దయ్యాలి.

కన—(నవ్వుతూ) యేలాగూ ?

వెం—మీ యిష్టం వచ్చినవాళ్ళతో మీఆస్తి పట్టుకొని మరీ వెళ్ళి పోవడంవే—

కన—యెంత మాట ?

వెం—ఆ—ఆగండి. ఆలా లేచి వెళ్ళిపోతే యీ దుఃఖంపోయి సుఖం వస్తుందా లేదా ? యేం వూరుకోరు ?

కన—(నవ్వుతూ) వూరేకున్నాను—

వెం—వూరుకోవడంవే కాదు. వప్పేసుకుంటారు. మరోమాట- యీలా చెబుతూ వున్నానని నాతో వెళ్ళిపోరమ్మని టోపీ వేస్తూన్నా ననకోవద్దు. దట్ యీజ్ లెఫ్టు టు యువర్ డిస్క్రిషన్ (That is left to your discrition )—నాతో యెంతమాత్రం రావద్దు. మీయిష్టం మీ అంతరాత్మ యెవరి మీదవుందో వాళ్ళతో—

కన—అమ్మో యెంతమాట వస్తే మీతోనే వస్తాను. మరి యెవరి తోనూ వెళ్ళను.

వెం—ఆలా పైపైని అనేస్తేకాదూ. "నామనస్సు నా సోల్ లైకింగు (sole liking) అనగా అంతరాత్మ మీయందే వుంది. వుంది కాబట్టి మీరే నాభర్త మీతో లేచిపోవస్తానూ. గాన నన్ను అనుగ్రహించి మీతో తీసుకపోవాలి" అని అనాల.

కన—(సిగ్గుతో) అన్నట్టే లెండి—

వెం—ఆలా కాదు. ఆలా అంటే నేనూ మరొకటనాలి.

కన —(సిగ్గుతో తాపిగా అనును.) నామనస్సు మీస్వాధీనం ఐంది. నేను మీతో వెళ్ళిపోవస్తాను. నేటినుండి మీరే నా—

వెం—భర్త! అనండి తప్పులేదూ.

కన—(నవ్వుతూ) ఆ- భర్త. పంతులుగారు మా తాత. నన్నునుగ్రహించి తీసుకపోవాలి. (తొందరగా) మీరేంవిటంటారో అనండి- చూదాం.

వెం—యీవేళనుండి నీవు నా వైఫ్ (wife) వు. ఐ డోంటు మేరి ఎగైను (I don't marry again) పెళ్ళి చేసుకోను. యీవేళ మెయిల్ (mail) లో ఖరగ్పూర్ (kharagpur) తీసుకపోతానూ ఆడినమాట తప్పితే ఆకాశం విరిగి అమాంతంగా మీద పడాలి.

కన—(నవ్వుతూ) నిజంవే? నాతోడూ?

వెం—వట్టు. నీతోడే.

కన—అయితే మరి సర్దుకోనా?

వెం—నాట్ ది స్లైటియస్టు హెసిటేషను(Not the slightiest hesitation) అనగా రవ్వంతైనా ఆలస్యంవద్దని. వేగరం సర్దుకో- నగలూ నాణేలూ వున్నంతమట్టుకూ ట్రింకులో వెయ్. గిన్నె చెంబులు పంతులుగారికోసం వదలెయ్. అక్కడ మనం కొనుక్కుందాం. పాపం లేహ్యాండబ్బీమాత్రం అతనికివదలై. నీకిచ్చిన పతివ్రతల కథలపుస్తకం మంచంమీదపడై. నేను రైలు వేళకు పెరటిదార్ని రిక్షా తీసుకవస్తాను. రెడీ (ready) గా వుండాలి. ఆ- మర్చిపోయ్యేను. మొన్న నీపేర రిజస్టరీ అయిన డాక్యుమెంటు (document) మర్చి పోకు-

కన—నా పెట్టిలోనే వుంది లెండి —

వెం—దటీజ్ గుడ్ (That is good) సరే యేదీ వహ ట్రియల్ కిస్ (trial kiss) (అని షేకెండుచేసి, ముద్దుపెట్టుకొని, పైకి వచ్చి) తలుపు వేసెయ్. (యెవరో వస్తూన్నారు)

కన—సరిగా వేళకు రావడం మర్చిపోవద్దూ (అని తలుపు వేసుకొని లోనికి పోవును.)

వెం—అన్నా యిప్పటికి నా ట్రియల్సు (trials) అన్నీ త్రిఫోర్తుసు కంప్లీటు (three- forths complete) అయ్యేవి. యిఖ వున్నది కూడా యీ వేళ పూర్తిచేసి, యీ ప్యూరికో సలాం పెట్టి వుడాయించాలి. (ఆలోచించి) గాడిదకొడుకు, పనికోసం రేపు యెల్లుండని మా తిప్పి చంపేశు. ఆఖరుకు ఆయింతా పొమ్మనేశాడు. వాడికి తగినట్టూ చేసేను. యిహ పనీవద్దూ పాటూ వద్దూ. నాకు పనెందుకు? లోకంలో అమూల్యమైన బ్యూటిఫుల్ యంగ్ గరల్ విత్ యనార్మస్ మని (beautiful young girl with enormous money) చిక్కినప్పుడు పనితో మనకేం పనుంది? వక ఫరం స్టార్టు (firm start) చేసి పది మందికి నేనే పనియిస్తాను.

యిది యీలావుణ్ణి యిహ హోటేలు రంగయ్య సంగతి ఆలోచించాల. వాడికి బోలెడుసొమ్ము యివ్వాల. యిప్పుడు నాదగ్గర దమ్మిడీ లేదు. యీవాళ వుడాయించాలకదా? యేలా అవుతుంది సొమ్ము యివ్వడం? కనకాన్ని అడుగుదాం అంటే మించా వచ్చేసేను. మళ్లా వెళ్తే బాగుండదు. ప్రెస్టేజి (prestage) పోతుంది. వెళ్ళి పంపిస్తానంటే కుక్కలాగు మొరుగు తాడు స్కౌండ్రల్ (scoundrel). అంచేత వీడితోనూ చెప్పకుండానే వుడాయించాల. (ఆలోచించి) కాని యేం అదృష్టం నాది? నెవ్వర్ యక్స్పెక్టెడు సచ్ యె ఫార్చూన్ (Never expected

such a fortune) (నవ్వి) టు బర్డ్సు ఎట్ వన్ షాట్ (two birds at one shot) అంటారు దీనికే. యిక యీ నామెడ్రాసు ట్రిప్ (Madras trip) సంగతి జర్నల్సు (journals) లో పడుతుంది. యెక్కడున్నా మనం చదవక పోతామేమిటి?

(నిష్క్రమించును.)



# ద్వితీయ రంగము.

స్థలం:—రాజామణి యిల్లు.

[ప్రవేశము:—వెంకటేశం]

కనకలక్ష్మిని యేలాగో పోకెట్టు (pocket) లో వేసి, యీవేళే ప్రయాణం నిశ్చయించేం. యిక యిదొక్కత్తెవుంది- యీ రాస్కేల్ (rascal) ని అడ్డంగా మాడ్చెయ్యాలి. యిలా వకర్ని చేసేవంటే యీ వూర్లోవున్న ఫోర్ సెవన్సు (fou r sevens) అందరికీ బుద్ధి వస్తుంది. దీనిని తీసుకుపోతానని, ప్రయాణం చేసి—నగలు వంటిమీద మాదిట్టంగా వున్నావి వానిలో కొన్నిటితో కొన్నేంవిటి? వీలైనన్నిటితో—'అదికం అధికస్య ఫలం' అన్నాడు. స్టేషను (Station) తీసుకొనిపోయి, అక్కడ గోకుడుబెల్లం పెట్టి "ఓసే దెష్టముండా యెప్పుడూ యీలా నాలాంటి అమాయకుల్ని నాకుడుబెల్లం పెడుతాననే తలంపుతో వుండకూ, నీకు యింత ఆస్తివుందికదా? యింకా యెందుకే డబ్బుమీద కాప్యం? టోపీవేసినవాళ్ళని వేసినే వేసేవు- ప్రస్తుతం సెట్టిదగ్గర వేయి రూపాయీలు ఖరీదుగల చంద్రహారం కాటువేశావూ, యింకా వాడి ఆస్తిలో సగానికిహక్కుదారిణైనావూ, యీ మిడ్ వే (midway) ని నాకూ టోపీ వేసి, నాయాభై వేలు ఆస్తిమీద సిరికన్ను వేసి, నా మెడవిర్చి నాతో ప్రయాణం అయేవూ, కాని పూర్ (poor) క్రిచరా నీకన్న నేను అసాజ్జణ్ణి. యీలాగు యెవరికోసం గోతులు తవ్వకూ, తవ్వేవంటే ఆ గోతుల్లో నివ్వే పడుతావూ- రన్ ఎవె రాస్కేల్ (run away rascal)" అని సుద్ధక్షౌరం చేసి తన్ని తగలెయ్యాలి.

యీలాగు చేసేసరికి విన్నవాళ్ళంతా "అబ్బో వెంకటేశం పెద్ద రిఫార్మరులాగున్నాడూ, వీడికి సాన్లంటే పరమఅసహ్యాం మొంతమాత్రిం వీడు, ప్రోనాచ్ (pronautch) పార్టీలోవాడు కాడు." అని యెంతో గౌరవించి, నేను ట్రెయిన్ (train) లో సెకండు క్లాసు (2nd class) బండీలో ట్రావెల్ (travell) చేస్తూవుంటే ఆఫ్ కోర్సు విత్ కనకం—(Off course with Kanakam)—ప్రతిస్టేషన్ (station)కూ యాం (antinautch) పార్టీవాళ్ళందరూ, వందలు వందలు వచ్చి 'హాల్లో వెంకటేశం (Hollow Venkatesam) గారూ, మీలాంటి రిఫార్మర్ (reformer) ని, మే మెన్నడూ చూచియుండలేదూ—మీరు కేవలం, అవతారపురుషులూ; యెవరో రాజారాం మోహనరాయ్‌గారు పెద్ద రిఫార్మర్ (reformer) వుండేవారని విన్నాంగాని యిప్పుడు, కళ్ళారచూసేస్తూవున్నాం. మీరే వారు, వారే మీరు—దయయుంచి, వకసారి యిక్కడ దిగేరంటే అమాంతంగా బ్రహ్మరథం పట్టేస్తాం' అంటారు—అప్పుడు నే నేం అంటానూ ? ప్లీజ్ డోంటు ట్రబుల్ మి నవ్ సార్స్—(Please don't trouble me now sirs) యిప్పుడు నేను ఫామిలి (family) తో వెళ్ళుతూవున్నాను—నన్నేం బలవంతం పెట్టవద్దూ— మీరు ఆంటినాఛ్ anti-nautch) విషయమై మీటింగుస్ (meetings) మాత్రం మానవద్దూ; యింకా యీ మీటింగ్సు (meetings) కి యెడిషనల్,(additional) గా ప్రాక్టికల్ వర్కు (practical work)- అనగా అర్ధరాత్రిప్పుడు సానికొంపలుకు, మెల్లగా కన్నంవేసి, వాళ్ళ నగలూ నాణేలూ, బట్టలూ వీలైనంతమట్టుకు, కాజెయ్యడం—ఆపైని వాళ్ళు తలుపులు వేసుకుని, తంఘుకుంటే వీధి

కి పెరటికి గొళ్లేలుపెట్టి తాళాలు వేసెయ్యడం;- సంసార్లవీ ధుల్లో సాన్లకి వుండనివ్వకపోవడం. అలావున్నవాళ్ళ యిళ్ళ మీాద, రాళ్ళూ రప్పలూ విసరడం — మొదలైనవి చేస్తూ వుంటే యీా ప్రోనాచ్ (pronautch) పార్టీలలోవారు, "వీళ్లు తుంటరివెదవలులావున్నారూ, పోలీసు రిపోర్టు (police report) చేస్తే సరి" అని మీాకు డిస్కరేజి (discourage) చేస్తారు. అలాగు వాళ్ళు మీాకు డిస్కరేజి (discourage) చేసినకొద్దీ మీారు ధైర్యంగా వర్కు (work) చేస్తూవుంటేకొన్నాళ్ళకి మీారూ నాలాగే 'సర్ (sir) అని బిరుదు వహిస్తారూ' — అని చెబుతూవుంటె రెప్పలు వేయక, నావైపే చూస్తూ చెవులు నిక్క పెట్టి వింటారు- విని వూరుకుంటారూ? "సర్ వెంకటేశం గారు (sir Venkatesam garu) మీారు మాకోర్కె. తీర్చకుండానే వెళ్ళిపోతూవున్నారూ, వుయ్ ఆర్ వెరీ సారీ (we are very sorry) పోనీ చంద్రునికి నూలుపోగువలె యీాహారమైనా తీసుకోండి" అని మెడలో కర్పూర తావళం వేసి మంగళహారతియిస్తారు. అది తీసుకొని, "మళ్లా నా రిటరను (return) లో మీా కోర్కెలు నెరవేరుస్తానూ" అని చెప్పేసరికి అయింతా బండి కదిలేస్తుంది.

కనకం (kanakam) యిదంతాచూచి గాబరా అయిపోయి 'రాక రాక మాగొప్పవానితో వచ్చేనని సంతోషం పట్టలేక ఆ సెలూన్ (saloon) లోనే వకముద్దు పెట్టుకుంటాది — ముద్దుపెట్టుకుంటే నేను వూరుకుంటానూ ? అసలే పెంకివాణ్ణి. అమాంతంగా విండో (window) తలుపు వేసేసి మరీ ముద్దెట్టుకుంటాను !

యిహా యింతటితో యీ సెల్ఫు లెక్చరు ఆన్ డి. జీస్ (self lecture on d g s) చాలించి దీనియింట్లో ప్రవేశించుదాం. యెవరూ సరసున లేరుకదా ? ఐనా యీకిటికీసందునుండి చూదాం—లుక్ బిఫోర్ యు లీప్ (book before you leap) అన్నాడు అనుభవశాలి—(చూచి) ఆఁ— వెధవయెవడో వున్నాడోయ్! రాజామణి యేదో బేరం ఆడుతుంది. యిక్కడ నిలుచుండే విందాం. (అని తలుపుదగ్గర చెవులుపెట్టి ఆలకించుచుండును.)

(లోపల సంభాషణ.)

"రెండురుపాయ ?- మీరేపూచీపెట్టుకోండి"—

"మొదట సెటిలుచెయ్యకపోవడం నాద్దా దోసం. యిందా— మరొక రూపాయి మొత్తుకో. తలుపుతీసెయ్యి పోతాను."

వెం.—(చప్పున రోడ్డుమీదకు గెంతేసి) యీ తొత్తుకొడుకెవడో పోనీ—శాంతంగా వెళ్లాడు. కానీ యిక్కడ యీరాజామణి, చెత్తకుక్కలాగుంది. ధర్మసత్రివల్లాగు వచ్చి పొయ్యేవాళ్ళకు లెక్కలేదు. యేమాత్రం తక్కువదనుకున్నాను. యిదీ వక టిపికల్ (typical) సానే! తొత్తుకూతురు.

(తలుపు తట్టును.)

(రాజామణి తలుపు తీయును.)

వెం—యేం మై డియర్ (my dear) మణీ—యేం చేస్తూవున్నావ్.

రా—మీ పలుకు నమ్మనే కూడదూ- నిన్నటిదినం వస్తునని చెప్పినారు, వచ్చితిరా ?

వెం—రాకపోతేనేం ? యేం ప్రమాదం లేదు కాని—యీ వేళతో యిక్కడ నాపని ఐపోయింది. యీ రాత్రి తొమ్మిదిగంటల మెయిల్ (mail) లో వెళ్ళిపోతాను.

రాజా—యిప్పుడెంత మణి అయిందీ ?

వెం—యేడుగంటలు వేశారూ !

రాజా—నిండా బాగుంది ! యెనిమిదిన్నర బండికి పోతూ యేడో గంటకా నాకు వచ్చి చెప్పేదీ ?

వెం—యెప్పుడైతే నేం ? కాని—

రాజా—నిలవబడి మాటాడుతుండా రేం ? యెందుకో నిండా కోపంగా వుంది నామీద—

వెం—అబ్బే ! నీ మీద కోపంవే ? యెంతమాటా నామీదే కోపం తెచ్చుకోను, వకసంగతి చెబుతాను.

రాజా—యేమిటిదీ ?

వెం—యేమీ లేదూ కాని—యిన్నాళ్లె నిన్ను తీసుకపోతానని చెప్పేను కాని, యిప్పుడు నన్ను వదలెయ్యాలి. మళ్లావచ్చినప్పుడు తప్పక తీసుకుపోతాను.

రాజా—యీ మాదిరిగా చావుకబురు చల్లంగా చెబుతూవుండారా? చాల మేలుగా వుంది మీ మాట. (అని కన్నీరు తుడుచుకొనును)

వెం—(తనలో) తొత్తుకూతురు చచ్చినోళ్ళని జ్ఞాపకం తెచ్చుకొని, కంటనీరు పెడుతూవున్నది.

రాజా—(కొంగుతో తుడ్చుకొని) పోనీ లెండి. యింతియేనా ? మరేమి చేసురా ?

వెం—క్రియింగు ? డోంటు క్రై (crying ? dont cry) శుభమైన కార్యమప్పుడు యేడుస్తావు యేం ?

రాజా—యేడుస్తూ వున్నదాన్ని నవ్విస్తరూ.

వెం—పోనీ తీసుకు పోతాను గాని, చిన్న చిక్కు వకటి వుంది. (ఆలోచించి) సరే కాని, నేను చెప్పినట్లా నడుచుకొంటావా ?

రాజా—ఓ—సత్యంగా. నూతి నురుకుమన్నా నురుకుదును- యేమి టిది అదీ? చెప్పుదురూ.

వెం—మరేమీా లేదు. స్టేషను (station) వాళ్ళందరూ టిక్కట్టుకల క్టరు కానుండి, డి. టి. యస్ (D. T. S) వరకూ నాకు యింటి మేటు ఫ్రెండ్సు (friends) అనగా ప్రాణస్నేహితులు. అంచేత నీవు కాని షోకుగా తయారై నాతోవచ్చి నాప్రక్కను కూ ర్చున్నావంటే వాళ్ళందరూ అనుమానిస్తారు. నీకూ బాగుం డదు. నాకూ బాగుండదు. అంచేత పగటివేషాల్లాగు వేషం వేసి మరీ ప్రయాణం అవాలి.

యేవంటావ్ ? యిష్టంవేనా ?

రాజా—(నవ్వి) యిష్టమే గాని యేమి వేషంవేసేది ?

వెం—యేం వేషాలు వెయ్యడానికీ యేం తోచకుండా వున్నది. అన్నీ కష్టం వేనూ. రికగ్నైజు (recognise)- అనగా పోల్చేసేరంటే మొఖాలు ముడ్చుకోవాల. అంచేత నేను డాక్టరు (doctor) లాగు తయారౌతాను. నివ్వు మిడ్వైఫ్ (midwife) అనగా మంత్రసాని లాగు తయారవాలి. యేలాగంటా వేంవిటి ?— అనూ.

రాజా—యెట్లా తయారు అయ్యేదీ ?

వెం—యేలాగో చెబుతానుగాని ఫస్టు (first) సి యిది చెప్పు, నీవు వస్తానంటూవున్నావ్ కదా. యేంవి టేంవిటి పట్టుకుంటావు ?

రాజా—నా సామగ్రి అంతా పట్టుకుందును.

వెం—నో—డోంట్ వాంట్ (No—don't want). సామానుయిప్పు డేంవద్దు. మరొకసారి చూచుకోవచ్చు. బట్టలుకూడా యిప్పు డేం వద్దు- వట్టి తెల్లని బట్ట తప్ప. కమలం తాలూకూ, సిల్కు (silk) చీరెలు నిన్ను ముందినన్ని వున్నావి. నగలు మాత్రం,

మీాయింట్లో మెడిసిన్ చెస్టు (medicine chest) అనగా మందుల పెట్టెవుంది దాన్లో మెల్లగా పట్టించెయ్. అది తప్ప మరేం పట్టుకోవద్దు. నీ వంటీనికూడ యేం సరుకూ వద్దు.—కాళ్ళ పట్టీలు పెట్టె పట్టుకు. అంచేత యిక్కడ వదలై—లేకపోతే గొప్పికి యిచ్చై. యింటికి వెళ్ళగానే సేమ్యా పట్టీలు చేయిస్తాను. తెలసిందా? మరోకమారు చెప్పమంటావా?

రాజా—తెలసింది. అలాగే చేస్తును. గాని రెయిల్ కు నన్ను యెవరు యెత్తుకపోదురూ? మీారు వస్తురా యేమి?

వెం—కొంప మునుగుతుంది. నాకు అనేకం పన్లువున్నవి. నేను రాను. మీా గొప్పి వుందికాదూ? దాన్ని మెల్లగా తీసుకరా. తీసుకవచ్చి తర్డు క్లాస్ (Third class) టిక్కెట్లు అమ్ముతారూ—స్టేషన్ పెరటికాసే—అక్కడ ముసుగు వేసుకొని కూర్చోండి. అక్కడ జనం మాలోక్కటంగా వుంటారు. పెట్టి మాత్రం నేనొచ్చేవరకూ చాలా జాగ్రతగా చూస్తూవుండు. యెవరైనా వచ్చి 'మీారెవరంటే' 'నేను క్రిష్ణారావుస్ మిడ్ వైపు (Krishna Rao's midwife)' అని చెప్పి మొఖం దించెయ్.

రాజా—మంచి ఆలోచన్లా. (అని నవ్వును.)

(గుండు శబ్దము వినబడును.)

వెం—అదిగో గుండువేసేరు. యింకా అరగంట టైమ్ వుంది. నీవు ఆలస్యం చేస్తావేమో? నీవు వచ్చినా రాకపోయినా నేనుమాత్రం వక్కనిముషం వుండను. నీసాపాటు అయిందా?

రాజా—యిప్పుడ్దా నా? యేమమణికే అయిందీ.

వెం—నాదికూడా అయింది. ఐతే యింకేం- నేను పెట్టె సర్దేస్తాను. యిటుతీసుకురా—

రాజా—(పెట్టెయిచ్చి వొక్కొక్క సరుకు మెడనుతీసి, వెంకటేశంచేతికి యిచ్చుచుండను వెంకటేశం పెట్టిలోపెట్టి సర్దుతూయుండును.)

వెం—(తనలో) హౌ మచ్ జ్యూయలరీ ? (How much jewellery) (పైకి) యింతేనా ?

రాజా— యింకనూ పెద్దపెట్టిలో వుండావి.

(అనుచూ పెద్దపెట్టితీసి సరుకులు యిచ్చును)

వెం—(పెట్టిలో సర్ది) సరా ? (మెల్లగా) సుద్ధ ఘోరంవేనా ?

రాజా—సర్దా- అంతేను.

(వెంకటేశం—పెట్టె తాళం వేసి, చెవితాళం, తనజేబీలో పెట్టుకొని, లేచి—)

యిందా- పెట్టె. చాల బరువుగావుంది. జాగ్రత్త చప్పున బయల్ దేరాలి—

రాజా—అబ్బా ! యెన్నిసార్లు చెప్పేది ! సరేగాని నేనిప్పుడెట్లా వుండానూ ?

వెం—నిజంగా క్రిస్టియన్ (Christian) దాన్లా గున్నావు—యేదీ పార్టింగు (parting) కిస్సూ- అనగా ముద్దూ.

రాజా—అబ్బా నేనివ్వను. మొదట తీసుకుపోనని యెందుకుచెప్పాలి?

వెం--పోనీకాని- మేక్ హేస్టు (make haste) శీఘ్రం బయలుదేరు. నేను స్టేషన్ (station) వద్ద కలుస్తాను. నేను చెప్పిన స్థలం కదల వద్దు. (నిష్క్రమించును.)



# కాంతాపహరణము

## సప్తమాంకము.



ప్రథమరంగము

స్థలం:— అప్పులనరసింహం యిల్లు.

[అప్పులనరసింహంపంతులు మంచముపై బోర్లపండుకొని, పెద్ద గొంతుకతో యేడ్చుచూ నుండును.]

అప్పుల— అయ్యో కనకం- యెంతపనిచేసేవే- నాగొంతుకుకోసేవే- యీలా నన్ను మాయచేస్తావని వకనాడూ అనుకోలేదే- అయ్యో అయ్యో- యేలాబ్రతికేది- యేంగ్రహచారం. రామం- రామం- యేం ఆపద తెచ్చిపెట్టేవు- "రామనామతారకం భక్తిముక్తిదాయకం—"

(కాసేపుఆగి) వాడి ప్రభావంవే అయివుంటాది. వెధవము యింటికి వస్తున్నప్పుడల్లా వాళ్ళిద్దరూ మాట్లాడుకోవడం- నవ్వుకోవడం- యీ కక్కుకట్టు రికమెండు చెయ్యడం- అంతా అనుమానంగే వుండేది. (ఆలోచించి అనుమానంగా) అంతేనా లేక పుట్టింటికాని, వెళ్ళిందా, యిదివరలో రెండుసార్లు ప్రయాణం అయింది. వెళ్లితే నాతో చెప్పదూ ?- తోడులేకుండా వెళ్ళిపోతాదా ? అప్పే యెందుకీ అనవసర ఆలోచన్లూ ? వక్కటే జరిగింది ! ఆ వెధవే తీసుకపొయ్యేడు. వాడితోనే లేచివెళ్ళింది. రామ రామా- తలచుకొంటె హార్టు బద్దలౌ

తుంది. యీ వృద్ధాప్యంలో నాకెందుకు యీ అఘోరం- యీలాంటి ఆపద.

[ప్రవేశం : బంట్రోతు]

బాబు- హెడ్డుగుమస్తా బాబుగారు వచ్చినారండి తమరుగారు యేటిసేస్తూన్నారో అడిగి రమ్మన్నారు.

అప్పల—ఫ్వాన్స్—లంజకొడకా—హెడ్డుగుమాస్తాలేదు గిడ్డు గుమాస్తాలేదు. పొమ్మనేం- పుళ్ళాలన్నావంటే మొకంమీద తంతాను యిట్లోలేరని చెప్పలేకపొయ్యేవురా- మాదర్ చోత్- గాడిదకొడకా.

బంట్రోతు—చిత్తం- బాబు కోపంవుంచుకోకండి. (మెల్లగా) అమ్మగార్ని యెవరో యెత్తుకపోతే నేనేం సేశాను. బాగుంది.

(నిష్క్రమించును)

(పునఃప్రవేశం బంట్రోతు)

బాబూగారండి- యిల్లా బాబుగారు శానా కోపంగావున్నారూ- లేరని సెప్పమనేశారని సెప్పుతే మరేవన్నా హెడ్డుగుమస్తాగారు కోపంసేసుకుంటావున్నారు బాబు. మద్దెనె నేను సత్తావున్నాను. యిదేటిబాబూ నా గాచారం ?

[ప్ర: హెడ్డుగుమస్తా కాగితాలుపట్టుకొని]

నమస్కారం అండి. దొరగారు చాల అర్జంటు కాకితాలు రెండు పంపించేరు. యీవేళే వాటి రిప్లైస్ (replies) వెళ్ళాలను. ఇవిగో కాగితాలు. (యిచ్చును.)

అప్పల—యిప్పుడు నేనేం చూడను వోయ్- నాకు తలనొప్పిగావుంది. యీవేళ కచేరికి కూడారాలేను! ఆ రిప్లైస్ (replies) నివ్వే వ్రాసి పంపించెయ్. కావలిస్తే నాసంతకాలకు యిక్కడకు పంపించు- సరే వెళ్లు.

హె-గు — నారాయణమూర్తి యిదివరలో శెలవుపెట్టేశండి. యీవేళకు, శెలవు అయిపోయింది. మళ్లా వన్ మంత్ యక్స్టెన్షన్ (one month extension) చేసేడు. (కాగితం యిచ్చును)

అప్పల — (కోపంతో) యక్స్టెన్షన్ (extension) లేదూ- గిక్స్టెన్షన్ లేదూ- వెదవలుకు శెలవుయివ్వకూడదు- పని డిస్మిస్ dismiss చేసేసేసు. మరొకణ్ని చూడు. సూర్యనారాయణ తల్లి వెయ్యి- మెమో టైపు కొట్టించి యీవేళే పంపించై.

హె-గు — అతను తర్డుఫారం (Third form) మైనా పేసుకాలేదూ-

అప్పల — నాయిష్టం- చప్పున వెళ్ళి- నే చెప్పినాగు చెయ్ లేకుంటే రిజైనుయిచ్చి వెళ్ళిపో. వకటేమాట- మరి మాట్లాడలేను. కాగితాలు తీసుకపో. (అని కాకితాలు విసరి కొట్టును.)

హె-గు — (కొంచెందూరంనడచి పరిక్కును) ఓరేవ్ రాంవుడూ యీవేళ యేదో విశేషం వున్నట్టుంది. పంతులు అమితంగా ఖారాలు మిరియాలు నూరుతూవున్నాడేం?

రాంవు — తమరుగారికి తెలన్ది యేటుంది బాబూ యీఅయ్యోరుగారి సమాచారం. యీరోజునేనా? యిట్టాకోపం పతినిత్యాం వుస్తే కదూ.

హె-గు — లేదురా- రాంవ్రమూ, కంట తడికూడా కానొస్తుంది. యేదో పరిమాణం సంభవించిచట్టుందిరా. నీకు తెలసే వుండవచ్చు చెబుదూ—

రాంవు — యేటిచెప్పేదిబాబూ. గోరం- గోరం. మతిలో యేత్తే గుండెలు లొటలొటా లొటాలొటా కొట్టుకపోతా వుండాయి- రామరామ పగోళ్ళకైనావద్దు సామీ—

హె-గు — చెప్పావ్ వేగరం, నోట్లో రానియ్యావేం మాట.

రాంప్రు—కోపం పుచ్చుకోకండి బాబూ. మరేటీ లేదు అయ్యోరుగారి అమ్మోర్నంట యెవరో పోకిరీ వోళ్లు యెత్తుకపొయ్యేరంట— అంచేత బాబుగారు అట్టా అగోరిస్తావున్నారు.

హె-క—సెబాస్—రాంప్రభూ. మంచివార్త చెవినివేసేవురా. బంట్రోతువు అయితే అయ్యేవుగాని. యేదీ పేకంను వకటివ్వాలె. (అని పేకెంను చేసి)—యీ గాడిదకొడుక్కి కావలసినపని అయిందిరా. వీడి ఎపాయింటుమెంటును (appointments) అన్యాయాలూ. వీడి అనవసరపు ఎక్స్ప్లనేషన్ (explanation) లూ, వీడి అవకతవక ఆర్డర్లూ, వీడి పైపై మాటలూ, గోల్గోల్ గుట్టలూ—వీడి టస్సాగొయ్య వీడి పెళ్లాన్ని యెత్తుకపోవలసిన్దేనా? యెవడోగాని మామంచిపనిచేసి పొయ్యేడురా. వాడిని థాంక్ (thank) చెయ్యాలి. అనవసరంగా అల్లరపెట్టే అధికార్లకు యీలాంటిగతే చివరకు?

(నిష్క్రమించును)

అప్పల—ఓరే రాంప్రసా.

బంట్రోతు—సిత్తం బాబు—యేటిసెలివు?

అప్పల—నివ్వు వేగిరం హోటేలుకు వెళ్ళి మనయింటికి వస్తావుండే వాడూ. ఆ వెధవను వున్నాడా లేడా కనుక్కో.

బంట్రోతు—యే హోటేలు బాబూ.

అప్పల—నీ వల్లకాటికి హోటేలూ—వాడి వల్లకాటికి హోటేలూ. యేవో నాలుగు హోటేళ్లు కనుక్కో. కాస్త తిరిగి యే హోటేలులో తినేవాడో భోగట్టా చేయి. (జ్ఞాపకం తెచ్చికొని) యెవడో రంగడట. కనుక్కో.

బంట్రోతు—సిత్తం బాబు. సిటికలో కనుక్కొని వస్తాను.

(నిష్క్రమించును.)

(పంతులు పండుకొని కొంతసేపు లేచి)

యింట్లోగాని యెక్కడైనా దాగికొని వున్నాదేమో పరిహా
సానికి—మరొకమారు చూసిస్తే అనుమానం పోతుంది.

(అని అన్ని గదులు వెదకి తిరిగివచ్చి సాగిలపడును)

[ప్రవేశము:—బంట్రోతు]

బాబుగారండోయి—ఆపంతులుగారు లేరంట. రెండురోజులైతే కా
పడ్డేదంట- శానా సొమ్ము యియ్యాలంట. ఆడూ రాగాలు
తీస్తావున్నాడండి-

అప్పల—(చప్పున లేచి) యేదీ వకసారి వెళ్లుదాంపద—

(అని తలుపుతాళంవేసి బంట్రోతుతో వెళ్లును.)



# ద్వితీయరంగం.

స్థలం:—రంగయ్యహోటేలు.

[రంగయ్య మునుసామితో మాట్లాడుచుండును.]

రంగ—అబ్బా- యేందీ యీచిత్రం. రెండు దినాలైంది యీవేళకు. యెక్కడికో వెళ్ళి వుంటాడు. (ఆలోచించి) పక్షితీర్థం కాని వెళ్ళేడేమో. మొన్న నాతో వకసారి అన్నాడు.

మును—వాడి వూరికిగాని వుడాయించినాడేమో ?. నీదుడ్డు మరి వచ్చినట్టేదా!

రంగ—అబ్బే అలాంటిమనిషి కాడయ్యా- అలా చెప్పకుండా వెళ్లి పోడానికి వాడికేంవచ్చిందీ! దస్తావేజులతో పెట్టివుంచేసి వెళ్ళి పోతాడా? అంత తెలివితక్కువవాడు కాడు.

[ప్రవేశము:—తొందరగా అప్పలనరశింహంపంతులు బాటోగ్రసూ.]

రంగ—యెవరూ? దయచెయ్యండి బాబూ మనది యేవూరూ ?

(తనలో) యిప్పుడు యేరైటుందబ్బా?

పం—యేవూరైతే నేం గాని. కాకినాడనుండి వచ్చిన కట్టువాడూ-

వెంకటరత్నం—యిక్కడేనా బోంచేస్తా ?

రం—యేం- వెంకటరత్నం బాబూ ?

పం—శాస్త్ర సామలసాయిగా వుంటాడూ- పొట్టిగానూ- యూడు నాలుగు మూసాలై యిక్కడ వున్నాడట—

రం—(నిచ్చెరపోవును)

పం—యే వలానిచ్చెర పోతావ్ ?

రం—ఆ-అబ్బాయిది కాకినాడా ? రమణరావుగారిది కాకినాడా ? విశాఖపట్నం అని చెప్పేడే నాతోను.

పం—(హాశ్చర్యంగా) రమణరావు యెవరూ ?

రంగ—మీరు చెప్పిన కుఱ్ఱవాడి పేరు రమణరావు కాదూ?

పం—గాడిదకొడుకు నాతో వెంకటరత్నం అని చెప్పేడే—

రంగ—అన్నా యెంతపని చేసేడూ ? తొత్తుకొడుకు, అయితే నాకు మాయే చేసేడూ-చప్పేనాగ్రి దేంవుడా-మూడు మాసాలై తిన్నదే కాకుండా బోలెడు సొమ్ము అప్పుపుచ్చుకున్నాడు. వుడాయించేడూం ? యింకా వస్తాడేమో అని చూస్తూ వున్నాను.

మును—నేను చెప్పివుండలేదా- తప్పక వాడు వుడాయించినాడు- అయ్యో—

రంగ—పే రేంవిటన్నాడుూ-వెంకటరత్నం-వా ? నీఅమ్మ కడుపుకాలా—యెంత మోసం చేసేవురా ?-తిండి తిన్నావు, నాదగ్గర అప్పుపుచ్చుకొన్న దైనా పారైనో నీ ముఖం సంతలో పెట్టెయ్యో. (అనియేడ్చును)

(కాఫీహోటేల కాంతప్ప ప్రివేశం)

యేమయ్యో రంగయ్య, నీవు మామంచి పెద్దమనిషినిదా అప్పు చెప్పినావూ. యేబది రుప్పా బిల్లు అయినది. నేటికి పదిదినాలై మాహోటేలుకు రావడం మానుకొండాడూ. మాపత్రిక అత్తిలిపాకం, సిగరెట్టూ కొట్టుహాని కేమో యిరువది రుప్పా అయినదంట. యేమి చెప్పాదువు. నీచేత పెట్టుకుందువా ? యి వ్వడేమో మరివక కాఫీహోటేలుకు పోతుండాడని వింటిని-

రంగ—వాడి మొఖం వాడికి మరొక కాఫీహోటేలు కూడానా ? పూరువిడచి చెప్పకుండా పొయ్యేడు.

కాం—యేమీ—చెప్పకుండ పారిపొయ్యనాడా ? అయితే వుత్తరం వ్రాసి తెప్పిస్తువా ?

రంగ—గాడిదకొడుకు వక్కొక్కరితో వక్కొక్క పేరు చెప్పేడు యే పేర వుత్తరం వ్రాసేది. నిజమైన వూరూ పేరూ తెలుస్తే కదూ ?

కాం—యేమిా పారిపొయ్యేడూ. (నవ్వి) యెంత దర్జాపురుషుడు. చేతి నికర్రా, కళ్ళకు స్పెక్టికల్సూ—నీతో యేం పేరు చెప్పేడూ?

రంగ—నాతో రమణరావు అని చెప్పేడు. యీపంతులుగారితో వెంకటరత్నం అని చెప్పేడట !

కాం—యిదిగో నాచిట్టాలో (అని చిట్టాతీసి) B. P. రావని వుండింది.

(అంతా నిర్ఘాంత పోవుదురు)

పం—వున్నాడు కాడు పీక పిసికించేదును.

కాం—అటువంటి ఆసామిా శానా కాలం వుంటే మనకేదా నిండా నష్టం-శీఘ్రింగా పొయ్యేడూ- అదియే నిండా సంతోషం—

రంగ—బాబూ మిాకేం యివ్వాలా యేంవిటి ?

బంట్రోత్—(చప్పున) లేదు బాబయ్యా బాబుగారు లేనప్పుడు అమ్మగార్ని యెత్తుకపొయ్యేడు. వుంటె తొక్కవచ్చేదును బాబూ—

పం—(కోపంతో) చప్పునోరుముయ్యి! గాడిదకొడకా నీకెందుకు ఆవూసు.

రంగ—(నవ్వుతూ) లంజకొడుకు యెంతపనిచేసేడూ? యెంత గ్రహచారం. పంతులుగారూ జ్ఞాపకంవచ్చిందీ- వాడివుత్తరాలు బోలెడు, దస్తావేజులపెట్టె వకటి వదలేశాడు.

పం—(ఆతృతతో) అయితే- దొరకేడు వెధవ- వుత్తరాలువల్ల వాడి వూరూపేరూ తెలసిపోతావి వేగరం తీసుకురా-

రంగ—(చప్పున లోపటికి వెళ్ళి వుత్తరాలుగంప తెచ్చి పంతులు ముం

దు పడవేయును. పంతులు ఆత్రుతతో వకటితర్వాతవకటి చదివి క్రిందపడవేసి——)

పం—ఓరీ యెంతటివాడవురా?—వీడితస్సాగొయ్య యెంత ఆలోచన చేసేడూ?

రం-కాం—యేవూరు అనివుందీ?

పం—వాడి శ్రాద్ధంవూరు. యీవూరినుంచే, అనిముద్రలూ యీవూరివే—?వక్కొక్క వీధి ముద్ర వక్కొక్కకవరుకుంది.

రంగ—లోపల యేంవుందీ—

పం—యేదో పారం— యింగ్లీషున వ్రాసిపుచేయించేడూ. అన్నివుత్తరాలూ వక్కలైవే—యేదీ పెట్టివిరగగొడుతే యేమైనా ఆధారం దొరుకుతుందేమో?

రం—(పెట్టి తెచ్చి) కాంతప్పా! యేదీ పెట్టివిరగగొట్టుమీ- దస్తావేజులూ నోట్లూ వున్నావన్నాడూ తుంటరివెధవ- వక్కలైనా వుండగూడదా?

(కాంతప్ప పెట్టి విరగకొట్టి)

ఓహో యెన్నిదస్తావేజులు వుండావీ! యెన్నినోట్లు వుండావీ!—రంగయ్యా యింద యెత్తిపెట్టుకో (అని చిత్తుకాగితాలు ముందు పడవేసి) జాగ్రత్తగావుంచుకో- యెన్నికాగితాలు! అన్నీ న్యూసుపేపర్లుదా? వీశెడు వుండును. కాలుసూపాయి ఖరీదుకు తక్కువ కాదూ ?

[ప్రవేశము:—సోదరగా బోర్కదు.]

యేమండీ- రాజమండ్రినుండి వచ్చినారూ, రాజగోపాలంగారూ యిక్కడదానా బోజనం చేసేదీ?

కాంత—యేవరు ? ఆపొట్టిగా నిండా షోకుచేసుక తిరుగుదుడూ—వాడుదానా నీవు చెప్పేదీ—

బో॥—ఆఁ—వాడురా—

రం—వాడిబొంద—మీాతో రాజగోపాలం—రాజమండ్రి అని చెప్పేడా?

బో॥—అవును సామి—నిజముదా—యేమి అట్టా ఆశ్చర్యం పడుతూ వుండారు.

పం—నీకేం యివ్వాలనా యేమి?

బో॥—నాకుకాదు—వకబోగందాన్ని, టోపీవేసి నిండాసొమ్ములు యెత్తుకపొయ్యేడు సామీ—అద్దా పాపం యేడుస్తూ వుండాది. యెత్తుకపోతానని మోసగించి ఫకీరుకుచేసి వదలపెట్టినాడూ. కాస్త ఆగండి సామీ దాన్ని తీసుకవస్తాను.

(నిష్క్రమించును.)

కాంత—(రంగయ్యనుచూచి నవ్వుతూ వెళ్ళిపోవును.)

(పంతులు బాలక్రిష్ణు నిష్క్రమింతురు. రంగయ్య గోలపెట్టుచుండును)

# తృతీయరంగము.



స్థలం:—అప్పలనరసింహాంపంతులుయిల్లు.

[అప్పలనరసింహాంపంతులు బోర్లపండుకొని యేడ్చుచూవుండును.]

(నిచ్చరబోయి) యెంతపనిచేసేడూ దొంగగాడిదకొడుకు?—వాణ్ణి యింట్లోకి రానివ్వడంవే నాదే తప్పు. యింతకూ వాడెవడో నాకేం తెలుసునూ? యీ పాడు కక్కకట్టు మా బావమరది తీసుకవచ్చి యింటికి చిచ్చుపెట్టినట్టు నాకు అప్పచెప్పేడు. ఖని గాలింయిచ్చేనుకదా?—రమ్మని. వస్తేఅన్నిసంగతులూ తెలిసిపోతాయి. (ఆలోచించి) వాణ్ణి అనవలసిన పనిలేదు. దాన్ని అనాలి. యెంతప్రేమవున్నట్టు నటించేదీ? మాలముండ. యిందుచేతనే ఆడవాళ్ళని నమ్మకూడదంటారు యింతకూ యీలాంటి పట్నాల్లో వంటరిగా వుంచడం నాదే తప్పు. సొమ్ము కాసించి, వంటపుట్టినై నావుంచలేదు.

(కొంచెం ఆగి) యింతమందికి అనవలసిన పనిలేదు. నేనే అనుకోవాలి. కాలం తీరిపోయిన నాకు యెందుకీపెళ్ళి? సొమ్మువుందని కావరంచేత, బాగా ఆలోచించేనుకాను. నలుగురూ చెప్పినమాటైనా విన్నానుకాను మంచిపాఠం చెప్పేడు గాడిదకొడుకు. రిపోర్టుచేదాం అంటే అది మేజరుముండ. దానిమాటే ఖాయంచేస్తారు. అప్పుడు మరింతసిగ్గు. నలుగురినోటా పడుతుంది యీ సంగతి. యిహ నాపరువేంవుందీ?—రామం-రామం యెంతగ్రహచారం తెచ్చిపెట్టేవూ? నలుగురిమాట విననందుకు నలుగురిలో తలవంపు కలుగజేసేవు. నా ఖర్మం-నాఖర్మ- నాతలవంపు. నా సిగ్గు- నా పన్నెండువందలురూ

పాయీలూ — నా సూరుతులాలుబంగారం — నా పాళికిమెక
రాల పల్లెం — నా ఆస్తి — నాకనకం — శో- నాకనకంశో-
నీళ్ల దా రేనా? (వేళ్ళను) అయ్యో అయ్యో యెంతగ్రహచా
రం. యీపాటిని యిలాంచస్తేనే మర్యాద దక్కుతుంది —

"యీజన్మమిక దుర్లభమురా। యిక సాజన్మపహకారి
సద్గురుని గనరా॥ యీజన్మమిక దుర్లభమురా।"

యిహనాకు వుద్యోగం వస్తూ ప్రాప్తమేలకం — నష్టా. యీవు
ద్యోగ మదాంధతవల్లే యీప్రమాదం సభవించింది- నేను
చేసిన అన్యాయాలకు నాకీ అన్యాయం జరిగింది. మళ్లా పెళ్ళాం
చచ్చి దని చక్కా పూస్తూరుపోయి యింట్లో ముండమోసిన
ట్టు కూర్చుంటాను. యీ పెదవము డనుంచి, మొదటిభార్య
తాలూకు యిద్దరు పిల్లల్ని వాళ్ళపుట్టింట విడచేసేను వకనా
డైనా వాళ్ళ బాగోగులు చూసేరుకాను. యీనాటి డను సం
తోష పెట్టడానికే అయ్యో యేం దారి —

(లోపలనుంచి 'బావగారూ' 'బావగారూ' అని తలుపు కొట్టిన శబ్దము)

అప్పల — యెవరూ? వేణుగారు వున్నారు. వెంటనే వచ్చేసేరే. అ
యోయ్యో వీళ్ళ మొహాలు యేలాగు చూసేదీ —

(వెళ్ళి తలుపు తీయును పుంః ప్రవేశం పంతులు, వేణు)

వేణు — (ఆత్రుతతో) అర్జంటు (urgent) గా రమ్మని మొన్ను వైర్ (wire) యిచ్చేరూ? మా సిస్టర్ (sister) కి, దాని జబ్బుచేసిం దేమో అని, అనుమానించి, నాన్న, అమ్మ, కూడా వచ్చేరు

అప్పల — యేరీ వాళ్ళు?

వేణు — వాళ్ళు బండిమీద వస్తూవున్నారు. నేను ముందుగా ట్రామ్ (tram) మీద వచ్చేసేను.

అప్పల — సరేగాని నీవు తీసుక వచ్చేవే కుట్టవాడిని — వాడిదేవూరు?

వేణు—యేకుఱ్ఱవాడూ?

(అంటూ ఆత్రుతతో లోనికి పోవ)

అప్పల—లోపలయేం వుందోయ్? నా మొఖం నీ మొఖంన్నా?—
నేనడిగిన దానికి జబాబు చెప్పూ.

వేణు—(ఆలోచిస్తూ-విసుగుతో) యేకుఱ్ఱవాడండీ?—

అప్పల—పనికోసం తెచ్చేవు కావటోయ్?

వేణు—(జ్ఞాపకం తెచ్చుకుని) ఓహో అతనా- పొట్టిగా-ఫేరు (fair) గా వుంటాడూ? యేం అతని సంగతి యిప్పుడెందుకూ? పనేంవైనా యిచ్చేరా?

అప్పల—వల్లకాటిపని—వాడిబొంద—మంచిపనే ఏంది?-చెప్పవూ
వేగరం వాడెవడోనో? యెక్కడున్నాడోనో?

వేణు—అతను యెక్కడున్నాడో నాకేలా తెలుస్తుదీ?

అప్పల—వాడి పేరేంవిటీ?

వేణు—నాకు తెలియదూ.

అప్పల—యేంవీ తెలియకుండానే యేలావచ్చి రికమెండు చేసేవోయ్- వుద్యోగం యిమ్మనీ? మంచివాళ్లా వున్నావే- కొంప ముంచేవ్—

వేణు—యెవడో వీధిలో కనబడి నన్ను రిక్వెస్టు (request) చేస్తే మీతో రికమెండు చేసేను. యిప్పుడేం వయిందీ—?

అప్పల—యేం చేతాడె? యేంవవాలో అదే అయింది. వుండి వుండి. చక్కా యింట్లో ఆడవాళ్లని యెత్తుకుపోయ్యేడు—?

వేణు—ఆఁ—యేంవిటీ- మా సిస్టర్ (sister) న్నే—అమ్మా నె ల్లమ్మను—

[అని గట్టిగా అరవుమండగా రామశాస్త్రిలు, లక్ష్మమ్మ ప్రవేశం.]

లక్ష్మ, రామ—(తలబాదుకొనుచూ పెద్దగొంతుకతో) యేంవిరా

నాయనా- యేం చెల్లెమ్మకి యేంవయింది ?—జబ్బు గాబరాగా వుందేంవిటి ? యేదీ- చెల్లెమ్మ- యేదిరా అబ్బాయీ, నాకనకం—

(అని లోపటికి వెళ్ళుచుండగా.)

వేణు—జబ్బుకాదేసే- యెవరో చెల్లెమ్మను యెత్తుకపొయ్యేరటే-

రాము—ఆఁ—ఆఁ—యెత్తుకపోవడంవే- యెవరు యెవరా యెత్తుకపోయింది- దొంగలేనా ?

లక్ష్మి—అయ్యో నాకనకం- (రాగాలు తీస్తు) నిన్నెవరు యెత్తుకపొయ్యేరే- నాకనకంవో- (అల్లునివైపుచూచి) వంటిమీద యెందుకు బంగారం వుంచేవు బాబూ—యెవరో ఆబంగారం తీసుకొని మాకనకాన్ని ప్రాణాలతో మాకిచ్చేయట్లో—దొంగముండావాళ్ళాలా—(అని యేడ్చుచుండును.)

అప్పల—(మొహంమీద చేతులుపెట్టుకొని, పెద్దగొంతుకతో బొబ్బరించుచుండును.)

వేణు—అమ్మా దొంగలు కాదే చెల్లెమ్మను యెత్తుకపోయిందీ- యీవూరు వుద్యోగం కోసం వచ్చేడే వక కుఱ్ఱవాడూ వాడట—

రాము—ఆఁ—దొంగలుకారూ ?

వేణు—అబ్బే—దొంగలు కారూ.

లక్ష్మి—(కోపంతో అప్పలనరసింహంపై చూచి) యేం బాబూ మీకు పిల్లనిచ్చినందుకు మాబాగా పైవాళ్ళకు అప్పచెప్పేరూ ! యేంపి- జాగ్రత్తగా వుంచలేక పొయ్యేరా ?

అప్పల—భాగుంది- నేను దాన్ని పొమ్మన్నానా యేంవిటి ? దొంగముండ—రంకుముండ—దాని మదంకొద్దీ లేచి పొయ్యిందీ-

రాము—ఆలాటి అపృచ్ఛపుమాటలు మాయెదురుగా ఆడకయ్యా-

మీకు కన్యాదానం చేసినందుకు అనుభవం మాభాగానే అయింది మాకు — మాపిల్లని మాకు కాకుండా చేసేరూ. సిగ్గు సిగ్గు. (అని లెంపలు వేసుకొనును.)

లక్ష్మ — నిక్షేపంలాంటి పిల్లని నాచేతులారా పాడుచేసుకొన్నాను. యిప్పుడేంవిచారిస్తే? — యేంపుడా?

వేణు — అమ్మా- చెల్లి సంబంధం విషయం మాట్లాడుతూవున్నప్పుడు యీయనదగ్గరనుంచి తెలిగ్రాం వస్తే యేం వన్నానే? జ్ఞాపకం వుందా?

లక్ష్మ — నీ మొహం నా మొహం అన్నావు. వెధవిని. అసుభంగానే మారుతుందన్నావు. ఆలాగే అయింది. అందుకనే కదూ నోటంటా ఆలాంటి అపశకునపు మాటలు ఆడరాదంటారూ!- కక్కుర్తి- నిన్నించేను —

వేణు — యిది మరీ బాగుంది-

అప్పల — ప్రారుకోండి బాబుల్లారా. మీకు నమస్కారం చేస్తాను. యిరుగు పొరుగువాళ్లు వింటే నలుగురిలో నవ్వులు- గొప్ప సంబంధం చేసేరు. (చెంపలుకొట్టుకొని) బుద్ధివచ్చింది — అసాంప్రదాయకపు సంబంధాలు చేస్తే యీలాంటి ప్రమాదాలు సంభవిస్తూవుంటాయి —

రామ — నీకు పిల్లని యివ్వడంవే నాది తప్పు. రాజులాంటి పిల్లని- రామ రామ- సొమ్ము కాసించి నీకు కట్టిపెట్టేను. పిల్లని యిచ్చినతరువాత యేం మాటలైనా అంటావే- పదరా వేణూ పదా — మరెందుకు యిక్కడ వుండడం —?

లక్ష్మ — (యేడుస్తూ) అయ్యో నాకనకం — కనకం — నిన్నుచూద్దామని గంపెడు ఆశతో వచ్చేనే- నాకళ్లకి దూరంఅయిపోయేవే — (అని తల కొట్టుకొనును)

అప్పల—వూరుకోవమ్మా. యెవరైనా వింటారూ. మొఖం యెత్తు
కోని తిరగలేనూ.

రామ—ఓసేవ్ చూస్తా వేంవిటి యీకాను? ఓరె అబ్బాయీ—
వేణూ—బండివాణ్ణి పిలవరా. సామాను మళ్లావడైంచై.
యిక్కడెందుకు వుండడం?

అప్పల—యీవేళ వుండండి. రేపు వెళ్ళిపోవుదురు కాని—

రామ—వక్కఘడియ వుండం.

[ప్రవేశం బండివాడు.]

సామీ. నాది ముందుగా సెటలు సేసెయ్యండి. నిండా ఆలస్యం
అయినదీ.

రాము—లేదురా. మళ్ళా రెయిలుకు పోతాం. సామాను బండిలో
పెట్టు.

(అనుచరూ ముగ్గురూ వెళ్ళిపోదురు.)

అప్పల—(పండుకొని) యెంతగ్రహచారం—"యెందుకురా పెళ్ళి
యెందుకురా" (అని పాడుతూవుండగా తెరపడును.)



# కాంతాపహరణము.

## ఉత్తరరంగము.



స్థలము:—బెజవాడ సత్రవు.

[కొందరు అచ్చటచ్చట కూర్చొని మాట్లాడుకొనుచూ వుందురు. మరివకచోట కొందరు పేకాట ఆడుకొంటూవుందురు. వేరొకచోట సన్యాసులు గంజాయి పీల్చుకొనుచూ వేదాంతసంభాషణ సేయుచుందురు. యింకొకచోట కాపు ఆలిమగలిద్దరు వంటప్రయత్నములు చేసుకొనుచుందురు. ముందుగదియందు వెంకటశం కనకలక్ష్మి మాట్లాడుకొనుచూ నుందురు.]

1 వ సన్యాశి—చూచేవా తమ్ముడూ- యేంవ్వని అన్నాడో యేమన్న—

"యెట్టికుక్కలవలె యేదమూ సదివేరు,
ఆసియంబు లెరుగ రయ్యవార్లు
యేద సారమంత యేమన్న యెరుగునూ
యిశ్వదాభిరామ యినర యేమా."

అన్నాడు- హీ- హీ- హ్హీ- (నవ్వుతూ) సనువుతే యేమన్నే సదవాల సూసేవా తమ్ముడా—

"యేదా తీతుడు యేమన సుమ్మా
యేమన నుడువులు వేదము సుమ్మా
వేదశాస్త్రములు వాదలు సుమ్మా

వాదుల నోళ్ళకు బూడిద సుమ్మా
విసువక సదివిన విందురు సుమ్మా
విన్నవారు మరి కందురు సుమ్మా
కన్నవారు మరి సెప్పరు సుమ్మా
చెప్పిన నెవ్వరు సేయరు సుమ్మా
సేసిన వాడె ప్రసిద్ధులు సుమ్మా
సిద్ధుల మాట పశిద్ధము సుమ్మా
జాతర జాతర జాతర సుమ్మా
జాతర తీర్తుడు యేసున సుమ్మా"

అనుంది. శిశ్యా యేదీ శిలుం- (పుచ్చుకొని) అందుకోరా తమ్ముడా- (మరొకనికి యిచ్చి) అదిగో అది పీలుస్తేనే బ్రమ్మం కనిపించేది. గం-జాయీ-, అన్నాడు. అంటె తమ్ముడూ యిన్నావా? దాని అర్దం- ఘనమైన- దారీ-, నీకని రహస్యం చెపుతూవున్నాను. విన్నావా- యేదాంతం అంతా పత్రిలోనే యిముడుకుంది. హ్హా- హ్హా- హ్హా.

2 వ సన్యాసి—యెటువంటి వాక్యాలు చెప్పనివేసేరు గురూ ? నా అదుర్ష్టం. మీపాదాలు పట్టుకున్నాను. యింకా వుపదేశం యివ్వాల.

3 వ స—(2 వ వానివైపు చూచి) సామాన్యం వేదాంతి అనుకున్నారా సామి—మా తెలసినోరు. నిండా అనుభవశాలి.

1 వ స—బ్రిమ్మం యేటన్నాడో చూచినావా తమ్ముడూ-
"యిసుమంతా వత్తేసి యింతా సమురుపోసి జ్యోతీవెలగుమైవెలగు
జ్యోతీవెలగి వెలగి జ్యోతీ మలిగి పోయేటపుడు ప్రిమ్మితొనొక
మాట చెప్పి పోరాదా—

తనువ శాశ్వితమని తెలయూడీ దొంగతనువ్వుంకూ జీవికి తగు
లాయె నుండీ—"

యీ మాయ దేహాన్ని నమ్మకు తమ్ముడూ. యేది శిశ్యా తమ్ము
డికి వకటి చదివి యినిపించూ—

3 వ స—"మూడు మూడు ఆరు మైతే
ఆరు మూడు తొమ్మిదై తే
తొమ్మిదిలో మూడు తీస్తే. ఆరుమిగిలేటందుకూనూ
దీనిభావము తెలియవలె నన్న
నీలోను బ్రిమ్మా! దీనిభావము—"

2 వ స—అహ్హా. యేంవి చెప్పేదు. గురూ. (గంజాయిపీల్చును.)

(మరివకచోట)

(కాపులు ఆడమనిషి పొయ్యిపైని కుండపెట్టి వండుచుండును. మొగ
వాడు పెట్టి సద్దుతుండును. పిల్లవాడు ఆడుకొనుచుండును)

ఆడమ—ఓరోయ్ కిట్టిగాడో రారోయ్. యిందంటేడైనా ఆడుకో
రోయ్— యేడకు పోతున్నావ్. తప్పోతావురా. బళ్లకిందొడి
సత్తావ్రా.

పిల్ల—యిందటే ఆడుకుంత్తానే. అమ్మా (లోపలికి పోతూ) ఆ పి
ల్లోడుతో—

ఆడమ—ఔనోయ్—పిల్లోడు యెక్కడికో పోతావున్నాడు. కాసింత
సూడూ. దారితప్పేగల్దు. యీడ కూడు వుడుకుతా వున్నాది.

మొగమ—అవునే. మన సిన్న సేతటుకుపెట్టె యేదీ. సచ్చినాంవే
రెయిలుబండిలో వదిలేసినాంవుకావాలే—నీ సిగ్గోయ్య.

ఆడమ—నేను తెత్తే. యిద్గాదూ కన్ను కాపద్దు కావోలు. యేది
యెక్కువయ్యింది మొగోడికి—

మొగమ—అది కాదోస్సి- నీ తల్లి సిగ్గొయ్య. మరపిపొయ్యినావ్యాంటే మూళ న్నాక్కొడుకు ముండ. మొన్న మొన్న కొన్ది.

ఆడమ—యెందోస్స అల్లాగు సత్తావున్నావు. నివ్వు మోసుక రాలేక పొయ్యేవ్వా? సేతులు పడేవ్వేటి?—నా సీసుంది దాన్లో. సుక్కలసీర. రంగంది. (గట్టిగా) ఓసో కుట్టోడా- రారయ్యో.

పిల్లవాడు—(వచ్చి) కూడెట్టేలో-లమ్మ.

ఆడమ—కూడేసుందిరా- కుట్టోడా కొంపమునిగింది. (చిన్నమూట యిచ్చి) వొట్టుకోరా యిదీ (మొగడివైపుచూసి) సూస్తావ్వేటి? నీ బొంద నాబొంద- వొట్టుకో యీసామాను రైలెక్కి- పోదాం.

(రెండుచేతుల్లో సామానుపట్టుకొని చంకని పిల్లణ్ణి యెత్తుకొని ప్రయాణమవును.)

మొగమ—ఓ లింకెందోస్ ఆరెయిలూ బెజివోడ యిస్టేసను వొదిలేస్సింది. అదిగో ఆగుస్తా వున్నాది.

ఆడమ—మాటోడ మంటె ఆగుతాడురా యీడు- బేగి దవుడు తియ్యకా-

(ముగ్గురూ పోయ్యి, కుండ ఆలాగే వదలి చేతిపెట్టె మరివకటి వదలి పరిగెత్తిపోదురు.)

(వేరొకచోట ముందుగదిలో వెంకటేశం కనకలక్ష్మి మాట్లాడుకొనుచుందురు.)

కన—అన్నా యిప్పటికి నాప్రాణాలు హాయిగా వున్నావి. బండి నడుస్తూన్నంతసేపు యెక్కడ పంతులుగారు, టెలిగ్రాంయిచ్చి ఆపించివేస్తారేమో అని గుండె దడ దడ కొట్టుకునేది.

వెం—ఆఁ- యేమంటివీ? టెలిగ్రాం (telegram) యిచ్చి మెయిల్ట్రెయిన్ని ఆపివెయ్యడం వే? పంతులుగారే ఆపించేసేదీ? యేం

వింత? అంత ధైర్యం అయిన పని చేయగలారి మీపంతులు? కనకం (Kanakam.) యిఖ పాతసంగతులు మర్చిపో. యిక్కడకువచ్చి రెండు దినాలైనది. యింకా అవ్వాసులేక? యెప్పుడు యింటిగడప దాటేసేవో- అప్పటితోనే నీకూ పంతులు గార్కి- ఋణస్యం సరి. అదిగాక ప్రపంచచండశాశనుడగు, వెంకటేశంగారు నీదగ్గర వుటుండగా భయంగియం నీకెందుకూ? —

కన—వెంకటేశం యెవరూ?

వెం—నేనే-

కన—వెంకటరత్నం కాదూ మీపేరు?

వెం—అబ్బే- పంతులుగారితో అలాచెప్పేను. హోటేలు రంగయ్యతో రమణరావన్నాను. కాఫీహోటేలు కాంతప్ప చిట్టాలో బి పి (B. P) రావ్ అని యెక్కించేను. రాజామణితో రాజగోపాలం అని చెప్పేను.

కన—రాజామణి యెవరూ?

వెం—(నవ్వుతూ) అదివరకే సానిమనిషి-

కన—దానితో స్నేహంచేసేరా యేమిటి?

వెం—అబ్బే-స్నేహంకాదూ. చెబుతా వినూ. ఫస్టు (Frist) ని మీయింటికి వచ్చేనూ?—ఆవేళ ఆవీదిని పోతూవుంటే నన్ను కబురుపంపి, మాయచేసి, నాడబ్బంతా కాటేస్తూవని, గంపెడు ఆశతో—నాతో లేచి వచేస్తానంది.

కన—(నవ్వుతూ) మీదగ్గర డబ్బుందని చెప్పే రేంవిటి?

వెం—కొంచెంకాదూ. యేభైవేలు వున్నావని డాబుకొట్టేను. యీ భైవేలు అనేసరికి మనిషి వుబ్బిపోయి, నన్ను మచ్చికచేసి, నాతోలేచి వస్తానని చంపుకతింది.

కన— యిన్నాళ్ళూ నా కాసంగతి చెప్పేరుకారేం?-(నవ్వుతూ) యేం పెంకితనం- సానివాళ్ళతో స్నేహం చెయ్యడం, వాళ్ళని తీసుకపోతా ననడం—

వెం— వినూ ఆఖరువరకూ. ఆయింతా రమ్మన్నాను. ప్రయాణం చేసి, సరకులన్నీ వొలిపించి, చిన్నపెట్టెలో పెట్టించేను. దాని వెంట వక్కసరుకైనా లేకుండా కిరస్తానంముండలాగు, తయారు చేసి, స్టేషనుకు రప్పించేను.

కన— అంచేత నేనా? మీరు చాలకంగారు పడుతూ యిటూ అటూ తిరుగుతూవుండేవారు? నన్నొక్కర్తెన బండిలో వుంచేసి—?

వెం— ము గా? దాని సందడి నుంచేను.

కన— అయితే యేలా టోపీ వేసేరూ?

వెం— 'గొప్పి' అని దాని బంట్రోతు వకర్తె వుంది. దానిచేతికి పెట్టె యిచ్చింది పట్టుకొమ్మని. కాస్తదూరదూరంగా వీళ్ళిద్దరూ కూర్చొన్నారు మెల్లగా యీరాజామణి చూడకుండా గొప్పిను పిలచి, మంచిమాట్లాడుతూ స్టేషనుఅవతలకు, తీసుకపోయి పెట్టె నాచేత తీసుకొని, రెండురూపాయిలు దాని చేతికిచ్చి "చాలా రాత్రి అయిపోయిందీ. నీవు యింటికి వెళ్ళిపోయి, వకరూపాయి ముసలిదానికి యిచ్చై. వకరూపాయి నివ్వు తీసుకో. మళ్ళాపదిరోజుల్లో మీఅక్కా నేనూ పట్నంవస్తాం. వచ్చినప్పుడు నీకోసం మంచి చీర తెస్తానులే- నీవు పోయి ముసలిదానితో యీలా 'అక్కా బావా రైలెక్కి వెళ్ళిపోయేరూ' అని చెప్పై. మాతో యెంతసేపు కనిపెట్టుకొని వుంటా" వని చెప్పి ట్రామ్బండి మెల్లగా యెక్కించేసి, టిక్కట్టుకోసం ఆరుకాన్లు చేతిలోపెట్టి చక్కాపంపించేసేను. యింతలో

తరుము బెల్ (third bell) అవగానె బండి కదలేసరికి పరిగెత్తి వచ్చి నిన్ను కల్సుకున్నాను.

కన—(ఆశ్చర్యముతో) కొంపముంచేశారే? పాపం చచ్చింది ముండ. యేదీ పెట్టె?

వెం—యిదిగో నీపెట్టెవెనుక. (తీసి వకొక్కసరుకు చూపించును.)

కన—ఆహా! యేం సరుకులూ? అన్నీ మెడ్రాసుసరుకులే. రత్నాలూశో యెంత అందంగా వున్నాసి (నోరుమూసికొని) యెంత గమ్మత్తుచేసేరూ?-వుంచీయ్యండి అలా. పైకి తియ్యకండి. మన వూరు పోయేక తియ్యవచ్చు.

వెం—అదాకా యీడైమండ్ నెక్ లేస్ (Diamand necklace) మెడలో వేసుకోమీ యెలావుంటావో చూస్తాను. (అని మెడలో వేసి) యేం అందగావుంది. నీకు- యేదీ కిస్సు-

కన—వూరుకుందురూ. దాన్ని ఫకీరు చేసేసేరు. తప్పుకాదూ? వుసురుమని యేడుస్తాదీ-

వెం—తప్పా? యేం తప్పూ? తప్పుకాదు సరెకదా వొప్పేనూ? యేలాఅంటావా? యీసరుకులన్నీ యెంతమంది బట్టలుకొట్టి సంపాదించిందో? యెన్నికుటుంబాలు నాశనం చేసి పారేసిందో? వాళ్ళందరూ వుసూరుమనరూ? అంచేత, 'నూరుగొడ్లుల్ని తిన్న రాంపోతుకి వకటేఘూలివాన' అన్నట్టు దీనిప్రాణానికి నేను సైక్లోన్ (cyclone) ఆయేను. కనకం—యిఖ మెడ్రాసు వదలేశాం అక్కడ సంగతులూ సందర్భాలూ మర్చిపోవాలి. చూసేవా "యెప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటికామాటలాడి" అన్నాడు కవిబ్రహ్మ. యిఖమనం యెక్కడ కేంపు (camp) వెయ్యాలో ఆలోచించాలి. యీ

సత్రంలో మరొక రోజుకన్నా యెక్కువ వుండనివ్వరు. యిప్పుడే యేదో శెటిల్ (settle) అవాలి. ఆలోచించు బాగాను. యింతపైసావుంది మనదగ్గర. వట్టి రాజామణి సరుకులే యిరువై వేలుకుమించేస్తావి. డైమండ్సు (diamands)బో లెడువున్నావి. యింకా హెచ్చుగానే యెస్టిమేటు (estimate) చెయ్యవచ్చు. చక్కా వైజాగ్ (vijag ) పోయి, యీసొమ్ము పెట్టి ల్యాండ్సు (lands)అనగా, భూంవులు కొనుక్కొని; హాయిగా కాలుమీద కాలు వేసుకొని, కూర్చొందాంవా? లేక కరగ్పూర్ (kharag-pur) పోయి, వకసంచి పారేశాంవంటే డి. టి. యస్. అనగా చిన్నకలక్టరుపనిమోస్తరు నెలకు యేడెనిమిదివందలు జీతం— ఆపని సంపాదించుకొని హాయిగా అక్కడ వుందాంవా? యేదో ఆలోచించు. యీవేళే పోదాం-

కన—కరగ్పూరు పోదాంవా? మీయిష్టం చూడండి. అడవిలోనైనా మీతో వుండమంటే వుంటాను.

కాం—(సంతోషంతో) అయితే రెండోదే నిశ్చయించేవూ? నాకూ ఆలాగే వుంది. మోహాలు చూచుకొన్నదగ్గరనుండీ మన యిద్దరికీ "ఆడినవొక్కయాట, నడమాడకడంగిన నొక్కబాట, మాటాడిన నొక్కమాట" అన్నట్టూ వక్కమనస్సుగానే వుంది. ఇంతకూ, నా అదృష్టం, యీలా వర్షాకాలం కృష్ణలాగు అమాంతంగ్గా, పొంగి పొరలి, వరదలై పారేస్తూవుంది. యిథి నీవు నాతో వచ్చినందుకుగాను- యిదిగో ప్రిజంటు యీ జ్యూలరీబాక్సు, (jewellery box—) తీసుకొని నా యెస్టిమేషన్ (estimation) లో అంతకన్నా యెక్కువ విలువయైనదైన కిస్ (A, kiss-) వకముద్దు యిటు పడై—

(అని పెట్టె కనకాని చేతికందించి, ముద్దుపెట్టుకొనును. కనకం మళ్లా పెట్టె అందిచ్చేసి,)

కన—యిందండి- మీకుకూడా నేను ప్రెజంటు యిస్తూవున్నాను. వక్క-పెట్టె కాదూ- నేనుకూడాను- (నవ్వును.)

మెం—హావ్ ఫార్చ్యునేట్ (How fortunate ?)

కన—వేళైంది వంటకు నూతికిపోయి వస్తాను.

మెం—ఐ డోంట్ లైక్ దట్. (I don't like that) నువ్వు నీళ్లు తోడు కోవడం యేంవిటి ? యెవరైనా మాట్లాడుకునా ?

కన—అబ్బే ! యీవక్క- రోజుకీ యెందుకూ ? మనయింటికి పోయేక చూసుకోవచ్చు—(లోనికిపోవును.)

[మరివకప్రక్క-నుండి, రామశాస్త్రులు, లక్ష్మమ్మ, వేణుగోపాలం సామానుతో ప్రవేశింతురు.]

వేణు—నాన్న యిటురండి- యీగది ఖాళీగావుంది.

లక్ష్మ—బాబూ సుభ్రంగా వుందిరా ?

రామ—సత్రివులలో సుభ్రం యేంవిటి ? నీ మొహం. మన యిల్లను కున్నావా ? ఓరే వేణూ యేదీ సామాను- యీసత్రివాయ నతో మాట్లాడేవూరా ? ఆయెనక పోట్లాడగలడూ-

వేణు—స్టేషన్ (station) దగ్గర మాట్లాడేను కానూ ? రూపాయికూ డా యిచ్చేను. యేమీ ఫరువాలేదులే. అమ్మా- మరేంపెట్టీ పేడా మర్చిపోలేదు కదా ?

లక్ష్మ—(చూచుకొని) లేదు. యేంవీ మర్చిపోలేదు. వారెవ్- బజా రుకుపోయి, వంకాయలైనా, మరి, యేంవైనాతెచ్చి పడె కూరకు. కట్టెలు యెక్కడ దొరుకుతాయి చప్మా ?

వేణు—నేను తీసుకవస్తానులే. నీవు మడికట్టు యిప్పుడే వస్తాను. (నిష్క్రమించును.)

(లక్ష్మమ్మ వంటప్రయత్నంకు గదిలోకిపోవును. రామశాస్త్రులు పచారుచేస్తూవుండి చటాలున వెంకటేశంనుచూచి)

రామ—(వింతగా బాగా క్రిందా మీదా చూచి) బాబూ- మీదేం వూరూ ?

వెం—మాది విశాఖపట్నం అండి. తమరిదో ?

రామ—నీపేరు వెంకటేశం కాదటోయి !

వెం—మీ కేలాతెల్సును ?

రామ—(కౌగలించుకోని) అయ్యో నాయనా నీవుపైవాడవు కావోయ్. నామేనల్లుడవు. మాచెల్లి వెంకమ్మ చచ్చిపోయినప్పుడు నిన్ను మరీ మరీ అప్పచెప్పిందోయ్. కారణాంతరాలచే నీకూ నాకూ దూరం అయిపోయింది.

(కన్నీరు నించును.)

వెం—అలాగా?-మాంవగారూ విచారించకండి. మీదయవుండడంవే పదివేలు. నాకూ మేనమాం వకాయనవున్నారని తెలసును కాని, యెక్కడ వున్నదీ నాకు యిన్నాళ్ళవరకూ తెలసింది కాదు. ఐతే మీరిప్పుడు యెక్కడకు వచ్చేరూ ?

రామ—వేరే పనిమీద కుటుంబాతో చెన్నపట్నం వెళ్ళి యీావచ్చేస్తున్నాం 'వచ్చే వచ్చేం దారిలో కనకదుర్గను దర్శనం చేసిపోదాం' అని యిప్పుడే రెయిలుదిగి సత్రివులో బసచేసేం. సాయంకాం వూళ్లోకి పోదాం.

వెం—కుటుంబంతోనే వచ్చేరూ ? యేరీ వాళ్ళెందరూ?

రామ—(గది చూపించి) అదిగో ఆగదిలో వంట ప్రయత్నం చేస్తూవున్నారు. రావోయ్ అబ్బాయీ - మీఅత్తగార్ని చూతూ గాని.

వెం—అబ్బే వంటప్రయత్నం యేంవీచెయ్యకండి. నేనూ కుటుం బం తోనే వచ్చేను. యీవేళ యిక్కడ భోంచేసురు కాని ప దండి అత్తయ్యగారితో జెబుతాను-వంటవద్దని.

రామ—ఫరువాలేదబ్బాయీ మీఅత్తవా రేవూరూ? యెన్నాళ్లై పెళ్లైందీ? నీకు యేంవిటి వుద్యోగం? యేంవిటి కథ? చూ సేవా యెంత కావలసిన వాళ్ళయినా వకరికొకరు, తర్చుగా చూచుకోక పోతే యీలాగే వకరి సంగతి యింకొకరికి తెలియదు.

వెం—నిజమే నండి. చుట్టాలన్నప్పుడు రాకపోకలు వుండాలి. తమకు ఫలానాచోట వున్నారని తెలుస్తె పెళ్లికి సుభలేఖ వ్రాసి వుందును. నాకు పెళ్లై టు యియ్యర్స్ (two years) అనగా రెండు సంవత్సరాలైంది. మాఅత్తవారిది మైసూరు. నాకూ అక్కడే వుద్యోగం.

రామ—ఓసీస్-యిటురమ్మా వకసారి యిదిగో మన మేనల్లుడు— వెంకటేశం.

[లక్ష్మమ్మ లోపలనుండి ప్రవేశించి]

యీఅబ్బాయా-? వకనాడూ నాకంట పెట్టెరు కారేం. యింత యీడు మేనల్లుడున్నాడూ? మన అదృష్ట మేనూ. అబ్బాయీ నీకేం పనీ?-

వెం—మైసూరులో మామామంవగారు దివాన్ పని చేస్తూవున్నారు. ఆరువందలు జీతం. నేను సెక్రిటరీ పని చేస్తూ వున్నాను. రెం డువందలు యిస్తారు.

లక్ష్మి—పెళ్లైందీ?-యేదీ నీభార్య? మీయింటనే వుందా? పుట్టిం టవుందా?-

వెం—ఆఁ-యిక్కడనే వుంది యిదిగో నూతికి వెళ్లింది వస్తాది. అత్తయ్యగారూ మీరు వేరే వంటప్రయత్నం చేయకండి. మా యింటనే భోజనం. మామగారితో కూడ చెప్పేను.

రామ—(పెళ్ళాంతో) ఓసేవ్-నేను మొదట మేనల్లుడూ మేనల్లుడూ అని అరుస్తే చెవిని వేసేవ్రా? రాజులాంటి సంబంధం యీడూ జోడూ యెలావుండును? వెధవ అప్పుచ్చుపు సంబాదం కోసం ఆశపడి యిల్లు మాపుకొన్నాం—

వెం—అయితే మామగారూ మెడ్రాసు యెందుకు వెళ్ళేరో తెలవిచ్చేరు కారు?

లక్ష్మ—(ముఖం దించివేయును)

రామ—యేంవని చెప్పను; బాబూ వకగ్రహచారం జరిగి పోయింది. మాయింటా వంటనులేన్ని.

[ప్రవేశం-కనకం చేత గిండెతో]

వెం—యిదిగో నండి—సాభో—

(రామశాస్త్రిలు లక్ష్మమ్మ చప్పునచూచి గుండె కొట్టుకొంటూ)
యిదిగో మాకనకం—యిదిగో మాకనకం—

కనకం—(సిగ్గుతో గిండె అక్కడ వుంచివేసి చప్పున గదిలోనికి వెళ్ళిపోవును.)

వెంక—(తెల్లబోయి) డామిట్ వాట్ ఈజ్ దిస్ నోవెల్టీ కనకమ్స్ పేరెంట్సు?(Damit-what is this novalty ? Kanakam's Parents ?)

రామ—ఓసే వెధవముండా యెక్కడకే పోతూన్నావ్ ? నిలబడి మాట్లాడవేం ?

లక్ష్మి—కనకం_కనకం-యిషుంటూరావే-యెంతటి అపృచ్ఛపు పని చేసేవే? పిడితోనా లేచి వచ్చేవ్రూ? ఔనండీ పీడా మన మేనల్లుడు దొంగముండావాడు.

రామ—ఔనోయ్-నివ్వేనా యెత్తుకవచ్చింది. వెదవాయ్-?

వెం—నేనెత్తుక రాలేదూ నన్నే యెత్తుక వచ్చింది. యెవరు యెవర్ని యెత్తుకవచ్చినా యిందులో తప్పేంవుందీ-మేనకోడలూ-మేనమరదీని; దీన్లో పరాయివాళ్లెవరు? కనకం-కమాను (come on) దాగోడం యెందుకూ?

కన—(ప్రవేశించును.)

వెం—మాంవగారూ మీరు క్షమించి, మళ్ళా కన్యాదానం నాకిచ్చెయ్యండి. లోకంలో యీలాంటి పెళ్ళిళ్ళు అక్కడడక్కడ జరుగుతూ వున్నావి. విన్నారుకదూ సుభద్రార్జునుల వివాహం. గవర్నమెంటు వారు కూడా అమోదిస్తూ వున్నారు.

[ప్ర॥ వేణుగోపాలం]

లక్ష్మి—(వేణునిచూచి గుండెకొట్టు కొనుచు) వేణూ యిదిగో నా మనకనకం—(వెంకటేశంని చూపి) యీ—

వేణు—అవునమ్మా యికన్నే నేను రికమెండు చేసేను పంతులు గారికి-

లక్ష్మి—ఔనోయినాయినా యీ వెధవాయేనూ, మన మేనల్లుడటా్రి- కనకాన్ని యెత్తుక వచ్చేడు. తగలెరా వెదవని-అవతలకు.

వెం—(కోపంతో) డామిట్ షటప్ (Damit shut up) యూ వోల్డు ఉమన్ (old woman) మర్యాదగా మాట్లాడు. (వేణుని చూచి) వేణుగోపాలంగారూ ఐ యామ్ ఎక్సుట్రీమ్లీ గ్లాడ్ టు సి యు ఎగేయిన్ (I am extremely glad to see you again)

ఖుదివరలో మనకు రిలేషన్‌షిప్ (relationship) వుందంట నాకు తెలియను. మీ ఫాదరు (father) చెప్పేరు. యిప్పుడు ఆ రిలేషన్‌షిప్ (relationship) మరింత స్ట్రాంగ్ (strong) ఐంది. దీనిలో నా తప్పేంవీలేను. మీ సిస్టరు (sister) నన్ను లావ్ (love) చేసింది. నేను ఆమెను లావ్ (love) చేసేను. మొన్ననే దేవుడిగుడిలో మేరేజ్ (marriage) కూడా చేసుకున్నాం.

మీరుకు నాలాగే పక రిఫార్మరు (reformer) కాబట్టి మా ఏక్షన్ కమ్ప్రెహెండ్ (action Comphrend) చేస్తారా? లేక మీ ఆర్థొడాక్సు పారెంట్సు (orthodox parents) లాగు పోట్లాటకు వస్తారా?

లక్ష్మి—వెధవకబుర్లు యేంవిపి చెప్తువేస్తూవున్నావురా? ఆవతలకి యీడ్చెయ్యకుండానూ?

వేణు—యెందుకే అమ్మా అంతనోరు. యిక జనంఅంతా కూడతారు. ఆయన్ని అనవలసిన పనేంవుంది? మన కనకాన్ని పిలచి, అడగవే. మనతో వస్తుందో- రాదోనో?

లక్ష్మి—రానంటే?

వేణు—రానంటే నోరుమూసుకొని చక్కా వూరుకోవడంవే? మనం చేసే దేంవుంది?

రామ—వెధవాయి కబుర్లు మాబాగానేవున్నాని. కనకం- యిటు రావే అస్పృశ్చవుముండ. అనర్ధం తెచ్చిపెట్టేవు యింటికి—

లక్ష్మి—తిట్టకండి- దాన్ని తిడుతారేం? ఓసే కనకం- అయితే యిప్పటికైనా బుద్ధితెచ్చుకొని చక్కా మీ పంతులుగారి యింటికి వెళ్తానంటావా? లేదా?

కన—నేను వెళ్ళను. నన్నేం అడగవద్దు. పన్నెండువందలకు నన్ను ముసలాయనకు అమ్మేసి; తిరిగీ నాకు బుద్ధులు చెప్తున్నావా? అమ్మా.!

వేణు—వెల్ సెడ్. ఎ లెసన్—ఎ లెసన్ టు మదర్!! (well said- a lesson—a lesson to mother)

లక్ష్మి—అబ్బా అంతవరకు ముదిరిందే పాకం- వెళ్లు వెదవాయితోను నీకు పోలీసోళ్ళతో చెప్పి బేడీలు వేయించకపోతానా?

కన—సరేలే. బేడీలు వేయించినప్పుడే వస్తాను. (వెంకటేశంతో నవ్వుతూ) యిదివరకూ వక వరుసవుందీ- మనయిద్దరికీ- సంతోషంవే- రండి యిక్కడ మరివుండొద్దు.

(అని సామానుపట్టుకొని సరుకులపెట్టె వదలి చప్పున వెంకటేశం కనకలక్ష్మి నిష్క్రమింతురు.)

(రామశాస్త్రులు లక్ష్మమ్మ గోలపెట్టుచుందురు. వేణు సరుకులపెట్టె పట్టుకొని కొంతదూరం వెళ్ళి,)

వేణు—బావగారూ- పెట్టె మర్చిపోయ్యేరూ ?

వెం—కమ్ ఆన్ (Come on) మై డియర్ వేణూ (పెట్టెతీసుకొని) మెనీ థేంక్సు (many thanks) (కనకంతో) యెంతమాట! పెట్టె మర్చిపోయ్యేం- కొంప మునిగివున్ను.

(వేణుతో) మిస్టరు వేణూ వకమారు ఖరగ్‌పూర్ (Kharagpur) వస్తారా?. అక్కడ బసచేస్తాం. తప్పకుండారండి.

వేణు—అలాగే లెండి.

కన—అన్నయ్యా వెళ్తానూ-

వేణు—సరే- కొద్దిరోజుల్లో నాన్నా అమ్మతో చెప్పకుండా వస్తానులే. (వెంక, కనకం నిష్క్రమింతురు.)

(తెర పడును.)



# THIS CANCELS ALL PREVIOUS RULES.

*Estd, in 1911.*

**Registered.** భాగవతుల నరసింహశర్మ,

ప్రొప్రైటర్,

వేగుచుక్క

గ్రంథమాల,

పూడిపెద్దివారివీధి,

బరంపురం (గంజాం)

**1928.**

NOTE THIS




TRADE MARK

## నిబంధనలు.

1. నిరూపకనవలలు, సాంఘికనవలలు, పుణ్యచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహర నాటకములు, మనోల్లాసకరములగు నితిహాసములు, చక్కని కాగితముల్తో, రమ్యమగు అచ్చుతో, రెండుమాసముల కొక్కటిగా వెలువడును.

2. గ్రంథము వెలువడినవెంటనే చందాదారులకు ఒక్కొక్క గ్రంథము ఒక్కొక్కరూపాయకి వి. పి. చేయఁబడును. ఖర్చులు ప్రత్యేకము. ఇతరులకు ప్రతిగంథము రూ 1—8—0 (ఖర్చులతోసహా)

3. ఆరుగ్రంథములు (పోస్టేజీలుగాక) సంవత్సరమునకు ఆరురూపాయలుమాత్రమే. ఈయారురూపాయలు ముందు (ఎడ్వాన్సుగా) బంపు చందాదార్లకు ఎట్టిఖర్చులుండవు. ఎప్పటికప్పుడు 1 రూ॥ అడ్వాన్సుగా పంపినను ఖర్చులుండవు. ఇందువలన చందాదారులకు రూ 2—4—0లాభముగలదు.

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథములలో నేయొక గ్రంథమునైనఁగోరిరేని ప్రవేశరుసుము 0-4-0 మాత్రమే. అట్లుకాక, తాము ప్రవేశించినపిమ్మటనుండి గ్రంథములఁ బంపఁగోరిరేని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే.

5. చందాదారులగువారు వెనుకటి గ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన మెంతమాత్రమును లేదు. వారు కోరిరేని (కోరిన

గ్రంథములబట్టి) చౌకగా ఇచ్చెదము.

6. అప్పుడప్పుడు వెలువడు అనుబంధగ్రంథములు చందాదార్లకుమాత్రమే యుచితము.

# గ్రంథరచనానియమములు.

1. Characterisation. 2 Developement of character. 3. New Ideas. 4. Historical Beauties. 5. Description of nature and other varieties.

గమనింపుడు:—చందాదారులు ప్రతిగ్రంథముఁ బుచ్చుకొనుట తమకు విధియైయున్నది. తీర పంపించినపిమ్మట గ్రంథము నెంత మాత్రము దిప్పివేయరాదు. ప్రతిగ్రంథమునకు ముందు ఇంటిమేషను పంపుదుము. ఇష్టములేనివారు వెంటనే మాకు దెలియఁజేయవలెను. త్రిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులకు మాత్రమే అనుబంధ ముచితముగా పంపుదుము. అడ్వాన్సుపంపిన చందాదారులకు ఖర్చులుండవు (రూ 2-4-0 లాభము.)

నూతనప్రచురములు. (New Publications)

## శ్రీతులసీరామాయణము.

నిర్వచనము—చిత్రపటశోభితము.

వాల్మీకిరామాయణమువలెనే హిందూదేశమునందంతటఁ బ్రఖ్యాతిఁ గాంచిన రామాయణ మిది. మనభాష కిదియొక నూతనాలంకారము. ఇది హిందీభాషయందు శ్రీతులసీదాసమహాకవిచే వ్రాయబడినది. బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే నాంధ్రీకరింపబడుచున్నది జగద్గురువగు శ్రీగాంధిమహాత్మునిచే నిత్యముఁ బారాయణము చేయుబడు నీరామాయణప్రాశస్త్యముఁ జదివినవారనేకవిధముల గొనియాడకపోరు వివిధరసములకు, సుపాఖ్యానములకు, మనోహరగాథలకు నిది జన్మసీమ ఒక్కొక్క కాండముచొప్పున వెలువడును ఆంధ్రీకృత శ్రీతులసీరామాయణముఁ బొగడుచు మహనీయులు వ్రాసిన యుత్తరములు మునుమున్న ప్రచురింపఁబడును. బాలకాండము వెలువడినది. కొలఁది ప్రతులుమాత్రము కలవు. అయోధ్యాకాండము రెండుభాగములు. ప్రతి పుస్తకమును చందాదారులకు రూ 1-0-0 ఇతరులకు రూ 1-8-0 పోస్టేజి ప్రత్యేకము. బాల+అయోధ్యాకాండముల నిండుకాలికోబైండు సంపుటము రూ 3-0-0 ఖర్చు ప్రత్యేకము. అడ్వాన్సు పంపవలెను.

# ఉగ్రభైరవము.

చందాదార్లకు రు 1—1—0 పోస్టేజి వేరే. ఇతరులకు రు 1—8—0 పోస్టేజి వేరే

గ్రంథకర్త:పోడూరి రామచంద్రరావు గారు, బి. ఏ, బి యెల్.

ఇదియొక భయంకరమైన డిటెక్టివ్ నవల. ఆంగ్లమునగల "The Hound of the Baskerviles" అను నవల ననుసరించి వ్యవహారములకమెలి వ్రాయబడినది. చిత్రపటశోభితము, హంతకుఁడొక జాగిలము ద్వారా చేయించిన యత్యద్భుత భయంకర ప్రక్రియ ఇందు నిరూపింపబడినది. తుదివరకుఁ జదువనిదే విడిచిపెట్టరు. గుండెలవిసిపోఁ జేయుచున్నాటు. వలయువారు వెంటనే వ్రాయవలెను. కొలదిప్రతులుమాత్రమే కలవు చందాదార్లకు రు 1-0-0] [ఇతరులకు రు 1-8-0 ఎల్లరకు పోస్టేజి ప్రత్యేకము.

# సర్వమంగళ

గ్రంథకర్త:—వారణాసి నరసింహారావుగారు.

ఇదియొక రసవంతమైన సాంఘికనవల. అరుంధతీ దయామయుల పరోపకార సాహిణత, సుశీలాసర్వమంగళలభయంకరకష్టములు. కామినీ భీమ్మణప్రతిహింస, డాక్టర్ భువసుందరుని దుర్మార్గాంతదురంతకార్యములు, కామవికారప్రక్రియలు, చదివితీరవలెను ఇంతయేల ? ఆంధ్రపత్రికాదిపత్రికలచేఁ బొగడ్తకెక్కిన నవల యిది. చక్కని నిండుకాలికో బైండు, మంచిఅచ్చు, మంచికాగితము.

# రసపుత్రజీవనసంధ్య

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

బెంగాళిభాష యందు శ్రీరమేశచంద్రదత్తుగారిచే వ్రాయఁబడినది. పైగ్రంథకర్త గారిచే ననువదింపఁబడినది. ప్రథమముద్రణములన్నియు నచిపోయినవి ద్వితీయముద్రణమునకు సిద్ధముగానున్నది. వలయువారు వెంటనే తెలియఁజేయవలెను. వెల 0-14-0 పోస్టేజి ప్రత్యేకము.

నాటకత్రయము—గ్రంథకర్త—భా॥ నృ॥ శర్మ.

# విజయవిజయము.

వీరరసప్రధానమగు నాటకము. కర్ణార్జునుల యుద్ధము. ఎల్లరు భారతముఁ జదివినవారే కాని కర్ణుడెట్టివాఁడో యెఱింగినవారు లేరు. కర్ణునికొఱకే యీ నాటకము వ్రాయబడినది. అనేకులుకొనియాడిన నాటకమిది. వెల రు 0-10-0 పోస్టేజిప్రత్యేకము

# 2 ప్రతిజ్ఞావిజయరామరాజీయము

లేక

# విచిత్రవీరబొబ్బిలి.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మ.

బొబ్బిలియుద్ధనాటకము లనేకములున్నవి. యథార్థములగు సంశయములతో విరాజిల్లు నాటకరత్న మిదియే. విజయరామరాజుగారి రాజనీతికి బొబ్బిలివారి పరాక్రమములకు నిది యునికిపట్టు. వెంగళరావు, రంగారావు, పాపయ్య, మొదలగు వీరుల పద్యము లగ్నిహోత్రముగను వర్షించును. దీని వెల 0-12-0 పోస్టేజి ప్రత్యేకము. కొలదిప్రతులు మాత్రమే కలవు.

# 3 ప్రతిజ్ఞాచాణక్యము.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మ.

శ్రీద్విజేంద్రలాల్ రాయ్ గారు వంగభాషయందు నాటకగ్రంథకర్తలలో నగ్రేసరుఁడని ప్రఖ్యాతి. ఆతనువ్రాసిన నాటకమునకు "చంద్రగుప్త" శిరోభూషణము. ఆచంద్రగుప్తనాటకమే యీప్రతిజ్ఞాచాణక్యము. అనేకనాటకములవారు నాటకమాడి ప్రఖ్యాతిగణించిరి చాణక్య నెట్టుఁగఁ దలంచినవారీనాటకముఁ జదివితీరవలెను. దేశభక్తికిది పుట్టినిల్లు, చందాదార్లకు 0-12-0 ఇతరులకు రు 1-0-0 పోస్టేజీ ప్రత్యేకము.

# అభినవభర్తృహరి.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈనామముఁబట్టియే యిది భర్తృహరి సుభాషితములంబోలు గ్రంథమని తెలియఁగలదు. శృంగారాది వివిధరసములకు, నీతి భక్తిజ్ఞాన వైరాగ్యముల కిది పుట్టినిల్లు మృదుమధురపద్యములు, చక్కనిశైలి, మంచి కాగితము, సొగసైన అచ్చు దిట్టమగు నట్టబైండు. కొలది ప్రతులే యున్నవి. దీనివెల 0-10-0 పోస్టేజి ప్రత్యేకము.

# కామాక్షిసరసము.

గ్రంథకర్త—శృంగారశిరోమణి, మండా వెంకటేశముగారు.

తారాశశాంకవిజయము, బిల్హణీయము, రాధికాసాంత్వనము, మొదలగు శృంగారరసప్రబంధములకంటె నిదిమేలు. ఉపదేశరూపమున శృంగారరసముఁ గుప్పించఁబడినది. నీతిబోధకము, మంచిఅచ్చు, చూడసొంపుగనుండును. మత్తేభమాలిక.

మనోహరశైలి వెల 0-[illegible]-0 మాత్రమే.

# పద్మరాగము.

(అద్భుతమైన నిరూపకనవల.)

గ్రంథకర్త:—బూర్ల వెంకటరమణయ్యగారు. ఆంగ్లేయమునఁగల "Riddle of the purple Emperor." అను నవల ననుసరించి స్వతంత్రముగ వ్రాసిన నవల యిది. పద్మరాగాద్యనర్ఘరత్నములకై జరిగిన యద్భుత సంఘటనములతో నిండి యుండును ప్రసిద్ధికెక్కిన డిటెక్టివ్ నవలలలో నిదియొకటి యని యెల్లరిచేఁ గొనియాడబడినది.

వెల చందాదారులకు రూ 1—0—0

# దుర్గాదాస్.

(రసపుత్రవీరావేశము)

వంగభాషలో సుప్రసిద్ధులగు శ్రీయుత ద్విజేంద్రలాల్ రాయిగారి దుర్గాదాస్ నాటకమున కనువాదమిది. అత్యద్భుతవీరావేశము, బుట్టించును. ఔరంగజేబు నల్లలాడించిన గుల్నార్ నాయిక. వెల ఖర్చులతోసహా 1—0—0 మాత్రమే.

# మురళీధ్వని. (అనుబంధ గ్రంథము.)

గ్రంథకర్త:—శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారు.

చక్కని భావకవిత్వమునకుఁ దోవఁజూపు పద్యరత్నము లిందుఁగలవు. శైలి వ్రానుమధురము. వెల 0—4—0 మాత్రమే ఖర్చులు ప్రత్యేకము.

# చపల. (లేక) చాంద్ బీబీ.

అత్యద్భుతకథాసంవిధానముఁ గల్గిన నిరూపకనవల.

ఇట్టిది మనభాషయందు వెలువడి యుండబోదు. వంగీయపత్రికలన్నియు దీనిని బహుభంగులఁ బ్రశంసించినవి. ఇందు ముగ్గురు రహస్య పరిశోధకులు, ముగ్గురు నాయకులు, ముగ్గురు నాయికలు, మూడస్త్రములు, ముమ్మారు ప్రయోగము, మూడు హత్యలు, మూడు పలాయనములు, మూడుమూడు జాబులు, మూడుహింసలు, మూడుప్రమాదములు, మూడు పూర్వవృత్తాంతములు, నవనీత కోమలాంగియగు మ్లేచ్ఛస్త్రీ చాంద్ బీబీ గావించిన పైశాచికకృత్యములు, నరరాక్షసుఁడగు శశిభూషణుని దుర్దాంత వ్యాపారములు, వలచిన కాంతను నిరాకరించుట, వల్లని యబలను బలాత్కరించి వివాహమాడుట పెండ్లిలో బెద్దపెండ్లి, నిద్రలో దీర్ఘనిద్ర; క్రొత్తపెండ్లికూతురు మగనింజంపినట్లు నిర్ధారణ, చింత దొంగతనము, దొంగనోట్లను సృష్టించుట, అబల దాతవియగుట, యువ

ఊడదు రాజకుడగుట, అనుమానము, వెనుభ్రూతము, మోసము, అవిశ్వాసము, భ్రమ, పరాధవము, దంభము, వేషము, హెచ్చరిక, మొదలగు విషయములతో నిండియుండును. దీనిని జదువనారంభించినంతనే, ముగించువరకు నిద్రాహారము లందభిరుచి యుండదు. గ్రంథము నీతిబోధకము ఉద్వేగ పరిపూర్ణము, కౌతూహలాక్రాంతము, పాపవ్యక్తీకరణము, పాపవిపాకసమాప్తము శైలి సులలితము సలక్షణము.

దీనివెల చందాదారులకు రు 1—0—0 ఇతరులకు రు. 1—8—0 ఖర్చులతో సహా.

# శృంగారసంధ్య.

## (గద్యపద్యాన్వితము)

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

సంధ్యాదేవి సౌందర్య శృంగారము—సతీ శివుల పవిత్రశృంగారము—రతీ మన్మథుల సరసశృంగారము—రోహిణీ చంద్రుల ప్రేమాభిరామశృంగారము—బ్రహ్మాది ప్రజాపతుల విభ్రమశృంగారము—మన్మథుని ప్రగల్భవాక్య శృంగారము—వసిష్ఠుని యనురాగగర్భితవాక్య శృంగారము—శృంగారములో వియోగము—ప్రణయము—వసంత గ్రీష్మవర్షాది ఋతువర్ణనలు—నద నదీ పర్వత సరోవనాది వర్ణనలు గల గ్రంథరాజ మిది. కాళికాపురాణాంతర్గతము—వ్యాస ప్రోక్తము. విలువ రు1-0-0

# విషమరహస్యము.

## (రహస్య పరిశోధకనవల.

మర్మములో మర్మము—రహస్యములో అతిరహస్యము.

అత్యద్భుత కథాసంవిధానము గలిగి, నిగూఢరహస్యములదే "పదచిహ్నానుసరణ" మను చిత్రపటములో చక్కని అచ్చుతో నలరారుచున్నది. ఇందుగుండెలవియజేయు హంతకుని చేతలును, హత్యాన్వేషణమునకై సర్వవిజయుని పన్నుగడలును చదువదగినవి. అడుగడుగునకును స్తంభీభూతత్వమును దిగ్భ్రమయు గలుగజేయుచుండును. ఇందు నాయిక పవిత్రప్రేమ, మిత్రకృతఘ్నత, ఆత్మత్యాగము, పాపాచరణమునకుం దగిన ప్రతిఫలము, పురుషుని మించిన స్త్రీ సమయస్ఫూర్తిజ్ఞానము మున్నగు విషయములు తప్పక చదివితీరవలెను. విలువ రూ 1—0—0 మాత్రమే.

# వైకుంఠమతము.

## (చిన్న నిరూపకనవల.)

నాగరికత పేర జరుగుచున్న ప్రస్తుత సాంఘికదురాచారముల కిద్యది యంజనమై దోచును. అందఱును చదువదగినది. వెల రు 0—8—0

# గాంధిశతకము

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈశతకము భారతికి పతకమని పెక్కండ్రు కొనియాడినారు. ఇందు 100 సీసములున్నవి. వెల 0-4-0 మాత్రమే. మచ్చునకొక సీసము:—

సీ. కోటిరూప్యము లిచ్చి ♦ కోమటివానినిఁ
గొం.వలె ననుమాట ♦ యనృత మగునె ?
చక్రనిరాటంబు ♦ చరుదెంచెఁ దొరలకు
బండి తీయుం డన్న ♦ వ్యర్థ మగునె ?
తలితప్పివచ్చిన ♦ ధాతకు నైనను
నేను మే కానన్న ♦ నింపుఁ గనదె ?
కడకు దైవము తోడఁ ♦ పడకున్న నూలు కు
తుకఁ దుంచ ననినంత ♦ దోస మగునె ?
గీ. కాల మనుకూలముగ నున్నఁ ♦ గార్యమగును;
పురుష కారంబు ఫలసిద్ధి ♦ మూల మగును;
ఎవ్వ రే మనుకొన్న మా ♦ కేమికొఱఁత
సాంద్రధీకంధి ! శ్రీకర్మ ♦ చంద్రగాంధి !. 4

# కాంతాపహరణము

కన్యాశుల్క నాటకమును మించిన హాస్యరసప్రధానమైన గ్రంథరత్నమిది. ఇందు కథానాయకుఁడు వెంకటేశము- వేశ్యలతోఁ బ్రసంగించునపు డింతటి సరసుఁడు లేడనిపించును. మోసగించినప్పు డింతటి టోపీదారు లేడనిపించును. తుదకీ కథానాయకుఁ డెల్లర నతిచమత్కారముగ వంచించి కాంతాపహరణప్రఖ్యాతి వార్జించును. ఇందలి స్త్రీపాత్రలలో కథానాయిక కనకలక్ష్మి-మాణిక్యము- వేశ్యమాత- రాజామణి చెన్నపట్టణపు వారకాంతామణి- వంచింపఁబోయి వెంకటేశముచే వంచింపబడును. అచ్చటచ్చట ముద్దులొలుకు శృంగారరసపద్యములు పాటలుగలవు- ఆమటకు అనుకూలముగనున్నది- కొలదిప్రతులుమాత్రమే మిగిలినవి. వెల, చందాదారులకు 1-0-0 రూ. ఖర్చులు ప్రత్యేకము.

మా అనుమతిఁ బొందకుండ ఈనాటక మాడరాదు.

ఇట్లు
భాగవతుల నృసింహశర్మ,
ప్రొప్రైటర్-వేగుఁజుక్క-గ్రంథమాల.
పూడిపెద్దివారివీధి బరంపురం, గంజాంజిల్లా.

## మా చందాదారులకుమాత్రమే ?

నవలలు.

| | |
|---|---|
| 1 ఉగ్రభైరవము. | ఈ 5 ఒకసారికోరిన రు 4 0 0 మాత్రమే. |
| 2 పద్మరాగము. | రెండు ఒకసారికోరిన 1 10 0 ,, |
| 3 చపల (లేక) చాందబీబీ | మూడు ఒకసారికోరిన 2 4 0 ,, |
| 4 విషమరహస్యము. | నాల్గు ఒకసారికోరిన 3 0 0 ,, |
| 5 సర్వమంగళ. | ఖర్చులు ప్రత్యేకము. |

నాటకములు.

| | |
|---|---|
| 1 విజయవిజయము. | ఈనాల్గు ఒకసారి కోరిన రు 2 8 0 మాత్రం, |
| 2 విచిత్రవీరబొబ్బిలి. | మూడు ఒకసారికోరిన 2 0 0 ,, |
| 3 ప్రతిజ్ఞాచాణక్యము. | రెండు ఒకసారికోరిన 1 6 0 ,, |
| 4 దుర్గాదాస్. | ఖర్చులు ప్రత్యేకము. |

కావ్యములు.

| | |
|---|---|
| 1 అభినవభర్తృహరి | ఈ 5 ఒకసారికోరినయెడల రు 2 0 0 మా. |
| 2 శృంగారసంధ్య | ఖర్చులు మేమే భరింతుము. ప్రత్యేకముగాంగో |
| 3 మురళీధ్వని | రిన ప్రత్యేకప్రధర- ఖర్చులు ప్రత్యేకము. |
| 4 గాంధితిలకము | |
| 5 కామాక్షిసరసము | |

### శ్రీ తులసీరామాయణము:—

బాలకాండము, అయోధ్యాకాండము రెండుభాగములు విడిసి మూడుభాగములు 3—0—0. ముందుగా 1 రూ॥ అడ్వాన్సుతో ఆర్డరు రిజష్టరీచేసికొన్నవారికి నిండు కేలికోబైండు ప్రతి పంపబడును. ప్రత్యేకముగా ఒక్కొక్కభాగము గోరిన నొక్కొక్క రూపాయిమాత్రమే- ఖర్చులు ప్రత్యేకము- కొలదిప్రతులుమాత్రమే గలవు.

దొరుకువారు:—భాగవతుల నృసింహశర్మ.
వేగుంజుక్కగ్రంథమాల, పూడిపెద్దివారివీధి.
బరంపురము, గంజాంజిల్లా అని వ్రాయవలెను.

☞ గమనింపుడు:—మా చందాదారులు, తమరు వచ్చుచిట్టి పార్సెల్సుపైని, మా చిరునామా బాగుగ గమనించినవిమ్మట సొమ్ముచెల్లించి పుచ్చుకొనవలెను.